

పల్లెపడుచులు

లేపాక్షి దేవాలయములోని ఒక ప్రాచీన చిత్రమునకు శ్రీ హెచ్. వి. రామగోపాలు తీసిన పరిశుద్ధమైన నకలు



సంపుటము 24
సంచిక 10

భారతి

అక్టోబరు 1947
సర్వజిత్తు, భాద్రపదము

# గాంధిజీ

శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులు

[మహాత్ముని 79-వ జన్మదినోత్సవమున ఆయనను మించిన వృద్ధమూర్తి దేశభక్తుని కవితోపహారము.]

తరములుదాట యత్నముల దండిగ జేసిరి పూజ్యులందరీ
తరమున జేసె గాంధి మహాత్ముడు తాపసి దీక్ష తీవ్రతన్
వరల తపోబలంబుననె వచ్చె స్వరాజ్యవరంబు భోజ్యమై
కరములు మోడ్చి నమ్రతను గాంధిమహాత్మ నమస్కరించెదన్.

భారతమాత గర్భమున పండిన పంట మహాత్మగాంధి యీ
భారతదాస్య శృంఖలము బాపగబుట్టిన భవ్యమూర్తి యీ
భారత ధర్మమార్గముల భారతమందును లోకమందునన్
బారగజేయ గంకణము పట్టుగ గట్టెనుగాదె గాంధిజీ.

కొట్టగ కఱ్ఱలేదు మఱి కోయగ ఖడ్గములేదు శస్త్రముల్
పట్టగరాదు శాత్రవులు పట్టిన గొట్టిన నేమిచేసినన్
రట్టును రద్ది చేయకను రమ్మని పిల్చినతోడ బోవుటే—
యిట్టిది యుద్ధపద్ధతి మఱెట్టుల గెల్వగ సాధ్యమయ్యెనో!



# విషాదగీతి

— శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి —

ఓ కవికోకిలా, విడిచితో జగ, మీ యఖిలాంధ్రలోక బా
ధాకులమైన నీస్మృతికి నశ్రులు రాల్చెద నేనుగూడ; నీ
లోకమునందు నేను, పరలోకనివాసివి నీవు, లేదు మి
త్రా! కనబోలు పుణ్య; మెద వ్రయ్యలుగాగ విషాద మేర్చెడిన్.

నీ కవితాప్రపంచమున నిల్చు నొకించుక రామిరెడ్డి, నా
యాకులపాటు దీరి హృదయంబున దోచు మహాప్రమోద మే
దో, కలకాల మిల్లె రసతోయధి దేల్తువు త్వద్వియోగ బా
ధాకలుషంబుగాని యొక తన్మయసిద్ధి వహింతు నే నికన్.

సమయముగాదు నీ కిది స్మశానములో నిదురింప; లెమ్మ, ప్రే
మమున దపించు నీ వనకుమారికి నూపిరివోయు; నీ విషా
దము సహియింపలేని జలదాంగన జాడుము; ఈ కృపీవలుం
డమితవియోగబాధ నకటా! భరియింపగలేడు జీవమున్.

నీకడ గానరీతులను నేర్చిన కోకిలముల్ వనంబులో
నో కవికోకిలంబ, సరసోక్తుల బాడగలే వదేమొ, ఆ
శా కమనీయమైన నిమిషంబులలో మధుమాసవేళలో-
ఆకలిదప్పు లున్నె హృదయవ్యథ లగ్గలమైన చోటులన్ ?

నీకు స్మశానభూమి రమణీయముగా నట నున్న వారికిన్
శోకరసార్ద్రగీతములు చూఱలొసంగుచు నుంటివేమొ యీ
లోకము వాసి నీవు నవలోకము జేరినగాని పాడుకో
లేక సుఖింపలే వనుచు రెడ్డికవీశ్వర నాకు దోచెడిన్.

పరిచయ మించుకంత గలపాటికి నా హృదయంబు దగ్ధమై
చుఱచుఱలాడి నీకొఱకు సోనలువారగ నీ కవిత్వపున్
ఝరి నుదయింపజేసినది సంస్మరణంబున నీకు నాకు ని
ర్భరమగు మైత్రి నిల్చినది ప్రాక్తనపుణ్యము శాశ్వతంబుగన్.

కడపితి జీవయాత్ర త్రుటికాలమె యేబదిరెండువత్సరాల్
పుడమి వసించితో పలుకబూనినచో శతవత్సరంబు లీ
కడ విహరించియున్న నవకం బొలికించెడు నీదు సృష్టి యీ
యెడ విడిపోయియుండు దని యెంతు నఖండముగాగ మాకునై.

# ఖండకావ్యము: సింహావలోకనము



— శ్రీ కవికొండల వెంకటరావు —

ఖండకావ్యం తెనుగున నిసర్గంగా వెలిసిందని నా విశ్వాసం. ఏలా అంటారా, ఆదిని కేవలప్రపంచమే మహాకావ్యంగా వున్నప్పుడు, భారతరామాయణాది పురాణాలు దానిముందు ఖండకావ్యాలై పెంపొందాయి. అవి సమగ్రరూపం తాల్చడంతోనే ప్రబంధాలు ఖండకావ్యాలై వెల్లివిరిశాయి. వాటికి గురుత్వం ప్రాప్తించినపిమ్మట, నేటి ఖండకావ్యం, సినలైన ఆకారంతో, అన్వర్థపు టభిజ్ఞానంతో, కలకండలా తెనుగునోట మాధుర్య మొలికిస్తోంది. చూడండీ! భాగవతకృష్ణుణ్ణి తల్చుకుంటే ఎన్నో పోకిళ్లూ, పురుషకారాలూ మనల్ని తెమలని సంకెళ్లల్లా బంధిస్తాయి. ఆతగాణ్ణే పారిజాతాపహరణ నాయకునిగా జేసికొని అనుసంధించుకున్నామా, ఒక్కటే జవాబు—

"జలజాతాసన వాసవాది సురపూజాభాజనంబై తనర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిర మచ్చో వామ పాదంబునన్ దొలగన్ ద్రోచె లతాంగి"

నిజంగా తిమ్మన్న ప్రథమాశ్వాసంతో ఆగివుంటే అది ఎంచక్కటి ఖండకావ్యం. తద్వతుగానే గార్హస్థ్యప్రవరుడు "దానతపోగ్నిహోత్ర పరతంత్రుడనేని" అని తిరోహితుడు కావడంతో "స్వస్తి ప్రజాభ్యః" అంటిమా అదో ఖండకావ్యపు మేలింమొడత్రిప్పు. మరిన్నీ చిరత్నాలైన జంగంకథలు కొన్నీ, జక్కులపదాలు కొన్నీ వాటి పట్టులోనూ, పాకంలోనూ ఏ దేశంలో ప్రభవించిన ఖండకావ్యాలకూ ఏమాత్రం తీసిపోవు. ఇంతవట్టు కొండాడింది ప్రస్తుతాంశానికి మూలవిరాట్టూ, మొదటిమెట్టూను. అందునుండి తెగ్గొట్టడంలో ఒక్క తెగింపు ముక్క జారవిడిచాను. "నేటి ఖండకావ్యమే సినలైనదీ, సార్థకమైనదీ" అని. అది సమర్థింప గల్గడమే యీ రచనయొక్క పరమావధి.

ఉదాహరణకు మునుముందు సొంతం వొకటి వుటంకించి, దాని యూపిరీ, యుపజ్ఞా సమీక్షకై మీముందుంచుతూన్నాను. ఇది స్వోత్కర్షచే గాదు. ఎవరి రచనలు వారెంత పొగడికొన్నా, వానిలోని విజృంభణానికీ, వివేకానికీ సహృదయు లిచ్చే విలువే విలువ. కాగా నా అనుభూతి నేను రూఢిగా నిరూపింపగలనేమో అని ఆశ. ఇతరం అంతతిరంగా శ్రుతపర్చడ మనేది తలుగని మీమాంస. సినలైన ఖండకావ్య మెప్పుడూ ఏకైక సందర్భాన్ని పురస్కరించుకుని, ఆ సందర్భాన్ని సంస్కరించుకుంటూ రససిద్ధి పొందుతుంది. ఏతావతా—గోదావరి నది వొడ్డు మోసి ప్రవహిస్తూవుంది. రాత్రి చీకటిగుయ్యారం. అప్పుడుకూడా ఆ నది ఆలాగే తెప్పదేరలగ నడుస్తూ వుంటుందా? లేక తిప్పవాటున కుంటుగొంటుందా? ఇది

సందర్భసూచన. దీనికి సంస్కారం ప్రబ్బిన మబ్బు, ఉబ్బే సముద్రం, అబ్బురంగా మానవుడు వినిర్మించుకున్న వంతెన ఇమ్మామూను. క్రమ్మిన కాదంబిని కురియదుగాని, కురిసేపర్యంతం ఉరవెక్క అంధస్సు నిను మడిస్తూ వుంటుంది. అపారాంభస్సు నదీమతల్లితో సంగమం గావడానికి బదు లుత్తుంగ భంగాల్తో ఎదుర్కొంటుంది. కంబా లుంటాయా, ఊడతాయా అనే విచికిత్సను సర్వం అగమ్యమై సేతుబంధన మిసుమంతా గోచరించదు. ఇక విశిష్టత? అంభారవం పంక్తిచ్ఛందోబద్ధమై ఏతన్నదీనిరంతరచైతన్య సందేశంగా వారిధివంకకు గాలిలో తేలి ముఖరితం కావడమే. ఇదంతాకూడా సందర్భమునకు అలవరచిన సంస్కారం. ఆ సంస్కార మనేది కవిహృదయంలో అనుభూతిగా పొదిగివుండడమే రససిద్ధి. "అహాహా! తామసహృదయజన్యప్రశస్త జానపద గీతికలకంఠు స్వైరమగుచు దూర దూరమై అ న్నీరరవళి వినుచు." "ఏ న్నీరరవళి?" అని ఆలోచనాగాధనవగాహ తత్పరుల మైతిమా, కన్నీటి రవళికూడా స్ఫురిస్తూ, జన్మకు జన్మకు గల అంతరమండలి అజ్ఞాతపథజీవనంయొక్క పొడుగువడని ఆత్మీయాధ్యాత్మికపు జిద్వికాసం, స్వచ్ఛందంగా అచ్ఛంగా సాగుతూవున్నట్టు తట్టకమానదు. అనుకోని పరిణతి, ఉద్బోధాను! అవధారు! ఖండకావ్య మంతా సావధానంగా చదువుతాను. అన్నీ నాలుగే పద్యాలు. పదహారే చరణాలు. వ్రాసినప్పుడు ఖండకావ్య మందామా, ఏమందాం, అనే సందడే లేదు నా డెందంలో—

"కృష్ణపక్షమువ నిశి వెన్నెల నిరాశ
నెంతో పెద్ద నల్లని మేఘ మెచటినుండో
మూసికొని వచ్చి చుక్కలరాశి తుడిచి
కన్నుకన్ను కనబడని కాలు గ్రమ్మె.

నామది దోచె నొక్కటి ఘ
   నమ్మగు నయ్యెరులన్ గనన్, తద్రై
కామృతధారవోలె వఱ
   దందుకతోట్టు నదీజలంబు, లీ
యామిని నంధకారమున
   నాగక వెల్లువ జాలువాఱునో,
యేమిటి కంచు నయ్యవియ
   యెక్కడి కక్కడ నిల్చిపోవునో?

ఒక నిముషంబు సుస్థిరత
   యోజన పల్పితి, లీనదోయికిన్
దోకతోక నీరసాశమున
   దోయదనిర్ఝరమారుతశ్రుతిన్
వికలముగానిదై, శరపి,
   విశ్రుతమై వినుకొద్ది స్పష్టమై,
ప్రకటితమయ్యె నిర్ఝరిణి
   రావము వారిధి కంఠపంక్తినే.
స్వాదుతర మయ్యె, చీకటిపట్టునందు
దూరదూరమై వినుచు నన్నీరరవళి;
అహాహా ! తామసహృదయజన్యప్రశస్త
జానపదగీతికలకంఠు స్వైరమగుచు."

నాలో ఈ కవిత్వమన్నది కళాశాలా వాతావరణాన్ని, గౌతమీవిలాసాన్ని, మాపూరైన శ్రీరంగపట్టణపు ప్రకృతిరమాప్రమేయాన్ని బట్టి పుట్టుకొచ్చి, యిప్పటి కిన్నూరుబుతువులై అక్షురకోటిక పడగెత్తింది. నాలాగే, ఆ సమయమందు భావనాలోలురై వున్న బాలురు, కళాశాలా విద్యార్థులు—మాతో విద్యార్థిను ల్లేరు—ఎందరెందరో ఎన్నెన్నో "తెనుగుబాస వినిర్మింప దివ్వరు" వారలని యీ వీనుల

బడ్డాని కెంత లేదన్నా యెన్నేండ్లయినా పట్టింది. కారణం, అవి అచ్చొత్తించుకోవడం ఏలాగో తెలియకొ్కంత,—ఇంతకూ అచ్చున వచ్చే మెచ్చుకో లేపాటిది, ఆత్మానందంతో సాటిమైనదా అనే ధీమా కొంత. ఈ దోసందులో మదరాసున "లిరిక్" నకు సరివచ్చు వ్యావహారిక నామము "భావ గీత"గ ప్రకాశితమైంది. దాన తట్టింది నాకు ఒక తరహా కావ్యాని కాపేరు పెట్టి ముద్రించుకోవచ్చునుగదా అని. మిత్రులం మాలో మేం సంప్రతించుకొని, సిద్ధార్థి యుగాది నాడు "రాణ్మహేంద్రవర నవీనాంధ్ర సారస్వతం" అనే పేరట, మువ్వురం మూడు రచనముల నొకదాని కొకటి బాసటగ గుదిగుచ్చి "వైతాళికుల"కు వైతాళిక మనేలా వెలయ జేశాం నాలుగు పేజీలు. తద్‌జ్ఞుడు వా. జె. కూాడ్డేని) ఆ నగరంలోనే వున్నాడు నాడు. "డూడూడూడూడూ వెంకన్నా" లోని అమాయకరుతి, "బెండు తెప్పను లీల విలసిల్లు వెలుగ" అనే ఎత్తుగడను దోచే ఆందోళన ప్రతిబింబం, "తెలివలపు" నందలి చాయలు ఆ ఆచార్యాధ్యక్షుదక్షుణ్ణి ముగ్ధునిగా చేశాయి. దాంతో ఇదంతా తెనుగు వారి పుట్టుహక్కు, ఇది లాతివానినిగూడా ఆకర్షిస్తూవుందని నేను మురిసిపోయాను. ఉపరి, మావాణి, తెనుగు సారస్వతం యొక్క పుణ్యఫలపునరున్మేషం (Renaissance) గా పాటించుకొన్నాం.

ఇదేమచ్చున మా పరోక్షమందు నాగావళీఝుళీప్రోద్బలంచే ఎగుసీమను, కృష్ణవేణీ ప్రచోదనంచే దిగుసీమను నవ్యత ఉత్పన్నమైంది. పెన్న కెక్కింది. తామ్రపర్ణిని తట్టింది. చతురుదధివలయితమునందలి ఎక్కడెక్కడున్న ఆంధ్రుల్నీ మేలుకొల్పింది. ఈయుదంతం వారికి వారికి అనుకోవడంవల్లను, ఈ దరిమిలాను విశేషంగా ప్రచారం గావడంవల్లను లోకానికి వెల్లడిపడింది. గురజాడవారి ముత్యాల సరాలు, మండపాక, పురిపండా, పన్యాల మున్నగు వారి కావ్యాలోకవంక, బసవరాజువారి గేయాలు, రాయప్రోలు, అబ్బూరి, విశ్వనాథ మున్నగువారి కావ్యాలోకవంక తల చూపి,మన కేనాటినుంచో వస్తూవున్న వాటికి మల్లే వినిపిస్తున్నాయి. అప్రయత్నంగా అందుకో తగ్గ ముద్దునుండి అడిగి వేయించుకొనే మధూకరపు ముద్దవలకు అసంఖ్యాకాలు ఇతివృత్తాలైనాయి. పాత్తములు 'మునిమాపు', 'కంఠమాల', 'విపంచి', 'గానమాధురి', 'సుమవల్లి', 'కదంబము' లాంటి పేర్లు వహించాయి. 'మీారు మనసారగా నేడ్వసీరు నన్నూ' 'రండు చిమ్మటలార! ఈ రాత్రివేళ' 'నీ నీడలోనే మేడ కడత నాయుడు బావ' 'చుక్కలు దిరిగే హిమాద్రిపై ఆ వాసముచేసే గౌరీశా' లాంటివి కృతికర్తలను చెప్పకే నప్పకొనేలా అమల్లో కొచ్చేశాయి. 'పలితకేశం' 'హంపి' 'కత్తిపడవ' మన కళ్ళ ద్దాల్లో పటాలు కట్టుకొన్నాయి. 'ప్రపంచాగ్ని' 'రుధిరజ్యోతి' 'ఇనుపగజ్జలు' అన్నవి మన గుండెల్లోకి ఉద్రేకాన్నీ, ఆరాటాన్నీ 'పారాచూట్సు' మల్లే దింపుతున్నాయి. ఈ పరివర్తనం అంతా నిమిషాల్లో పరిశీలించడం అంటే ప్రాణాహుతులుదాకానైనా పోని పరిపేచన మనుకోండి!

౧౯౫౧-౧౯౫౨ ఒక దశ గడచేసరికి కృష్ణా పత్రికలో, సఖలో, ఆంధ్ర సంచికల్లో "ఎందెందు వెదకి చూచినా" అన్నట్టు

చేడా అదంతా ఆ పాఠకునియొక్క స్వార్జితమైన ఖండకావ్యసంపుటి అయి బ్రహ్మానందం కలగజేస్తుంది. రసం చిలుకుతుంది. మానసాన్ని దివ్యవిమాన మెక్కిస్తుంది. అఖండజ్యోతిగా సాక్షాత్కరిస్తుంది.

"ప్రభలలో ప్రభ నిలుప నెవరోయి?
ప్రభలలో ప్రభ గలుప నెవరోయి?"

....................

"అర్ధభాగపు మహాంకాళీ
కర్ధ మది కాళేదో ఏమో
పునుకులా గలగలలు వింటూ
కునుకుగన్నాదో?
నాథునీ వద్దనదు నాట్యము
నాథునీ కద్దనదు!
అరెరే! ఆడిపోతున్నాయి!
వాడినుమొగ్గనవాలు హుంతభుక్
అజకపాలం డొక్కడుబుడక్
నాల్గుచేతుల నాడు తౌతున్నాయి!
కరథ కరథ కృరథ కరథ!
పందెమూ వేసేది యెవరోయి?
కుందనము గాసేది యెవరోయి?
కాఱు నల్లని కాళరాత్రి!

....................

అహంకారము లేదు లోలో
మహార్ణటనము మొగము చాటదు
మహాదేవా! అభయ మిడు మన
అభినయానకు హా స్తమే లేదు.
రభసమున తన ముందువెనుకల
ప్రభల గలిపించు;
ప్రభలలో ప్రభ గలుప నెవరోయి?
ప్రభలలో ప్రభ నిలుప నెవరోయి?
కాఱు నల్లని కాళరాత్రి!"



# మహిషాసుర మర్దనము



శ్రీ బులుసు వెంకటేశ్వర్లు

మహిషుం డుద్ధతి స్వర్గరాజ్యమును సంగ్రామంబునన్ గెల్చి దో
ర్మహిమన్ సర్వనిలింపులన్ సురపతిన్ మర్దింపఁగా, దేవతల్
ద్రుహిణుం దోడ్కొని పాహిపాహి యను నాదల్ సేయుచున్ విష్ణు రు
ద్ర హితస్థానముఁ జేరి మొఱ్ఱ లిడ నా దైవంబు లార్ద్రాత్ములై.

ఊహింపన్ క్షణమాత్రలో హరిముఖోద్భూతంబునై తేజ మొం
డు హరప్రస్ఫుటసుప్రభం గలిసి యంభోజాసనోత్పన్నస
న్నిహితాంశం బగు తేజముం గలిసి యున్మేషంబునై సర్వదే
వహితార్థంబుగఁ బర్వె నెల్లదిశలన్ బ్రవ్యక్తరూపంబునన్.

హరతేజంబున నాననంబు, యమతేజోంశంబునన్ గేశముల్,
హరితేజంబున హస్తముల్, విధుని తేజోంశంబునన్ జన్నులున్,
హరితేజంబున మధ్యమున్, వరుణతేజోంశంబునన్ జంఘలున్,
జరణాద్యంబులు నిల్లై యొప్పఁ గలిగెన్ శర్వాణి దైవాంశయై.

తన చేనున్న త్రిశూల మిచ్చె హరుఁ డా తన్వంగి, కావెంటనే
తన చక్రంబును జక్రి యిచ్చె, మఱి యింద్ర బ్రహ్మ దేవాదులున్
ఘనవజ్రంబును నక్షమాలయును ఖడ్గంబున్ ధనుర్బాణముల్
ఫణిహారాదిక మిచ్చి చేసిరి జయధ్యానమ్ము లాత్మమ్మదిన్.

సురవాంఛాపరిపూరణార్థము జగత్క్షోభోపశాంత్యర్థమున్
సురదత్తప్రముఖాయుధప్రకరతేజోరాశు లాత్మప్రభా
పరివాహంబున నైక్యమై కొలుచుచున్ బ్రహ్మాండముల్ నింపఁగా
నరసీజాక్షి కడంగె దైత్యపశుయజ్ఞప్రక్రియల్ దీర్పఁగాన్.

ఆయమ రౌద్రరూపమున నద్భుతభీకరసింహనాదమున్
జేయుచు దేవసైన్యములు సిద్ధములై తనవెంట నంట న
త్యాయతబాహువిక్రమ మనంతముగా నుఱుమాడుచుండ దై
తేయులు చచ్చి విచ్చినగతిం గని దానవుఁ డార్చి పేర్చినన్.

మహిషున్ జంపఁగఁ దీవ్రపాశమును భీమప్రౌఢిఁ బైఁ నేయఁ, దత్
ప్రహతిన్ దైత్యుఁడు మాయనై కన మృగేంద్రత్వంబుఁ, దత్కంఠమున్
రహిఁ జండాసిని ద్రుంచె దేవి; మఱి యా నక్తంచరేంద్రుండుఁ దా
నహియించెన్ గజరూప, మాయమయుఁ ద్రైన్వంజేసెఁ దద్ధస్తమున్.

మానితవీరుఁ డయ్యసుర మాహిషరూపముఁ దాల్చి యార్చుచున్
కాననవృక్షముల్ గిరులు గర్వమునన్ బెకలించి తెచ్చి య
మ్మానిని నేయ, శాంభవి క్రమంబున నింగికి లేచి కాలి న
ద్దానవుఁ ద్రొక్కి భూమిఁ బడఁ దచ్ఛిర మేసి వధించెఁ గ్రోధనై.

నిజరాజ్యంబును గాంచె నింద్రుఁడు, సురానీకంబు మోదించె, న
ద్ద్విజవర్యుల్ ఋషివర్యు లెంతయును గీర్తింపంగ నాదేవియున్
నిజకార్యంబు సమాప్తమైనకతనన్ వెన్వెంట నదృశ్యమై
విజయంచేసిన, నాదినంబు భువిలో విఖ్యాతమై యొప్పెడున్.

స్వధయున్ స్వాహయు నాత్మవిద్యయును శాస్త్రజ్ఞానసారంబునై
విధినై విష్ణుభుజస్థితిన్ రమ యనన్ వేద్యంబునై శర్వన
న్నిధి సామే నయి విప్రులన్ క్షమ యనన్ విజ్ఞానులన్ బుద్ధి నాఁ
బ్రథనుం గాంచిన దేవి మా కొసఁగుతన్ భద్రంబు లవ్వారిగాన్.

---

# కరువు కాలం

[చిన్నకథ]

•

శ్రీ బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

అప్పడు చిన్నప్పటినుంచి ఒక రెండెడ్ల బండి పెట్టుకొని, సంతలకి తోలి, అక్కడ మిరపకాయలు, ఉల్లిపాయలు, ఎండుచేపలు తెస్తే, భార్య నంసి, వీధిలో బండరాయిమీద దుకాణం పెట్టి అమ్మేది. వాళ్ళిద్దరూ గంజినీళ్లు తాగి ఒక మడిచెక్క ఆర్జించారు. కూతురికి పట్నపు సంబంధం చేశారు. కొడుకు నారాయుడు ఎదగగానే, పొలంమీద మూడువందలు అప్పు చేసి, జట్కాబండి కొన్నాడు. అప్పడు ఇప్పడు బాగా ముసిలాడయేడు. ఇప్పుడు బండీ ఎడ్లు లేవు. మడిచెక్క మాత్రం మిగిలింది.

అప్పడు ఇంటి కొచ్చి వీధిలో పొగాకు నములుతూ కూర్చున్నాడు. చీకటిపడుతూంది. నారాయుడు పొద్దున్న జట్కాబండి పట్నం తోలుకెళ్లి ఇంకా రాలేదు. నరిసి పొయ్యిలో నిప్పేసి బయటి కొచ్చింది.

"ఏఁవే, ఈడే టింకా పికరే లేదు. పెందంకడ సల్దిగంజి తాగి పోనాడు. దీపా లెట్టే వేలయింది"

వాడు ఇంటికి రాకపోతే అప్పడికి బెంగ, చీకాకున్నూ.

"ఎటో బేరం తగిలిందిగోవోసు" అంటూ నరిసి, బురదయిన కాళ్ళకడియాలు చీరకొంగుతో తుడిచింది.

"ఏటో ఎకవకుంక. సిన్నతనంగాదు, సితకతనంగాదు"—చిరాగ్గా అన్నాడు.

"ఆడి నెందు కేటి తిడతావు? ఆ డేటి సేసినాడు?

"అదుగో నీనుంచే ఆ డొట్టి పోకిరీ అయిపోనాడు. ఇంక ఆడు నన్నాదుకొనే దేటి?"

"నేక నేక ఒక్కడు పుట్టినా డీ కడుపుకి—"

"సాలూం, కోఁవే. నీ దొట్టి మూరకత్వం—"

"పోసి, సిరిపర పాళ్లు బొట్టి నిస్తామన్నారుగదా—ముడెట్టేరాదా?"

"అదే సూసినాను—తులం బంగార మెడతారట. రెండుతులా లెట్టమన్నాను. ఏదో సూసి ముడెట్టిపొమ్మంటాను ఎదవని—"

"బాగుందినేరా—సత్తిగాల పోడాడు—"

"ఓసోస్, నీకే ఎరికే? ఆ డేసాలు–ఆడూ—, ఆడి సెరాయి, సొక్కా, వోసన్నూని! పెందలకా డెలతాడు. మాపిటి కొస్తాడు. మూడు రూపాయలు దొరికాయంటాడు. అద్దరూపాయి తాగేస్తాడు.

పావలా కబ్బులో తినేస్తాడు. అణా బీడీలు కాలిసేస్తాడు. ఈడి బతుక్కి బీడీలు, కబ్బులు, వోనననూనెలు! ఇంటికి రెండు రూపాయిలిస్తే-గడ్డికీ, ఉలవలకే అవుతాంది రూపాయిన్నర. దీని సిగతరగా-పావలా ఉలవలు ముప్పావలా అయినాయి! ఏం పిరుం! ఇంక పొయ్యిమీదికి గింజ లేటి తేవాల? ఆ అప్పెలా తీరుతాది? రానీ, సెబుతాను. సెప్పినమాట ఇన్నాడా సరే, నేదా పెల్లి సేసేసి, ఏరుపోయి వొండుకో మంటాను. పోనీ, నాకు కొడుకు పుట్టే నేదనుకుంటాను—"

ఆ రోజు అప్పడి చిరాకుకి కారణం ఇంట్లో బియ్యం లేవు. ఊళ్ళో ఎక్కడా దొరకవు. నన్నాసినాయుడు పెళ్లాంమాత్రం రూపాయికి శేరుచొప్పున అమ్ముతోంది. నారాయుడొస్తే పోనీ, అలాగే తెద్దా మనుకున్నాడు. వాడూ లేడు, డబ్బూ లేదా.

బాగా చీకటిపడింది. నారాయుడు "గంగరమె దివాలీ" అని పాడుకుంటూ జట్కా నిలబెట్టాడు. గుర్రాన్నిప్పి సాలలో కట్టేసి, ఊగుతూ, జోగుతూ లోపలికొచ్చి వంటపొయ్యిదగ్గర కూర్చున్నాడు.

"బేగి కూడెట్టే—" ఎర్రగా చింత నిప్పుల్లా ఉన్న కళ్లు మూతలుపడుతున్నాయి.

"గింజ లేవీ?" నరిసి అప్పడికి వినబడకుండా అంది. కాని అప్పడివి పాముచెవులు.

"ఓ రబ్బోయ్, నువ్వు గడించేసిన డబ్బుకి కూడొకటి! సిగ్గునేని నమిడీకొడకా, ఎటెల్లినావురా ఈ ఏల దాకా—"

"ఉపనుకి బేరం తోలినాను"-నారాయుడు ఇంట్లోపిల్లి, బయట కోతి.

"ఏటి దొరికిం దీపొద్దు ?"

"రెండు"

"పొద్దంతా తోలినావు"

"నన్నేటి సెయ్యమంటావు? అంతే"

"ఓరె! ఎంత పనికిమాలినోడి వయినావురా" నిస్పృహగా కూర్చున్నాడు.

"తేరా ఆ రెండూను. రూపాయి ఉలవలు, రూపాయి గింజలూ తెత్తాను" అన్నాది నరిసి.

నారాయుడు జేబులోంచి రూపాయి తీసి ఖంగున పడేశాడు.

"ఓ రూపాయి కరుసయిపోనాది—"

"రూపాయి కరుసే! ఓలమ్మ రూపాయి తాగేసినాడే" నరిసి ముక్కుమీద వేలేసుకుంది.

"ఏరా, రూపా యేటి సేసినావు?" అప్పడు గద్దించాడు.

"కరుసయిపోనాది. అర్ధ రూపాయి తాగినాను; అర్ధరూపాయి మద్దినాళ్ళ సినీమా కెల్లేను"

"ఓలమ్మో, ఎంత పోకిరయిపోనాడు" నరిసి నెత్తీ నోరూ కొట్టుకుంది. కళ్ళంట నీళ్లు రాకపోయినా నరిసి ప్రతిదానికీ ఒట్టి కొట్టినే ఏడుస్తుంది.

"పోనీ, కడుపుకి తాగినాడంటే నేనేటంటాను? ఎదవకుంక కీ ఏసా లేటి?"—అప్పన్న కోపంగా పెదవికరిచాడు. అప్పడి దృష్టిలో తాగడం అవసరం; గొప్పకూడాను. కాఫీక్లబ్బులు, బీడీలు, సినీమాలు మాత్రం విలాసాలు.

"పోరా, నాయింటోంచి పోయి ఏరే ఒండుకో. నువ్వేటి, నాకు గంజినీళ్లో నేదేటి?

నాకు కొడుకే నేడనుకుంటాను. పో—సీ! సిగ్గునేని జలమ ఎత్తగానే సరా?"

"ఒరే, రూపా యిచ్చినావ్రు, గుర్రానికే బెట్టడం, గింజ లేటి తేవడం సెప్పు" చేతిలో రూపాయి పట్టుకొని ఆలోచిస్తూంది నరిసి.

నారాయుడు మెల్లిగా లేచి కుక్కిమంచం మీాద కుక్కలా ముడుచుకొని పడుకున్నాడు.

"ఈ ఊటో గట్టెక్కిస్తాడని బెమపడ్డాను-ఏటో నాకరమం!" అనుకుంటూ, వీథిలో అడుగులు చప్పుడయితే చూాదామని వెళ్లేడు అప్పడు.

"ఎవ్రడోరయ్యా! ఆవల"

"నేనురా, సిన్నోడిని"

"ఏటిరోయ్, బావమరిది! ఎటినుంచేటి—?"

"నకిడాం ఎల్లేను; ఇలా సూసిపోదామని..."

"ఒసేయ్, మీా సిన్నోడొచ్చినాడే"

కోర మీాసాలు, తలపాగా, ఎర్రబనీను, గోచీ, చేతిలో మువ్వలకర్ర, కిర్రుజోడూ తయారయాడు అప్పడి బావమరిది చిన్నోడు. వాడి నందరూ పలకరించారు. కాని అందరికీ చింతగానే ఉంది ఇంట్లో బియ్యం లేవని.

"కూకోరా, ఇం కిప్పు డేటెల్తావు? కూడుతిని తొంగుని, కోడికూసేజాముని లేసి ఎల్దుగాని—" అప్పడు ఇంట్లో బియ్యం లేక పోయినా చుట్టాన్ని ఉండమని, బావమరిది దగ్గర తన దర్జా చూపించాడు. బావమరిది కాళ్ళు కడుక్కుని గోడకి జారపడి చుట్ట వెలిగించాడు.

నరిసి గుండెల్లో రాయి పడింది. వీథిలో చుట్టం - ఇంట్లో బియ్యం లేవు - చేతిలో ఉన్నది రూపాయి - ఇంకెక్కడా అప్పు దొరకదు. అప్పడిని సైగచేసి పిలిచింది.

"గింజలు నేవు -"

"ఆ రూపా యెట్టి తే-"

"గుర్రానికి ఉలవలో -?"

"మరేటిసేస్తం—గడ్డిపడే—"

నరిసి పెరట్లోంచి వెళ్లి సన్నాసి నాయుడి పెళ్ళాందగ్గరనుంచి రూపాయి బియ్యం తెచ్చి వండింది. సేరుబియ్యం ముగ్గురికి సరిపోయాయి. పొద్దుటి అంబలి మిగులుంటే తాగి పడుకుంది నరిసి.

అప్పడూ, బావమరదీ వీథిలో పడుకుని చుట్టలు కాలుస్తున్నారు. ఆ గాఢ చీకట్లో ఆ చుట్టలు నిప్పుకణాల్లా వెలుగుతున్నాయి.

"మీా ఊళ్ళో కరు వెలా గుందేస్" అన్నాడు బావమరిది.

"గోరమేన్రా! పెపంచం బగ్గున మండిపోతంది-రూపాయికి శేరు—"

"ఈ వూర్లో మూాతుబర్లే నేరు. మీాకు మరీ సికాకు—"

"ఏదో బగమంతుడి దయువల్ల మాకంత నేదులే—" అప్పడు దర్జాగా అని, తుప్పున ఉమ్మి, అటునుం చిటు వొత్తిగిల్లి నిశ్చింతగా పడుకున్నాడు.

ఎదురుగుండా, చీకటిలో, మర్రిచెట్టు మీాద గుడ్లగూబ కూసింది.

సాలలో అస్థిపంజరంలా ఉన్న గుర్రం ఆకలిగా సకిలించింది.

1947 Sep. 11 Died

# కవికోకిల శ్రీ దువ్వూరి రామిరెడ్డి



'నలజారమ్మ అగ్నిప్రవేశ' మను రచనతో ఆంధ్ర కవితా ప్రపంచమున అడుగుపెట్టి, తదాదిగ, సడి చప్పుడు లేకుండ, అనేక ఖండకావ్యములు, నాటికలు, కథానికలు, సారస్వత వ్యాసములు మొదలైనవానితో ఆంధ్ర హృదయముల నుఱ్ఱూత లూగించి, 'కవికోకిల' యన్న అన్వర్థ బిరుదమును గడించి, నెల్లూరుజిల్లాలో ఒకమారుమూలన—జన్మభూమియైన పెమ్మారెడ్డిపాలెములో పల్లీయులలో పల్లీయుడై కూర్చొని, జీవితములోను, కవితలోనుకూడ నిసర్గసుందరమైన పల్లీయ హృదయమునే వ్యక్తీకరించుచుండిన శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు మొన్న సెప్టెంబరు ౧౧-వ తేదీ రాత్రి పండ్రెండు గంటలప్పుడు కీర్తిశేషులై పోయినారు. ఆంధ్రకవితా వియత్పథములో తేజోభవ్యమైన ఒక దివ్యతార రాలిపోయినది. 'కవికోకిల' సుధామధుర కవితాస్రవంతి కాలగర్భములో ఇంకిపోయినది.

పుట్టుకతో రైతుబిడ్డ. స్వతః శ్రీమంతుడు. కాని, కవితావినోదమన్నది ఆయ

నకు అంతకన్న స్వతస్సిద్ధమై, ప్రాచీనవాసనా బలముచే తదేకతానత్వమును కుదిర్చి ఆయనను కళాతపస్విని చేసినది.

అంతేకాదు. ఆయన బహు భాషా వేత్త. విజ్ఞానశాస్త్ర పరిశోధకుడు. అభ్యుదయగామి. ఇందుకు ఆయన ఇటీవల ఇటీవల రచించిన 'రవి-కవి' 'పలితకేశము' ఇత్యాది రచనలు ప్రత్యక్షతార్కాణములు. శాస్త్ర పరిశోధకుల సన్మానమున కని ఆయన మీదుకట్టిన పదివేలనిధి అంతకంటె చక్కని నిదర్శనము.

వారి కృతులలో పానశాల, కృషీవలుడు, కుంభరాణా, వనకుమారి, సీతావనవాసము, నలజారమ్మ అగ్ని ప్రవేశము, మాతృశతకము మొదలయినవి దేశములో పండితులననక, పామరులననక సర్వులను రంజింపజేసినవి. ఈ గ్రంథములను చదవనివారు ఆంధ్రులలో అరుదనుట అత్యుక్తి కాదు. Voice of the Reed అను ఆయన ఆంగ్ల కవితా సంపుటి ఆంగ్లేయుల చేతనే అఖండమైన ప్రశంసలనందుకొన్నది.

ఈ రీతిని కవితాప్రాగల్భ్యము-అందులోను మధురకవితా ప్రాగల్భ్యము, శాస్త్ర పరిజ్ఞానము ఇవి రెండును సమపాళముగా ఒకేవ్యక్తిలో సైదోడుగా ఉద్బుద్ధమై యుండుట నిజముగా అపూర్వవిషయము.

ఆయనకవిత్వము ఆయన మధుర హృదయముయొక్క ప్రతిచ్ఛాయ.

మనోనిర్మితమవు ఊహాలోకాలను, దైనికప్రపంచమును ఏకసూత్రములో బంధించి ఉత్తమమైన కవితాపరమావధిని స్పృశించిన ప్రజ్ఞాశాలియై, "తన కావించిన సృష్టి తర్కారులచేతన్‌గాదు'' అన్న ప్రశంసకు పాత్రుడైనాడు ఆయన. ఇవిచాలవన్నట్లు ఆయన చక్కని చిత్రకారుడుకూడ.

దేవుడిచ్చిన ఇంత సిరిసంపదతోను, ఇంత కవితాకళా సంపదతోను తులతూగుచుండియు జీవితములో ఎట్టి ఆడంబరములకును పోక నిష్కపట నిరాడంబర జీవితమునే గడపి అధునాతన కవులకు ఆదర్శపాత్రమైనాడు.

ఇక సంఘములో, ఇంతటి ఆప్తమిత్రుడు, ఇంతటి సౌజన్యసింధువు ఉండడన్నంతటి పేరుకూడ సంపాదించుకొన్నాడు.

కవితాకళా ప్రపంచములోనేకాదు, వ్యవహారరంగములోకూడ ఆయన దిట్టతనము సినిమాదర్శకత్వముతో నిశ్చితముగా నిరూపితమైనది.

ఇంతలేసి జ్ఞానవిజ్ఞాన కవితాప్రాభవములతో విలసిల్లిన రామిరెడ్డిగారు ౧౮౯౫ (నవంబరు ౯ వ తేదీ)లో పుట్టి ఈ 1947 లో—ఇంత అర్ధాయుస్సులో అస్తమించుట నవ్యసాహిత్య ప్రపంచమునకు నిజముగా తీరరానికొరత యనుటకు ఆక్షేపమేమి?

---



ఈ నెల ౨-వ తేదితో ౭౮ ఏండ్లు పూర్తియై ౭౯-వ యేట ప్రవేశించిన ఈ భారతభాగ్య విధాతపై
'దీర్ఘాయుష్మాన్భవ' అని దిక్కు దిక్కుల నుండి దీవనలు కురియుచున్నవి.

# వెన్నెల లోతుల్లో

✱

శ్రీ శ్రీరంగం నారాయణబాబు

కుష్ఠరోగి వంటి
మీద కప్పుకొనే
కనలిన రక్తపు గుడ్డ
నలుపెక్కిన
ఎఱ్ఱని సంధ్యాశకలం
..........................

బయల
తీర్థ ప్రజాకోలాహలం
నిశలో వెన్నెల
నిత్య పునిస్త్రీ
శూన్యం
పాదాల
చూపుడు వ్రేలు
రోదసి
" ఘల్లు ! ఘల్లు ! "
మట్టెల ధ్వని వెన్నెల
మగని శాపం
పెరవానితో
లేచిపోయిన
పైదలి
గాలికి రోదించే
చెట్టు కొమ్మ
స్మశానంలో
చంటిపిల్ల ఏడుపులా
బ్రహ్మజెముడు కంచెమీద
పుష్ప వికసనం

కునిష్ఠి
ఉన్మత్తుడు
హత్యా పాతకుడు
చంద్రుని వరించి
తీతుక
తుమ్మచెట్టు మీంచి
'తీ' యని 'తీ' యని
ప్రేమ గీతి
వినిపిస్తే

రోగంతో
బాధపడు నేను
యముని కోర్టునుంచి
సమ నని భయపడితే
గదిలోపల
మేడమీద
లోకంలో
మంచి తప్పు
చెడ్డ లేదు
నమ్మ ననే
చంటిపిల్లడు
అప్పలస్వామి
ఆంగ్లంలో
అద్భుతమైన కవి
ఫ్రెంచిలో
పండితుడు
పాడు పాట పాట
*లలూన్
నెగర్డ్
ఓకూన్
రంకూన్

---

*ఫ్రెంచి అర్థం: "చంద్రునివల్ల ఎప్పుడును చెడుపు సంభవించదు"

# న వ యా మి ని

## శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి

[అంకితము—మునగాల జమీందారులైన శ్రీ నాయని వేంకటరంగారావుగారికి, అత్యంత ప్రీతిపై].

### సంభవ ప్రకారము

బిల్హణీయము అనాదరణీయమైన కావ్యము. విషయము మంచిది కాదు. కల్పన సత్యమునకు, నైజమునకు విరుద్ధము. కథానిర్మాణమునందు ప్రాయోభావము ప్రాణమువంటిది. అనఁగా వర్ణింపఁబడినరీతిని బహుశః విషయములు జరిగియుండు నను భ్రాంతిని పాఠకులయందు కలిగించుట కవియొక్క ప్రథమకర్తవ్యము. ఈమాత్రము భ్రమ కలిగింపనేరనిచో అది జీవకళ లేని శరీరమట్లు. శవసమానము.

బిల్హణీయమందు కథానిర్మాణము ప్రాయోభావవిహీన మగుటకు కారణములు ఇవి కొన్ని:—

౧. ఎంత తెలివిలేని రాజుగా నుండినను యువకుఁడైన పండితుని యువతియైన కుమార్తెకు గురువుగాఁ జేర్చి వారికి ఏకాంతసంఘటనము నిరపాయముగ, నిర్భీతిగ జరుగున ట్లమర్చియుండునా? గురువు గొప్ప పండితుఁడుగదా, కాఁబట్టి అంత యువకుఁడుగా నుండియుండునా? సహజవిద్యాధురీణుఁడు కాఁబోలు! సరే.

౨. కాని కుమార్తెతో సహపాఠినులుగ బాలికలను కొందఱిని జేర్పలేకపోయెనా? వృద్ధస్త్రీలనో, సొంతపు తల్లినో మాటరాకుండునట్లు యామినితో సహచరత్వము—సహజము, సర్వసాధారణమైనది—చేయుమి ఎట్లు? స్త్రీస్వాతంత్ర్యము ప్రబలముగా నుండు ఐరోపాలో చాపెరోన్స (Chaperons) అను పేర తమ కుమార్తెల యొక్క పేరుప్రతిష్ఠలు అపవాదములపాలుపడకుండునట్లు మంచిస్త్రీలను సహచారిణులుగా నియమించుట అనుల్లంఘ్యమైన సాంఘికనీతిగా సర్వత్ర అవలంబింపఁబడియుండుట సుప్రసిద్ధము. ఇంక హిందువులలో, అందును రాజకుటుంబములలో ఏనిరోధము లేని ఇట్టిరీతిని యువతీయువకులకు ఏకాంతసంఘటనము ఎవరైన ఎట్టిమూఢులైన సేకూర్తురా!

ఇక రాజన్ననో, కీడు కాడు లేని మూఢశిఖామణి గాఁడు; సంశయాత్ముఁడు. పరస్పరదృష్టులను స్పర్శలను నిరోధించుటకును, అసంభవములను చేయుటకు కట్టుకథలు కట్టినాఁడఁట. సర్వసాధారణములైన సహజోపాయము లుండఁగా పుక్కిటి పురాణములను ఆశ్రయించినాఁడఁట. ఈ కథలకు ఉపోద్బలముగా గాలికి చేతికి దలనముఁ గొందు తెర నొకటి వేసి తృప్తిఁజెందినవాఁడఁట. ఇది రాజుగారి నీతినిర్మాణకౌశల్యము!

మనయవి సహకుటుంబములు. బంధువులు, భార్యలు, తక్కినవారు ఇట్టి వివేకవిహీనతాపద్ధతులను ఆక్షేపించి అడ్డగింపకపోయిరా?

ఇందలి కథానిర్మాణము విశ్వసనీయత్వము ఇసుమంతయులేనిది. మిథ్య. శూన్యము.

---

* రచన : చిత్తూరున, 1936 లో.

మఱి బిల్హణుఁడు విద్యావంతుఁడు. ధర్మబుద్ధి యేమాత్రము లేనివాఁడా ? యామినీకుమారి గొప్పవంశమునఁ బుట్టిన బిడ్డ. హిందూయువతి. గురుశిష్యులకు పరస్పర మోహము అసంభవ మనరాదు. కాని, వారు ఆరీతిని జంకు శంక ఏమాత్రము లేక, నిగ్రహబుద్ధియు, శమనశక్తియు నేమాత్రము లేనియట్లు పరస్పర వశులగుటకు పశువులా ?

ఇట్టి విచారముల వలన ఈగ్రంథము నీచాతినీచమని నాకుఁ జిన్ననాఁడే తోఁచినది. అయినను గురువులు శిష్యురాండ్రను మోహించుట అరుదైనను అసంభవము కాదు. అట్టి మోహము నాధారముఁ జేసికొని యామినీ బిల్హణుల చరిత్రమును విశుద్ధమును, సహజతాగుణసంయుతమును అయినతీరున వ్రాయ నెన్నో యేండ్లక్రిందట సమకట్టి చేసినాఁడ. దానియొక్క పరిష్కృతమైన ప్రతియ ఈ "నవయామిని."

నాయొక్క "భావాంబరవీథి" విహరించు యామినీ బిల్హణుల ప్రకృతు లివ్వి:—

౧. బిల్హణుఁడు:—పండితుఁడు. వయస్సుచెల్లినవాఁడు కాకున్నను కొంత వయసు ముదిరినవాఁడు. ధర్మబుద్ధి, నిగ్రహశక్తి ఏమాత్రము లేని విషయలోలుఁడు గాఁడు. నిజశీలము చలితమయ్యెనేని పునరాలోచనమై సమర్థించు కొనఁజాలిన నిగ్రహపరుఁడు.

౨. యామిని:—వయస్సునను, వర్తనమునను ఆర్య. పరిశుభ్రమనోగతిఁ గలది. సచ్ఛీల. గయ్యాళి కాదు. మృదుత్వము, స్థిరత్వము కలిసిన హృదయముగలది. భావములు వెన్న. పల్కులు తేనెలు. ధర్మసంకల్పము వజ్రము వంటిది.

ఇఁక నేను ఈ యధికప్రసంగము నింతటితోఁ జాలించి పాఠకుల అనుగ్రహమునకు నా "నవ యామిని"ని దత్తము చేయుచున్నాను—అనఁగా కుమారిక గాఁగ.

## ౧

బిల్హణుఁడు మోహించి తన మనోరథమును యామినీకుమారికిఁ దెలుపుట

మొగము వికసించి చిఱునవ్వుపువులు గురియు ;
తెలివికాంతుల వెదజల్లు తేఁటకనులు ;
నోరు పండి రుచ్యములైన నుడుల రాల్చు;
వరవిలాసిని నే నెట్లు వలవకుందు ?

కృత్రిమము లేని విలసనల్; మైత్రి మెఱయుఁ
జుక్కలను బోలు నఖముల సోయగంబు;
ప్రేమబంధురహృదయంబు వెలయు నిన్ను
ప్రాణముల హత్తకే నెట్లు వదలియుందు ?

సరసమధుర చమత్కార సౌమనస్య
భాసురము లౌ భవద్రమ్యభాషణములు
మనసు రంజిల్లఁజేయఁగా మమత పుట్టె
మొదుగుచున్నది; మితి లేద; యేమిసేతు ?

పెరిమయు, గరువతనము,ను
ద్ధురవినయము, భక్తి శ్రద్ధ తుఱఁగలిగొన,న
న్నరసి సపర్య లొనర్చెదు
సురుచిరభవదీయమూర్తి శుభ్రత నెంతున్.

కనులను, వీనుల, హృదయం
బును, మనసును విభ్రమమున ముంచితివి సుహా
సిని! యిన్నాళ్ళకు నిక్కం
బును బూర్ణము నైన మోహపుం జవిఁ గంటిన్.

పరవశుఁడగాక యిన్నేండ్లు బ్రతికి, నేఁడు
నాకు నీవశంబగుట నంతసము కాని;
కాలుతప్పి, కాలము నెడి కర్షకుండు
విత్తు చల్లిన ఫలమున్నె? వెఱ్ఱిగాదె?

ఆత్మసుఖమును నేఁగోర, నమలమును, న
మ్మార్థమును శాశ్వతము నైన మేలిసుఖము
నీకు నెల్లెడ సిద్ధించుఁగాక రమణి,
ప్రాణసఖుఁడని ననుఁ గోరి పనులఁ గొనుము.

కాలధానుండు పడమటికడకు వ్రాలెఁ;
గ్రమ్ముచున్నవి సాంధ్యచీఁకటులు నన్ను;
అట్టిచో నేకశుక్రున ట్లద్భుతముగ
దివ్యమూర్తి! నీ వుదయించి, తేజమును మ
హోజ్జ్వలాహ్లాదమును గూర్చి తుత్పలాక్షి!

అని బిల్హణుఁడు చెప్పఁగా విని—

కాఱుచీఁ కట్లఁ జుక్కల గములఁ బొలుచు
నమవసనిసి యనంగ; మధ్యాహ్న వేళఁ
గాంతులును నీడలును మిశ్రగతులఁ గదలఁ
తెలఁగుఁ జెట్లక్రిందటి పచ్చికల విధమున.

సంతసమును విషాదంబు సదమలాత్మ
యందుఁ బెనఁగ, నాశ్చర్యంబు వ్యథయుఁ గూర
నెండయును వానయును మది నిండి పొరలి
నట్లు దీక్ష్ణతయును నశ్రు లదరఁ గనుల.

యామినీకుమారి యిట్లనియె:—

౨

యామినీకుమారి ప్రతివచనంబుల బిల్హణుని మందలించుట

సంతసించితి నీ సరసప్రసంగ
రీతిఁ దిలకించి; కంపించె హృదయ మనఘ ;
అద్భుతంబున మునిఁగె నా యాత్మ; యేమి
యెటుల బదులాడఁ బోలునో యెఱుఁగనేర.

నీవు మనోజ్ఞమూర్తివి; వి
    నిర్మలకీర్తివి; జ్ఞానమందు వి
ద్యా విభవంబునందుఁ బర
    మాద్భుత శక్తివి; నాకుఁ జూడఁగా
దైవముఁ, దండ్రియున్, గురువుఁ,
    దల్లియు నీవ సఖుండవున్ సదా ;
కావున సాహసించితిని
    కర్మము ధర్మము పూని తెల్పఁగన్.

నీవు కడింది ప్రేమ నను
    నిచ్చలు గారవ మొప్పఁ బూజ్య శా
స్త్రావళి నేర్పి గ్రంథనిచ
    యంబుల పాఠముఁ జెప్పి దిద్ది స
జ్జీవ విధానముల్ గఱపి,
    చేసితి విట్టిది గాఁగ నన్ను; నా
భావము నీ యధీనము; స
    పర్యల నిన్ దనియించు టొప్పగున్.

నీ పావనశిష్యత్వము
నా పూర్వతపఃఫలంబ నయనిధి! నీకున్
గోపనపరనై యుండెద
నీ పెంచిన బిడ్డపేరు నేర్తువె చెఱుపన్?

క్షణికము నీయీ మోహం
బనఘా, నిక్కంబ కాద యని యెఱుఁగుదు, సూ
ర్యుని పార్శ్వగ్రహణము కాం
తిని మాయునె? చాలసేపు నిలుకడఁ గనునే?

ఇవి నా నిరాకరణ వా
క్య వికటములు గావు, మీ సదాదేశసుపవి
త్ర వివిధసూక్తులె, నా హృద
య వివరము వెడలి ప్రతినినదార్భటి రేఁగెఁ.

నీ ప్రతిబింబమగద నే
నో పావనమూర్తి, గినియనోపుదె నాపై?
నీ పోషించిన లతికను
నీపట్టున నలరనిమ్ము నిర్మలనియతిఁ.

### ౩

విద్యార్థుఁడు బుద్ధితెచ్చుకొని పశ్చాత్తాపపడుట

చిఱునవ్వుతేకులఁ జెన్నారుమొగము దా
మరసౌరభము మదికరఁగ నాని
కలికితనము మీఱఁ జెలివిమెఱుంగులఁ
జెలఁగించు కనుల కాంతులకుఁ దలరి
నవ్యముల్ హృద్యముల్ నర్మ గర్భితములౌ
తళుకు పల్కుల తీపిఁదవిలి చిక్కి
మనసు మైకముఁజెంద మచ్చు మాయలఁజల్లు
తెలియని ముగ్ధచేష్టలకు భ్రమసి
బుద్ధి వెనుకకుఁ జిత్తంబు ముందునకును
బోవు భిన్నత శాంతిఁ గోల్పోయి, తగును
దగద యను నిలుకడ లేమిఁ దాల్మి వాలియఁ
గోరరాదని తెలిసియుఁ గోరినాఁడఁ
జేరరాదని తెలిసియుఁ జేరినాఁడ.

మెత్తని, తియ్యని, చల్లని
చిత్తముఁ, జిఱునవుల రుచులు, సిగ్గుమొగముఁ, గ
న్నెత్తని రూపము, హృదయో
న్మత్తతఁ గలిగింప నిట్టి మాటలు ప్రేలెఁ.

ఆకస్మికంబుగ నడరి యకాలంపు
మారుతంబులు రేగి మనసుఁ గలఁచి
యడుగంటి యుండిన యంగజ వికృతులఁ
బొంగి పొరలఁ జేయ, బుద్ధిమతివి

ధీరవు, సహజగంభీరస్వభావవు
నగుట నిశ్చలలీల నాపి యణఁచి
నిర్నిద్ర శాంతిని నిస్తుల గౌరవ
మును స్థిరంబులు జేసికొని కరంబు
వెలిఁగితివి, భవ చ్ఛీల పవిత్ర కాంతి
విశద మయ్యె నా పోయిన విమతగతులు,
దారితప్పినవానికి దారిఁ జూపి
పాపమునకు దుష్కీర్తికిఁ బాపి తమ్మ!

నీ యత్నముల సమున్నతి
నీ యుజ్జ్వలమైన ప్రజ్ఞ నీ యౌదార్య
శ్రీయును నిరుపమ హృదయం
బేయెడఁ గన సాధ్యమౌనె యీ కలినాళ్ల ?

మాయదెరలెను నీ మహామహిమఁ జేసి
పరవశత్వము బాసె నీ భవ్య కరుణ,
నై మఱపు ప్రమగ్గఁ జిత్తంబు మామకంబు;
నియతి నీకనైన నాబుద్ధి నిలుచుఁ జెడక,

నిన్నుఁ గోపించు టొక్కొ! నీ నేర మేమి ?
చేసినవి యెల్లఁ జేసిన చినఁటి నేన,
బాల, నమ్మిన సఖి, శుభవ్రత, మదీయ
రక్షణంబున నుండెడు రామ యనక
యనుచితములను దలపోసి యధముఁ డైతి.

నీకు నవి యసహ్యములౌట నేర మెట్లు ?
నిప్పుఁ జెదలంటఁజాలమి నిప్పుతప్పె ?
మంచి మెత్తని మాటల మందలించి
భద్రపఱచికొంటివి భవద్వ్రతము, సుఖము.

వయసునఁ జిన్నవయ్యును, భావగరిమ,
జ్ఞానసూక్ష్మత, ధర్మసంకల్పనిరతి,
సరససంస్కృతభాషా ప్రశస్త విద్య
ప్రథమగణ్యులలోఁ జేర్పవలయు నిన్ను.

కావున నిరంతరము నా
భావము, గౌరవముఁ బ్రీతిబంధురముగ, నా
నా విమలసపర్యలతో
నీ వలనను నిలుచుగాఁత నిక్కఁపుఁ బేర్మిన్.

నను మన్నింతువ కోమలాత్మ! నిజ మ
న్యాయంబు నేఁ జేసితిన్;
వినుతంబై, పరిపూతమై, సరళమై,
విస్తారకారుణ్యమై,
జనతాకర్షణహాసభాసితము నై,
సంతోషమహా నీదు యా
వనమున్ జింతలఁ జెందఁ జేసితిని; పా
పం బెట్లు బాయున్ సఖి!

నీ నిష్ఠలు, నీ వ్రతములు,
నీ నిశ్చల దైవభక్తి, నీ సుకృతంబుల్,
పూని, ననున్ గడఁ దేర్పఁగ
నో నిస్తులచరిత! కరుణ నొనరింపఁ గదే.

నను నుద్ధరింపఁబుట్టిన
ఘనకరుణామూర్తి వమ్మ, కాంతా! దైవం
బ నిజంబుగ నీవరమునఁ
గనఁ గలిగితి జన్మసార్థకత, నాతల్లీ!

నీ జన్మము కారణముగ
నాజన్మము ధన్యతాఘనత్వము నందెన్
తేజము, దీర్ఘాయువు వి
భ్రాజితలోకప్రసిద్ధి వఱలుత నీకున్.



# బ్రదుకే



శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

బ్రదుకే అవతారము
బ్రదుకే ప్రసారము
బ్రదుకే -
వర్ణక్రమవిస్తారము.

బ్రదుకే పదపరితోషము
బ్రదుకే పదపరివేషము
బ్రదుకే -
పదపరిభాషాశేషము.

బ్రదుకే విలాపము
బ్రదుకే ఆలాపము
బ్రదుకే -
సల్లాపకలాపము.

బ్రదుకే కృతిశీలము
బ్రదుకే ఆకృతిజాలము
బ్రదుకే -
సత్కృతిమూలము.

బ్రదుకే ప్రకృతిరాగము
బ్రదుకే వికృతివిరాగము
బ్రదుకే -
కృతిప్రతివిభాగము.

బ్రదుకే నీతినియమ పవిత్రము
బ్రదుకే జాతిమత చరిత్రము
బ్రదుకే -
జీవసృష్టి విచిత్రము.

బ్రదుకే అనువాదము
బ్రదుకే వివాదము
బ్రదుకే -
చరాచరసంవాదము.

బ్రదుకే స్వభావానుసరణము
బ్రదుకే పరభావానుకరణము
బ్రదుకే -
ప్రకృతిభావశయ్యా వరణము.

బ్రదుకే ఆశాతల్పము
బ్రదుకే ఆశాసంకల్పము
బ్రదుకే -
ఆశావికల్పము.

బ్రదుకే ఆత్మప్రపంచము
బ్రదుకే ఆత్మప్రబంధము
బ్రదుకే -
పరమాత్మానుబంధము.

బ్రదుకే అహంభావవిశిష్టము
బ్రదుకే సోహంభావ సంశ్లిష్టము
బ్రదుకే -
హంసప్రభావ పరిశిష్టము.

బ్రదుకే సహకారభాజనము
బ్రదుకే నిర్వికార నిరంజనము
బ్రదుకే -
నిర్విశేషనీరాజనము.

# హరిచరణుడు*

[నవల]



= శ్రీ తల్లావఝ్ఝల కృత్తివాసతీర్థులు =

జీవితంలో అంధకారరూపం చూచి వెలుతురులోకి వచ్చినా వెలుగుకూడా చీకటిగా వుండగా, బాధలన్నీ దిగమింగి పెదవులమీద మందహాసం తెచ్చుకొని, మ్యూజియమ్ పిట్టగోడమీద హరిచరణుడు కూర్చున్నాడు. మోటార్ల దుమ్ములో సంజెమసకలో సాగిపోయే నిరంతర మానవప్రవాహ తరంగసంక్షోభాన్ని, చతురంగపుపావులవలె కదిలే మానవులను చూస్తున్నాడు. మాసినగడ్డం అరచేతులలో పెట్టుకొని జేవురించిన కళ్ళతో కొంతసేపు నిదానంగా చూచినాడు. చిరిగినచొక్కా జేబులో నలిగిన ఫోటో తీసి ఒకసారి చూచి, నిశ్శబ్దంగా నేత్రాలు మూసినాడు. రెప్పలు కన్నీటితుంపరలతో తడిసినవి. అతని కపోలాలమీద కన్నీరు జాలుగా ప్రవహించింది. ఆ ఛాయాచిత్రంతో అతను ఏదో మాట్లాడబోయి కంఠం రుద్ధముకాగా కలత చెందినాడు. చిత్రాన్ని జేబులో ఉంచుకొని హృదయానికి హత్తుకొన్నాడు. తోవనే పోయే పిల్లలు అతన్ని వెక్కిరిస్తూ పిచ్చివా డని అనుకొని బెడ్డలు విసిరినారు. బెడ్డలు అతనికి తగలలేదు; గోడపక్కనున్న పనసచెట్టుకు తగిలినాయి. చరణుడు అట్టహాసం చేస్తూ "కొట్టండి నన్ను. కొట్టరేం నన్ను? రాళ్ళు ఇవ్వనా?" అనేసరికి పిల్లలు కేకలు వేస్తూ వెళ్ళిపోయారు. పెద్దమనుష్యులు వీథివెంట వెడుతూ "వాడు తుంటరిబికారి" అని చెప్పుకొంటూ సరదాపడుతున్నారు. మరో పెద్దమనిషి "అవును, శరణాలయంలో పిల్లను మోసంచేసి గొడవ చేశాడు. పైగా, అన్నివిధాలా భ్రష్టుడు" అని ఉత్సాహంగా పలికినాడు.

గోడమీద కూర్చున్న హరిచరణుడు పెద్దమనుష్యుల మాటలు విని నొచ్చుకొన్నాడు. ఒకప్రేరేకణ వెల్లువలా వచ్చింది—వాళ్ళను దిగమింగేద్దా మని.

చీకటి పడుతున్నది. తిండికి లేకపోయినా ఏబాధల్లో ఉన్నా సమస్తాన్నీ విస్మరింపజేసి, అనంత పథాలకు తీసుకుపోయే మధువు ఆరగించాలని బయలుదేరినాడు. "ఆపద్బంధూ! ఈ కష్టాలకు మధుపానం ఒక్కటే విరుగుడుగా దారి చూపించావు. నీపాద సన్నిధిలో నాకు ఇంకా తావు లేదు. బాధలకు అతీతమైన విస్మృతి శైత్యాంచలాలమీద, నీలగగనపాళుల్లో, సుధాస్వప్నలోకాల్లో లాలించి వేరేలోకం కల్పిస్తావు" అంటూ సంతోషంగా కన్నీరు కార్చినాడు.

పానశాలకు వెళ్ళేలోగా అతని ప్రియమిత్రుడు విహారి ఎదురై జాలిగా పలకరించినాడు. "చరణ్! నీస్థితి ఏమీ బాగా లేదు. సాయంకాలం నాదగ్గిరికి వస్తే ఈ దురలవాటు నీకు తప్పిపోతుంది గదా. జొత్తిగా కనపడడం మానేశావు."

"అలవాటు పరిపాటి అయిపోయింది. సమస్తాన్నీ మరిచిపోవా లని తాగుతున్నాను. అంతకన్న ప్రియతమ మైన వస్తువు నాకు కనపడదు."

"ఎందుకు పాడై పోవడం?"

"ఇంకా ఎందుకు జీవించను?"

"ఎందు కానిస్పృహా!"

* శరత్ బాబు ఆధారము.

"నిస్పృహ లేకుండా ఉండేటందుకు తాగు తాను. నేను పానశాలలో ఆనందమూర్తిని, నటరాజును" అని వికటంగా ఉప్పెనలా నవ్వి సమాధానము ఇచ్చాడు చరణుడు.

"లోకం నిన్ను చూసి ఎలా వెక్కిరిస్తుందో తెలుసా?"

వెంటనే తోవలో ధూళితో కలిసిన గడ్డి పోచ చేత్తో పుచ్చుకొని చరణుడు ఊదివేస్తూ "ఇంతే లోకం. ఇందాక పిట్టగోడమీద కూర్చుని లోకం చతురంగ పాళీలాగ చూచాను. మనుష్యు లంతా పావులు. ఈ పావులు వెక్కిరిస్తే మరో పావుకు నష్ట మేమిటి?" అని నిష్ఠురంగా పలికినాడు. అతను సమాధానము చాలా నీరసంగా, ఆయాసంగా చెప్పగా విహారి జాలి పడి "తిండికూడా మానేశావు: ఎలా జీవిస్తావు?" అని కొంతసేపు ఊరుకొని "డబ్బు కావాలా?" అని అడిగినాడు.

విహారి ఎంత స్నేహితు డైనా, అతను డబ్బిస్తా నన్నప్పుడు చరణునిర క్తనాళాల్లో తనపూర్వులఘనతా, అహంకారాలు మేళవించి పైకి వచ్చాయి.

"వద్దు. డబ్బెందుకు?"

"తాగడాని కయినా సొమ్ము అక్కర్లేదా?"

"సురాభాండేశ్వరి పైసాకూడా పుచ్చుకోని ఉదారస్వభావ!" అని వికటంగా నవ్వినాడు హరి.

"ఎంత వ్యర్థం చేసుకొంటున్నావు జీవితాన్ని! కనకపుసింహాసనంమీద శునకాన్ని కూర్చోపెట్టి ఎందుకు బాధపడతావు?"

మిత్రుని ప్రశ్నకు సమాధానంగా హరి కన్నీరు కార్చినాడు.

"చరణ్, నీహృదయంలో ఆమెకు ఉన్నత స్థానం ఇచ్చావు. పదచ్యుతికి ఆమె అర్హురాలు. ఎందుకు విచారిస్తావు?"

"విహారీ! ఇంకా పండు అనుకొని దీపశిఖ చుట్టూ తిరుగుతున్నాను."

"అవును. మిడతలకు కాల్చివేసే దీప మని తెలియదు."

"అమాయక హృదయాలను ఇంత త్వరలో కాల్చివేస్తుం దని కలలోకూడా అనుకో లేదు" అని కళ్లు ముకుళించి నిట్టూర్పు విడిచినాడు. కొంతసేపటికి తెప్పరిల్లి ఆయాసపడుతూ "ఇక నా కావతాళ పోలేదు. ఒక్కసారి ప్రేమించాను హృదయాన్ని తిప్పుకోలేక పగ కాలిన మిడత ఎగరలేక ఎగరలేక ఎగిరినట్టు జీవచ్ఛవమై తిరుగుతున్నాను" అని పలికినాడు. అలా అనేసరికి విహారిమనోనేత్రములో బీటలువారిన బీడులో మోడు చెట్టు గోచరించింది. తన మిత్రునిస్థితి చూచి జాలిపడినాడు. క్రియాశూన్యమైన కారుణ్యం అవతల వారి హృదయవేదనను ఒక్కొక్కసారి రెచ్చగొడుతుంది.

## ౨

విహారికీ, హరిచరణునికీ చిరకాలం నుంచీ స్నేహబాంధవ్యం ఉంది. చరణుని చెల్లె లయిన తారిణీదేవిని విహారికి ఇచ్చి వివాహము చేయా లని ఉభయకుటుంబాలవారూ ఎప్పుడో అనుకొన్నారు. తీరా గోత్రం, శాఖా చూచేసరికి సంబంధం సరిపడ లేదు. హరితండ్రి దిలీపుడు కలకత్తాలో నారసంచుల వర్తకంచేసి స్థితిపరుడై వెలిగినాడు. విహారితండ్రికూడా కలకత్తాలో వర్తకం చేసేవాడు. ఉభయకుటుంబాల మధ్య దోస్తీ బాగా ఉండేది. విహారితండ్రి భార్య పోయాక విహారి ఒక్కడే కుమారుడు కావడంవల్ల అతన్ని దిలీపుని ఇంట్లో కొంతకాలము ఉంచినాడు. విహారి వారి కుటుంబములో ఒకడై, తారిణితో ఆట లాడుతూ పెరుగుతూ వచ్చినాడు. తారిణీవిహారులు బొమ్మలపెళ్లిళ్లు ఎన్నో చేసేవారు. తారిణి తెలిసీతెలియక పసితనపు అమాయికత్వంతో "నేను పెళ్లాన్నట, చరణ్ మొగుడట......బువ్వాలాట ఆడుకొంటాం రారా అన్నయ్యా!" అని చరణుణ్ణి పిలిచేది.

కొంతకాల మయ్యాక విహారి కలకత్తా వదిలి కాశీలో ఉండడం తటస్థించింది. అజ్ఞాతంగా, అవ్యక్తంగా అతని హృదయంలో తారిణిమీద ఏదో మమకారము ఉండేది. పదిసంవత్సరా లయ్యాక కాశీ నివాసం విసర్జించి వర్తకరీత్యా విహారి కలకత్తాలోనే ఉంటున్నాడు. ఒకనాడు అకస్మాత్తుగా విహారీచరణులు తోవలో కలుసుకొన్నారు. చరణుణ్ణి విహారి గుర్తించలేక పోయాడు. హరి జీవితంలో తుఫానులు రేగడంవల్ల అతను భగ్నావశేషంవలె ఉన్నాడు. అందుచేత మిత్రుడు అతన్ని గుర్తుపట్టలేదు. పదేళ్ళపాటు ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు. దిలీపుని కుటుంబ విషయాలు విహారికి తెలియవు. ఎప్పుడయినా హరి జ్ఞాపకం రాగా ఫోటో తీసి మిత్రుణ్ణీ, తారిణినీ చిత్తరువులో చూచేవాడు. ఈ పదే

ళ్ళల్లో శారిణిని మలేరియావ్యాధిపీడితుని కిచ్చి పెళ్ళిచేశాడు. తోవలో మిత్రులు ఇద్దరూ కలుసుకోడం తడవుగా పదేళ్ళ అఖాతం క్షణంలో పూడిపోయింది. చిన్ననాటి చెలిమి, చేష్టలు జ్ఞాపకం చేసుకొన్నారు. బాల్యస్నేహం ఇతరస్నేహాలకన్న గాఢము. శారిణీదేవివల్ల విహారీచరణులమైత్రి దృఢమయింది.

పానశాలకు వెడుతున్న మిత్రుణ్ణి మందలించి లాభం లేక విహారి కర్తవ్యం తెలియక ఏదో ఆలోచనలో పడ్డాడు. వరాలబిగువు తప్పి బాధపడుతూ భారంగా అడుగు తీసి అడుగు వేస్తున్నాడు హరి.

“హరీ, మందూ మాకూ పుచ్చుకోరాదా ?” అని విహారి అడిగినాడు. పెదవి విరిచి హరి “ఎందుకు మందు ? ఈ శరీరం ఇంకా ఎవరికోసం ? శరీరాన్ని నిర్దాక్షిణ్యంగా చూస్తున్నాను. చివికి జీర్ణించినా విచారించను” అన్నాడు.

ఆశానిరాశల సంఘర్షణలో మానవుని మనసు విరుస్తూనే ఆశవైపు మొగ్గుతుంది. మిత్రుణ్ణి వదిలి విహారి యోచిస్తూ నడక సాగిస్తున్నాడు. చణుకిలో ఎంత నిరాశ కనిపిస్తున్నదో అంత జీవించాలనే గాఢవాంఛ లేకుండా ఉండదు. ఏనాటికయినా ప్రియురాలు ఆదరించదా అని తుదిఆశతో అతను జీవిస్తున్నాడు.

## ౩

విహారి హరియింటికి వెళ్ళి తలుపు తట్టినాడు. శారిణి తలుపు తీసింది. ఇంట్లో మసకగా దీపం వెలుగుతున్నది. గోడమీద బల్లి పురుగులను వేటాడుతున్నది. అతను శారిణితో ఏదో చెప్పవలెనని చెప్పలేక వ్యాకులభావం కనబరిచినాడు.

శారిణి అది కనిపెట్టి “బావా ! మాఅన్న కనపళ్ళేదా ? తిండికి ఇంటికి రాడు. ఇంటికి కావలసినవి తెచ్చి పడెయ్యడు !” అన్నది.

బావగారని పిలిపించుకోవడం విహారికి ఇష్టం లేదు. శారిణి జమీందారుభార్య కనక అలా పిలిపించుకోడం కిట్టదు. అతని హృదయాంతరాళంలో కామవాసన వాత్సల్యరూపంగా ప్రకటితమవుతూ వచ్చింది. అందుచేత “చెల్లాయీ, అన్న సంగతి ఏం చెప్పను ? ఆనాటికి ఆనాడు అధోగతిపాలవుతున్నాడు” అని స్నేహపూరితకంఠంతో అన్నాడు.

“బావగారూ ! కుటుంబానికి ఒక్కగానొక్కడు. వాడే ఇలా చేస్తుంటే మేము ఎలా జీవించడం ? మానాన్నగారు వర్తకంలో దెబ్బతిని అప్పులపాలై మతిపోయి గౌడీయమఠంలో సాధువుల్లో కలిశారు. అన్నయ్య ఇల్లు నిలువబెట్టడు. ఇంట్లోకి కావలసినవి తీసుకురాడు. పూట గడిచేదారి తోచదు” అని జాలిగా అన్నది.

“శారిణీ ! తాగుడు అతన్ని వేధిస్తున్నది.”

“అన్నింటికీ మా అమ్మ సహించి నెత్తీ నోరూ కొట్టుకుని నలుగురినోళ్ళల్లో పడడం ఎందుకని చావలేక బతుకుతున్నది.”

శారిణితల్లి నెత్తిన ముసుగు లాగుకొంటూ వచ్చింది. “వచ్చావా ! వెయ్యేళ్ళు ! నీమాటే అనుకొంటున్నాం. నిన్ను చూస్తే ముచ్చట వేస్తుంది. ఒకఇంటివాడవయినావు. మావాడు దారిమళ్ళే ఉపాయం చూడు నాయనా ” అన్నది.

“స్నేహానికి తగనిదాన్ని అందలమెక్కించి, ఇప్పుడు బాధపడుతున్నాడు అమాయకుడు ”

“పోనీ, ఏకులమైతే ఏమిటి అని ఊరకుని తరణాల కుంపిల్లను పెళ్ళాడుతానని ఇంట్లో తెచ్చి పెట్టుకొంటే, లోకానికి వెరవక కోడల్లా చూసుకొన్నాం ఆపిల్లను.”

“ఇంతలో ఆపిల్ల అవకతవకగా సంచరిస్తుందని ఎల్లా అనుకొంటాం ?”

“పోనీ, విహారీ ! హరిచరణుడు మరోపిల్లను చేసుకొన్నా బాగుండిపోను. ఇల్లూ వాకిళ్ళూ గుల్ల చేసుకొన్నాడు చేతులారా ! ఎంత మొత్తుకొన్నా మామాట వాడికి ఏతరాం గిట్టదు. ఒళ్ళు తెలియక ఏరాత్రో వస్తాడు. ఏమన్నా అంటే కస్సు బుస్సులాడుతాడు. ఇంతకూ దానిమీద వీడికి మమకారం పోదుగదా !” అంటూ కొంగుతో కళ్ళు తుడుచుకొన్నది. చిమ్నీదీపం మసి పారుతున్నది.

శారిణి “బావగారూ, మా గృహచ్ఛిద్రాలన్నీ మీకు చెప్పి మీమనసు బాధిస్తున్నాం” అన్నది.

విహారి “లేదు శారిణీ ! అన్నయ్య ఎలాగయినా దోవలోకి వస్తే పద్దుగా ఉంటే చూడాలని వెయ్యి దేవుళ్ళకు మొక్కుతున్నా నమ్మా” అన్నాడు.

తారిణితల్లి అందుకొన్నది: "ఏమైనాసరే విహారీ! మా అమ్మాయిని నీకు ఇవ్వకపోయినా మాకుటుంబం మీద నీ కున్న ఆదరం మరొకరికి లేదు. నాయనా, నువ్వే ఎలా గయినా చరణుడికి నచ్చచెప్పు"

విహారి తారిణికేసి జాలిగా చూచినాడు.

"నాయనా! నీవే మా అల్లుడ వైతే మా ఇల్లు పచ్చగా ఉండేది. మావాడు నిన్ను చూసి తేర్చుకొనే వాడు" అని కంట నీరు పెట్టింది. స్నేహజడిమవల్ల అకస్మాత్తుగా విహారికంఠము రుద్ధమయినది. మాట్లాడలేక అతను పైకి స్థిమితంగా ఉండడానికి ప్రయత్నించినాడు. కొంతసేపటికి అతను తెప్పరిల్లి ఇంటికి వెళ్ళిపోయినాడు.

## ౪

హరిచరణుడు ఈడెన్‌గార్డెన్‌లో బెంచీమీద కూర్చుని చాలా రాత్రి గడిపినాడు. ఏదో అతని హృదయంలో ప్రపంచంమీద ఉదాసీనత, జడత్వము బయలుదేరాయి. చరణుకు ఇంటికి పోలేదు. తల్లీ, చెల్లెలూ కలకత్తా వదిలి ఎక్కడికో వెళ్ళిపోయారని అతను ఎరగడు. రోజు గడిచేవిధం లేక కొడుకును నమ్మి నగరంలో వాసం చేయడం కష్టమై వెళ్ళిపోయింది తల్లి. చరణుడు బెంచీమీదినుంచి లేచి, ఎక్కడికి పోవడమని పెద్దప్రశ్న వేసుకొన్నాడు పానశాలలో ఏర్పడిన స్నేహం జ్ఞాపకము వచ్చింది. విశ్వంభర చౌదరి మకాముకు బయలుదేరినాడు. తోవలో ఒక రిద్దరిని డీకొన్నాడు. కాలి వేళ్లకు ఎదురుదెబ్బలు తగలడం కూడా అతను ఎరగడు. వాంతివలె వికారము రాబోయి, మనిషిమీద పడబోయినాడు. 'ఎవడీతాగుబోతు' అని తిట్లు తిన్నాడు. చౌదరి బసకు చేరుకొన్నాడు.

"ఎవరోయ్! హరిచరణ్!" అంటూ చౌదరి లేచి మిత్రుణ్ణి గదిలోకి ఆహ్వానించినాడు.

"అలా వున్నదేం ముఖం! తిండి తినలేదా?"

ఏమీ సమాధానం చెప్పలేకపోయినాడు హరిచరణుడు. చౌదరి తనపక్కనే కూర్చోపెట్టుకొని శాంతపరచి "చరణ్, ఏమిటి సంగతులు?" అని ప్రశ్నించాడు.

"ఏం చెప్పను! మావాళ్లు నన్ను వదిలి ఎక్కడికో వెళ్లిపోయారు, అయినా నాకని వదిలిపోయింది."

"ఎక్కడున్నావు ఇంతసేపు" అని ఆశ్చర్యంతో అన్నాడు.

"ఈడెన్ తోటలో ఉన్నాను."

"ఏమిటి విశేషం?"

"ఏముంది? ఆకలి వేస్తున్నది" అని అనలేక అన్నాడు. చౌదరి వెంటనే లోపలికి వెళ్లి రొట్టె, రెండుబిస్కట్లు, వేడి టీ తీసుకొనిరాగా చరణుడు ఆవు రావురని ఆకలి తీర్చుకొన్నాడు. నీరసంమీద తినడంవల్ల ఆయాసం వచ్చింది. మాట్లాడలేక పోయినాడు. అతన్ని శ్రమపెట్టడం ఎందుకని చౌదరి "చరణ్, హాయిగా నిద్దరో. అన్నిబాధలూ పోతాయి" అని పక్క చూపించాడు. అతను మధ్యరాత్రి వచ్చి చూస్తే హరిచరణుడు నిద్రపోతున్నాడు.

తెల్లవారింది. పక్షులు కలకలధ్వనులు చేస్తున్నవి. చరణుని హృదయం కిలకిల మనదు.

"చౌదరీ, నీవే నాకు ప్రాణము. నన్ను నీ అధీనంలో ఉంచుకొంటావా?"

"పిచ్చివాడా! శాస్త్రాలూ చదువుకుని, నాలుగురాళ్ళు తీసుకు రాగలిగి అలా అంటావేమి? నీయిష్టం వచ్చినన్నాళ్ళు నాదగ్గిర వుండు."

"అయితే మీ ఇంటికి వెళ్ళక నీవు ఇలా ఒంటరిగా ఉంటావేమి?"

"హరీ, మావాళ్ళకూ నాకూ పడక ఇలా ఉంటున్నాను."

"తరుచు నువ్వు ఎక్కడికో రాత్రిపూట వెడతావేమి?"

"స్నేహితుని ంటికి" అని చౌదరి కొంతసేపు ఊరుకొని ఇలా అన్నాడు: "మీవాళ్ళకూ నీకూ పడకనా ఇలా వచ్చావు? మరేదైనా తగినంత కారణం...?"

అర్థోక్తిలో అందుకుని "మరెవరితో లేదు. మరేమీ లేదు" అని హరి సంభాళించుకొంటూ పలికినాడు. అతని కళ్ళల్లో కన్నీరు తూగాడింది. పురాతనస్మృతులు ఆ కన్నీటిలో ప్రతిఫలించాయి. చౌదరి అది గ్రహించి అతన్ని అట్టే అడగదలచలేదు.

హరిచరణుడు రెండుమూడురోజులు పార్కులో నీళ్ళను చూస్తూ, ఆకాశం చూస్తూ మానవసంఘాన్ని

బహిష్కరించాడు. సమాజాన్ని తప్పించుకొంటూ ఏదో పరధ్యానంగా ఉంటూవచ్చాడు. చరణుని పరధ్యానము, ఉదాసీనత కనిపెట్టి అతనికి ఉల్లాసము కలిగించా లని చౌదరి ఆలోచించినాడు.

"హరీ ! నేను రాత్రి ఎక్కడికి వెడతానో అడిగావు కదూ ?" అతను చరణుని కుతూహలము రెచ్చగొట్టి రాడు. "ఆ, అవును" అన్నాడు చరణుడు.

"నేను మంచిచోటికి వెళ్లను. అయితే మంచి ఖుషీగా మాత్రం ఉంటుంది."

"ఏచోటయితే ఏం ? నన్నుకూడా నీవెంట తీసుకుపో" అని చరణుడు ప్రాధేయపడుతూ అడిగినాడు.

"అయితే రాత్రి పెందరాడే తిండి తిని వెడదాము."

సంజవేళ పోస్టువాడు ఉత్తరం తెచ్చి హరిచరణునకు ఇచ్చాడు. అతని విలాసము ఎవరూ ఎరగరు. ఎలా ఉత్తరం వచ్చిందా అని ఆశ్చర్యపడుతూ కవరు విప్పి దీపందగ్గర ఈజీచైరులో నడ్డి వాల్చి చదివినాడు. విహారి రాసిన ఉత్తరం అది :

"ప్రియమిత్రమా !

నీకోసం కళ్ళు కాయలు కాచేలాగ ఎదురు చూచాను. నీవు ఎక్కడా కనపడవు. గుండె బరువుతో రాస్తున్నాను. తారిణీ, మా అమ్మగారూ మా పిన్నిగారింటికి పొరుగూరు వెళ్లిపోయారు. తిండికి కూడా గడవక, నిన్ను నమ్ముకుని కలకత్తాలో కాపరం చెయ్యలేమనీ, ఎక్కడ ఉన్నా నీ క్షేమం నన్ను తెలుసుకోమనీ చెప్పి వెళ్లారు. నీ తల్లికి ద్రోహం చేశావు. తండ్రి సాధువుల్లో కలిసినమాత్రాన వంశం ఇలా చితికిపోవడమా ? నీ కర్తవ్యం మరిచిపోతున్నావు.

అన్నట్టు మరిచిపోయాను రాయడం : గాయాన్ని రేపుతున్నాను; కారం చల్లుతున్నాను ఈ వర్తమానంవల్ల.

నీ ప్రేయసీ-అలా అంటే కోపం రాదుగదా! అవును, ఒకప్పుడు పూర్వాశ్రమంలో నీ ప్రేయసిగదా-ఆ అరుణతార సన్యాల్ పెట్టిన ఐస్ పార్లర్‌లో నౌకరీ కుదిరింది ! సన్యాల్ సామాన్యుడు కాడనీ, ఆ మెరూపానికి మురిసి నౌకరీ ఇచ్చాడనీ వదంతి లేగింది. 'కవికోకిలనింపోవనావ హృదయసామ్రాజ్యపట్టాభిషిక్తను చేసినావు. ఆ తార రంగులు ఫిరాయిస్తూ ఉంది. ఇలా రాశానని కోపగించకు.

—సదా నీ క్షేమంకోరే ప్రియమిత్రుడు, విహారి "

ఉత్తరం చదివి తడిసిన కవరు ఒకమూల పడేసినాడు చరణుడు.

చౌదరీ ఉదయాన్నే కాఫీ తెప్పించాడు. చరణుడికి కాఫీ తాగడానికి మనసు పోలేదు. అతని వాలకం కనిపెట్టి చౌదరి "ఏమోయ్ ! నీకీ బాధలు నిషాతోగాని పోవు" అన్నాడు.

"కాదు విశ్వంభరా ! స్నేహితుడు రాసిన ఉత్తరం. నమ్మి జీవితాన్ని ఒకరికోసం పాడుచేసుకున్నాను."

"ఎవరా స్నేహితుడు !" అని ఔత్సుక్యం కనబరిచినాడు చౌదరి.

"ఏం చెప్పను ? అబ్బా! స్నేహితురాలే నా కొంప తవ్వేసింది" అని దీర్ఘంగా నిట్టూర్చినాడు హరి.

"అన్నీ మరిచిపోవాలి. భోగట్టా చేసి కష్ట పెట్టను గాని రాత్రి ఖులాసాగా అలా వెళ్ళేసి వద్దాం" అన్నాడు విశ్వంభర చౌదరి.

౫

రాత్రి మిత్రు లిద్దరూ బండి మాట్లాడుకొని చిత్పూరు రస్తాలో ఒక పెద్దమేడదగ్గిరికి వెళ్లినారు. చౌదరి హరిచరణుని చెయ్యిపట్టుకొని మేడలో ప్రవేశించాడు.

భద్రకాళి విలాసంగా ఇద్దర్నీ లోపలికి ఆహ్వానించింది. హరిచరణుడు కాళిని చూచి అసహ్యపడ్డాడు. అతను ఎప్పుడూ స్త్రీని కన్నెత్తి చూడలేదు. శరీరం కంపమెత్తింది. మిత్రుణ్ణి తీవ్రంగా చూచి కళ్ళు చిట్లిస్తూ "నన్నీ అంధకారంలోకి ఎందుకు ఈడ్చావోయ్ ?" అని బాధతో అన్నాడు.

భద్రకాళి చరణుని వింతవర్తనము చూచి తెల్లపోయింది. చౌదరి కొయ్యలా నిలవబడ్డాడు. కొంత స్తిమితం చిక్కినతర్వాత "హరిచరణ్, రావోయ్, లోపలికి పోదాం" అంటూ హెచ్చరిక చేశాడు చౌదరి.

తన మానసికస్వేచ్ఛను మిత్రుని చేతుల్లో అమాయకంగా అప్పగించి, యంత్రంలాగ కదిలి గదిలోకి

వెళ్లాడు హరిచరణుడు. పందిరిమంచంమీద మల్లెపువ్వు లాటి దుప్పటి ముడతలులేకుండా పరిచి ఉన్నది. మంచంమీద కూర్చోడానికి అతనికి జంకు పుట్టింది. అతని భుజం తట్టుతూ 'ఫరవాలేదు కూర్చో' అని విశ్వంభరుడు హెచ్చరించగా మంచంచివర కూర్చున్నాడు చరణుడు. చౌదరి గోడ కానుకొని పక్కమీద కూర్చున్నాడు. భద్రకాళి హుక్కాగొట్టం తెచ్చింది. హరికి ఏమీ పాలుపోలేదు. ఏదో పారేసుకొన్నవాడివలె అతను తంగారుపడి కాళిని చూచి చీత్కారము చేసినాడు. భద్రకాళిగుండె కలుక్కుమన్నది. క్షణంసేపు ఆమెకు మతి పోయింది. విశ్వంభరుడు చేసే హుక్కాగుడగుడశబ్దం విని, ఆమె హరిచరణుని ముఖం చూస్తూ మంచంపక్కనే నిలుచున్నది. ఏదో అవసరం ఉన్నట్టు హుక్కాగొట్టం కింద పెట్టి విశ్వంభరుడు లోపలికి వెళ్ళాడు.

మంచంమీద ఇద్దరే ఉన్నారు.

"పైసా పుచ్చుకొంటావా !" అని మాటలు కూజాలోనుంచి మొదటిసారి ఒలికిన నీళ్లల్లా వచ్చాయి. అతని మాటలకు కాళి లోలోపల నవ్వుకొన్నది. ఈ ఏడెనిమిదేళ్ళ వృత్తిలో ఇంత వింతమనిషీ, అమాయకుడూ ఆమెకు తటస్థపడలేదు. ఈ రాత్రి చౌదరి ధర్మాన హరిచరణుడు ఆమెపాల పడినాడు.

పైట సర్దుకొంటూ, చిరనవ్వుతూ "మీరు రావడం మా ఇల్లు పావనం..."అని కాళి అంటూంటే అర్థోక్తిలో హరిచరణుడు అడ్డువచ్చి "పావనం మాట అలా ఉంచు. డబ్బు తీసుకోవా ?" అని ఆదుర్దాగా అన్నాడు.

"డబ్బు తీసుకోకపోతే మా కెలా గడుస్తుంది !" అని ఆమె నవ్వుతూ సమాధానం ఇచ్చింది అతని అమాయకత్వం గ్రహించి.

భద్రకాళి మాటలు అతను వినడానికి ఇష్టపడక జేబు తడుముకొన్నాడు. జేబు రూపాయలతో గలగలలాడింది. అతని కాశ్చర్యం వేసింది తన కా రూపాయలు ఎలా వచ్చాయని. చౌదరి జేబులో పడవేసి ఉంటాడని ఊహించినాడు. హరిచరణుడు గుప్పెడు రూపాయలు తీసి కాళిచేతుల్లో పోసి వెళ్లిపోవాలని ప్రయత్నించినాడు. చేతులో ఎన్ని రూపాయలున్నాయో అతను చూచుకొనైనా లేదు. అతను వెళ్లిపోతూ వుంటే కాళి వింతగా నవ్వుతూ "ఏమండీ, వెళ్లిపోతారేం ?" అని సవినయంగా ప్రశ్నించింది.

అతను ఏమీ మారుచెప్పక స్తంభంలాగ నిలబడినాడు. భద్రకాళి అతన్ని చూచి జాలిపడి ఎందుకో డబ్బు తిరిగిఇచ్చివేదా మనుకొన్నది. అలా సొమ్ము తిరిగి ఇచ్చివేస్తే ఏమనుకొంటాడోనని భయపడింది. అయినా వచ్చేపోయే రసికులను రంజింపచేయడం నేర్చుకొన్నది కనుక ఒకొక్కప్పుడు తిట్లూ, దీవనలూ ఆమె సమానంగా ఎంచుకోవాలి. అతను గుమ్మం దాటి వెళ్లిపోతూవుంటే కాళి అతని పాదాలకేసి అర మోడ్చిన కన్నుగవతో చూచింది. అదివరకు ఎందరో ఆమె హావభావవిలాసాలకు లోనయినారు. అయితే ఎందుకో అస్పష్టంగా ఆమెహృదయంలో హరిచరణునిమీద మమత బయలుదేరింది. బహుశా అతని అమాయకత్వం ఆమెహృదయాన్ని చూరగొన్నదో ఏమో. రసికులు అంత అమాయకంగా ఉంటారా అని అనుకొని ఉండవచ్చును. అతన్ని చూచి బతికి చెడ్డాడని జాలిపడిందేమో. హరిచరణుడు మాత్రము కాళిలో బయలుదేరిన వింత పరివర్తనాన్ని తెలుసుకొనే స్థితిలో లేడు. విసవిస అతను గుమ్మందాటుతూ ఉంటే చూచి విశ్వంభర చౌదరి అడ్డగించి "ఎక్కడికోయ్ వెళ్లిపోతున్నావు ?" అని అడిగినాడు. రెండు మెట్లు దిగాడు హరి.

చౌదరి "నేనూ రానా ?" అని వినయంగా అడిగినాడు.

"నన్ను వెళ్ళనీ-తర్వాత నీవు రావచ్చును" అంటూ తొందరగా వెళ్లిపోయాడు చరణుడు.

విశ్వంభరుడు పైకి వచ్చినాడు మేడమీద నుంచి భద్రకాళి హరిచరణుని చూస్తూ ఉంది. ఆమె చేతిరుమాలులో కట్టుకొన్న రూపాయలు అతని చేతిలో పెట్టి "ఇది పాపిష్ఠిసొమ్ము. తీసుకోను. వెంటనే వెళ్లి అతనికి ఇచ్చెయ్యి" అంది.

"ఏం అలా అంటావు ?"

"అతనికి మతి స్థిమితంగా లేదా ?" అని అడిగింది కాళి.

"లేదు."

"ఎందుచేతనో తెలుసునా ?" అని కుతూహలం కనబరచింది.

"ఇంట్లో బాధలవల్ల అలా అయిపోయాడు."

"అయితే ఎందు కతన్ని తీసుకురావడం ?"

"అతనే వచ్చాడు కూడా."

భద్రకాళి కొంతసేపు ఆలోచించింది. "చాదరీ, వాడు సాయం చేసిపెట్టాలి."

"ఏమిటి చెప్పు."

"చెప్పడం కాదు. వెంటనే చెయ్యాలి. అతని మకాము ఎక్కడ ?"

"ఈడెన్, గార్డెన్, దగ్గిర నా బసలోనే ఉంటాడు."

"అతన్ని తీసుకు రద్దూ."

"అత నింక రాలేదు. ఇలాంటి శాపులు అతనికి సరిపడవు."

"అలా కాదు. ఏదో సెకంమీదనైనా తీసుకురా"

చాదరి నవ్వుతూ "అకస్మాత్తుగా ఆ వెర్రివాడి మీద ప్రేమ దొర్లుకొచ్చిందా ?" అని అడిగినాడు.

"నన్ను ఎగా దిగా చూడక ఊరికే సొమ్మిచ్చి వెళ్లిపోయాడు వెర్రివాడు. నాకు అతనిమీద ఏదో ఇష్టం కలిగింది చాదరీ" అంది.

"అలాగే అతన్ని తీసుకొస్తాను సరిగదా" అన్నాడు చాదరి.

## ౬

యథాప్రకారంగా హరిచరణుడు ఈడెన్ గార్డెన్‌కు వెళ్లినాడు. చాదరీ రాకపోవడంవల అతను తోటలో సిమెంటుబెంచిమీద కూర్చుని తారవరె ఉన్న అంధకార ప్రపంచంలో మినుకు మినుకు మని మెరిసే నక్షత్రాలను తిలకిస్తూ కాలం గడిపినాడు.

సవ్యాల్ దగ్గిర అరుణతార నౌకరీలో ఉందని తెలిసినప్పటినుంచీ అతని మనసు కుంగిపోయింది. అతను ఈర్ష్యాద్వేషాలను ఎంత దూరంచేదా మన్నా సాధ్యం కాలేదు. అరుణతార తన జీవితపథాన్ని చూపే ధ్రువతార అనుకొన్నాడు. గాఢంగా ప్రేమించాడు. ఆమెతో ఎన్నో అనుభవాలు పొందినాడు. నిశ్శబ్దమైన రాత్రివేళ స్మృతితూలిక పూర్వానుభవాలను మనసులో చిత్రిస్తున్నది! ఎంత విస్మరించాలని యత్నించినా లాభం లేకపోతున్నది. స్త్రీ హృదయం తెలిసీ తెలియక ఎలా బోల్తా పడ్డాడు! పులితో చెలగాటం కాదా స్త్రీతో సంబంధం? ఎన్నెన్ని రంగారు బంగారు స్వప్నలోకాలు సృష్టించుకొన్నాడు! ఆమెతోనే తన జీవితసర్వస్వం ఉందని ఎంచుకొని ఆమెను అందల మెక్కించాడు.

నిశ్శబ్దనిశీథినిలో తారలను చూస్తూ అరుణతారను ఎలా మరిచిపోవడం? ఒకరాత్రి గుడ్డివెన్నెల కాస్తూ ఉండగా తాను కరణాలకం తోటలో ప్రవేశించడం, తన ప్రియురాలు గవాక్షందగ్గిర ఎదురు చూస్తూ ఉంటుందని అనుకోడం జ్ఞాపకం వచ్చింది. ఎవ రయినా చూసినా లక్ష్యంచెయ్యక, సాహసంతో తాను మందిరంతోటలో వెర్రిగా తిరిగాడు. చలికి గుప్పటిముసుగు పెట్టుకొని కిటికీకింద అరుణతారకోసం పదికాపులుకాని రెండు గంటలు కనిపెట్టుకోడం, ఆమె కోమలహస్తం కిటికీచువ్వలోకి పోనిచ్చి సైగ చేయడం, తరవాత ఇద్దరూ తోటలో వరమామిడిచెట్టు కింద వెన్నెలనీడల్లో కలుసుకొన్న క్షణాలు స్మృతిపథానికి వచ్చినవి. హరిచరణుని శరీరం పులకరించిపోయింది. అరుణతార అతని శరీరంమీద కోమలహస్తం ఉంచేసరికి అతని నోట మాట రాలేదు.

"ఎలా వచ్చావు చరణ్? భయం వెయ్యలేదూ? ఒక్కడివీ ఎలా వచ్చావో?" అంది తార.

"నీకోసం వచ్చేప్పుడు భయాలు అడ్డం వస్తాయా?" అని అతని జవాబు.

"నీ హృదయంలో నాకు చోటు ఇస్తావా?" అని ఆమెప్రశ్న.

"నా హృదయ మంతా నీదే" అని అతని సమాధానం.

చరణుడు అనుకొన్నాడు. తన గుండెల్లో ప్రియురాలు చోటు అడిగి చివరకు ఇలా ద్రోహం చేస్తుందా? అరుణతారే ప్రపంచంగా, సర్వస్వంగా తలచిన తనను ఇప్పుడు ఎలా ఏడిపిస్తున్నది! పూర్వప్రేమ యావత్తూ మరిచిపోయి పరాయిదానిలాగ చలచిత్తంతో బిస్ పార్లర్‌లో సవ్యాలుదగ్గిర నౌకరీకి అంగీకరించిందా? రూపం ఎక్కడ ఉంటే అక్కడ సవ్యాలు కదిపి చూస్తాడు. ఆ దుర్మార్గుడు తారకు శరణ్యమా? నాహృదయంతో ఇలా ఆటలాడుతుందా? ఒక ఉద్రేకపువెల్లువ కెరటంలా వచ్చి అతన్ని సంక్షోభపెట్టింది. ఈడెన్ గార్డెన్‌లో ఎలెక్ట్రిక్ పోస్టు దగ్గిర కూర్చుని హరిచరణుడు ప్రియురాలికి ఉత్తరం రాశాడు. ఆమెమీది కసి పట్టలేక తన గుండెలు చీల్చి రక్తంతో సంతకం పెడదామన్న ఈర్ష్యానలం ప్రజ్వరిల్లింది. మరుక్షణంలో ఈర్ష్యాతీవ్రత తగ్గింది. అప్పుడు అనుకొన్నాడు: నేను ఆమెను వివాహం చేసుకోలేదు. ఎందుకు నేను తారమీద ద్వేషభావం చూపడం! ఆమె నా హక్కయిపోయినట్లు ఎందు

కిలా అనుకోడం! కొంతసేపటికి తిరిగి ఈర్ష్య తలెత్తింది. ఉండబట్టలేక రాసిన ఉత్తరం పళ్లు కొరుకుతూ చదివినాడు:

"ఈడెన్ తోట, రాత్రి, బెంచీమీద—

"మంజుభాషిణీ!

శుభాశీస్సులు. ఇలా నిన్ను సంబోధించడం ఉచితమే అనుకోవా? ఎన్ని మాటలు-ఎంత తీయని వాగ్దానాలు-శపథాలు చెప్పి నన్ను ఊరించి రెచ్చగొట్టి ఉన్మత్తుణ్ణిచేసి, అనంతపథాల్లో అనేకఅనుభవాల్లో లాలించి, కొండశిఖరాన కూర్చోపెట్టి, ఇప్పుడే వస్తాను ఉండు అంటూ వెళ్లిపోయి ఇంత దగా చేస్తావా? దగా అనను, ఆటలాడతావా! ఆకాశానికి రంగులు ఫిరాయించే స్వభావం సహజంగా ఉంది. ఇలా రంగులు ఫిరాయించి స్థిరత్వం లేని కపటప్రేమ నాటకానికి నాందీప్రస్తావన సాగించి ఆఖరికి భరత వాక్యంలో నన్ను గతిలో పడేస్తావా?

అవును. మీ జాతిస్వభావమే అంత! పోనీ, అలా అనుకొందామంటే ఘరానావంశంలో పుట్టిన దానివి! నా హృదయాన్ని ముక్కలు చెక్కలు చేసి, వింతగా నవ్వుతూ నా మిత్రులతో ఇచ్చకాలు మాట్లాడతావా? విహారిని నీదగ్గిరికి పంపితే అతనికి ఒక ఉత్తరం ముక్కయినా రాసిచ్చి పంపావు కాదు. నీలో ఎందుకిలా మార్పు వచ్చిందో ఊహించుకోలేక తికమక పడిపోతున్నాను. ఉత్తరానికి సమాధానం కూడా ఇవ్వవా?

చదువుకొన్న దానివి—శాస్త్రోక్తంగా ప్రపంచ జ్ఞానం సంపాయించినదానివి—నమ్మించి ద్రోహం చెయ్యడం ధర్మంగా నీకు తోచిందా? నీ చదువు ఇందుకే వినియోగించినందుకు చదువుకొన్న ఆడాళ్ళం దరిమీదా నాకు కసిగా ఉంది. శేమ మతిలేక రెక్కలు కాలిన మిడతలాగా తపతపలాడుతూ జీవచ్ఛవంలా-కీనీడలా తిరుగుతున్నాను. ఉండనా?

నీ హరిచరణ్."

చరణుడు తన ఉత్తరం చదువుకొని అశ్రుధారలు కురిపించాడు. తెల్లవారుతున్నది. ఉత్తరం పోస్టులో వేదామని పోస్టు ఆఫీసుకు మరలినాడు.

జేబులోనుంచి ఉత్తరం తీసి వేస్తున్నప్పుడు చిన్నఫొటోకూడా ఇవతలకు వచ్చింది. ఫొటోలో అరుణతార రేకెత్తిన లజ్జాభరముతో, అర్ధమందస్మితముతో, నమ్రవదనంతో కొత్త పెళ్లికూతురివలె ఉంది. ఆ మందహాసములో హరిచరణునికి కౌటిల్యము గోచరించింది. ఇప్పుడామె లజ్జావనతవదనగా అతనికి తోచలేదు. హృదయోద్వేగం వెల్లువలా వచ్చింది. ఫొటో చింపి ముక్కలుచేసి పారవేసినాడు. అసలు రాసిన ఉత్తరం చింపివేసి తెగతెంపులు చేసుకొందామని తలచినాడు. తీరా ఉత్తరం పోస్టు చేశాడు.

నడుస్తున్నాడే కాని నడక తనదని అతనికి తెలియదు. పాదాలకుఎక్కువ వివేకం ఉందేమోగాని అతని మనసుకు మాత్రం లేదు. మనసు ఈర్ష్యాప్రకోపంవల్ల తప్తమైపోయింది. తాను చౌదరీ ఉన్నచోటికి వెళ్ళవలసినా గమ్యస్థానంకూడా గమనించక హరిచరణుడు సాగిపోతున్నాడు. గుండెల్లో తాటాకులు మంటపెట్టి, రగులుతున్నట్టు బాధపడుతూ నడుస్తున్నాడు. కొంతసేపటికి తన అహంకారం, పూర్వుల ఘనతా అంతరంగములోనుంచి పైకి వచ్చేసరికి "ఛీ! సామాన్య స్త్రీకోసం జీవితం ఇలా వ్యర్థం చేసుకోవడం భావ్యమా" అని అతను అనుకొన్నాడే కాని ఆ భావం అట్టేసేపు స్థిరంగా లేదు.

తోవలో సైకిలుమీద పోతూ సన్యాల్ ఎదురుపడినాడు. అతను సైకిలు ఆపివేసి హరిచరణున్ని వింతగా పలకరించినాడు. ముళ్ళమీద నిలవబడినట్టు హరిచరణుడు ఎలాగో నిలవబడినాడు. "హరిబాబూ! కులాసాగా ఉన్నారా?" అన్న ఆ కొంటెప్రశ్నకు వ్యంగ్యధోరణిలో అనుకోకుండా హరిచరణుడు సమాధానమిచ్చినాడు.

"హ్హా, ఇంతకన్న కులాసా ఏమిటి?" అని.

వెంటనే అతను గిరుక్కున తిరిగినాడు. సన్యాలు అతని వాలకం కనిపెట్టి, తెగిన గాయంమీద కారం చల్లాలని "హరిబాబూ! అన్నట్టు మీ తెరగరా? మీ స్నేహితురాలు మా పార్లోర్‌లో పని చేస్తున్నట" అన్నాడు. అందుకు హరిచరణునికి కోపం వచ్చింది. ఎలాగో నిగ్రహించి పెదవులు బిగపట్టి, పల్లెత్తుమాటకూడా సమాధానము ఇవ్వలేదు.

"అప్పుడప్పుడూ మీసంగతే చెపుతూవుంటుంది తార. మీరు చాలా మంచివారనీ..." సన్యాలు ధోరణికి హరిచరణుడు అడ్డువచ్చి "నాకు తొందరపని... వెళ్లిపోవాలి..." అంటూ చటుక్కున మరలినాడు. సన్యాలు తుణం ఊరుకొని సాగిపోయినాడు.

(ఇంకా ఉంది.)

# జీవితంలో చేసే తప్పులు

✳

— శ్రీ కామేశ్వరరావు —

కాట్యా కొన్ని రాత్రులనుంచి ఇంటికి ఆలస్యంగా వస్తూంది. తెల తెల వారి పోతూన్నప్పుడు షాంపేన్ మైకం యింకా వదలకుండానే తనగదికి చేరుతూంది... కాట్యా యిల్లు వదలి మరోకచోట సౌఖ్యంకోసం ప్రాకులాడుతూవుందని భర్తకు కోపం వస్తుంది. కాట్యాచెల్లెలు దాషా యౌవనంతోనూ, అందుకై వుండే ధర్మభీరుత్వంతోనూ తన అక్కగారి దగ్గరకు వెళ్లి అంతా ఒప్పుకోమని అడుగుతుంది. కాట్యాకు తనభర్త తెలిసికొన్నదానికంటె ఎక్కువ తెలిసికోవడంవలన ప్రయోజనం కన్పించదు. కాని పదెనిమిదేళ్ల తన చెల్లెలు నిర్మించుకున్న ఆశయాలను త్రోసిపుచ్చడం కాట్యాకు యిష్టంలేదు. అందుకు తన భర్త నికొలై దగ్గరకు ధైర్యంతో వెళ్లి—"వివాహమప్పుడు ఏమయిందో కాని నేను యింక ప్రేమించలేకపోతున్నాను." అని చెబుతుంది.

తరువాత కాట్యా పేరిస్ వెళ్లి పోతుంది. నికొలై క్రిమియా వెళ్తాడు. దాషామాత్రం వారిద్దరి మధ్యా సామరస్యం కుదర్చాలని ప్రయత్నం చేస్తుంది. కాట్యాకు తనచెల్లెలు ఒక్కరితే తనకు స్నేహితురాలని తోస్తుంది. ఉత్తరాలు వ్రాస్తూవుంటుంది. ఒక ఉత్తరంలో—

"...నేను ఇక్కడకు వచ్చినది మొదలు ఒక తను నన్ను వెంటాడుతున్నాడు. అతనిని ప్రతినిత్యమూ దూరంనుంచి మాత్రమే చూస్తున్నాను. నన్ను అతను ఎప్పుడూ పలుకరించలేదు. వెళ్లాళ్లు యిలా జరిగింది. నిన్న రాత్రి లుగ్జెంబర్గ్ తోటలో నాదగ్గరకు వచ్చాడు. హఠాత్తుగా 'నీ అంత అందమైన స్త్రీని ఇదివరకు నేను చూడలేదు. నిన్ను ప్రేమిస్తున్నాను. నాకు ఈ ఆపద వచ్చినప్పటినుంచి మన స్తిమితం పోయింది' అన్నాడు. తక్షణం నేను లేచి 'ఇక్కడనుంచి వెళ్లిపో. ఇలా మాట్లాడడం నాకు యిష్టంగాలేదు.' అన్నాను. అతను వెళ్లి పోయాడు...

"ఈ రోజు సాయంత్రం కబురు తెలిసింది-అతను చనిపోయాడట! దాషా, ఎంత విచిత్రం! కొంతసేపు నావల్లనే అతను చనిపోయాడనుకొన్నాను. కాని నేను ఏం చేశాను? ఈ రోజు అతనంటే నాకు చాలా కోపంగా వుంది...ఎక్కడకు వచ్చినా కలత తప్పడంలేదు, ఆఖరికి... ఎందుకో జీవితం ఎప్పుడూ సంతృప్తిగా వుండడంలేదు." అని వ్రాస్తుంది.

దాషా యీ లేఖను తీసుకువెళ్లి నికొలైకి చూపిస్తుంది. అతను రెండుసార్లు చదివి-"దాషా, మన జీవితం అధోగతిలో వుంది. అస్తమానం ఆనందంకోసం యింకా యింకా ఎక్కువగా ప్రయత్నం చేస్తాము. ఆఖరికి ఒక రోజున అంతా భగ్నమయిపోతుంది..." అంటాడు.

రష్యను రచయిత అలెక్సై టాల్‌స్టాయ్ యీ సంఘటన సృష్టించాడు.

జీవితంలో చేసే మొదటితప్పు నికొలై సూక్ష్మంగా చెబుతాడు. "అస్తమానం ఆనందంకోసం యింకా యింకా ప్రయత్నం చేస్తాము." విశ్వంలో ప్రయత్నమంతా అందుకే. ఉన్నదానికన్నా ఎక్కువ సుఖంగా ఉండాలని. ఏవో, ఇంకా తియ్యని సంఘటనలు రావాలనుకొంటాము. మనకు తెలియకుండా మనకు అప్పుడే అపకారం చేసుకొంటాము. ఈ 'అన్వేషణ' లోనే ఉన్నదానిలో అసంతృప్తి బయలుదేరుతుంది. 'ఇంక అవసరం లేదు' అన్న పరిస్థితి ఎవరికోగాని వుండదు. 'లబ్ధాధికం జాయతే...' అని కాదూ మన పెద్దలు అన్నారు? 'ఎందుకో జీవితం ఎప్పుడూ సంతృప్తిగా లేదు' అంటుంది. ఈ అసంతృప్తి రాకూడదు. ఈ అనిర్ణీతమైన అసంతృప్తి ఆవేదనగా మారిపోతుంది. జీవితానికి స్థిరత్వమూ, నిర్దిష్టమార్గమూ లేకుండా చేస్తుంది. ఎందుకూ సమాధానం చెప్పలేని ఆందోళన తెప్పిస్తుంది. దేనికీకూడా యీ ఆవేశపీడిత హృదయాన్ని సరిపెట్టగలిగే సమాధానం రాదు. ఈ తలిరాకు మెయిపూతవంటి సుకుమారభావం మన తత్వంలోనికి వచ్చిందనగానే క్రమక్రమంగా బ్రతుకులో వెర్రి నిస్పృహ బయలుదేరుతుంది. ప్రతిదినమూ ఏదో క్రొత్త ఉద్రేకపు తీపి కావాలని కోరుకుంటాము. మన ప్రకృతిలో యీ బలహీనత రాకూడదు. యౌవనంలో సాధారణంగా యీ 'తీయనిబాధ' ఆవేశిస్తుంది. కాలక్రమేణా నిశ్చలతా, ఏకాగ్రతా నశించిపోతాయి. జీవితం అల్లకల్లోలం అవుతుంది. వెలితనం వస్తుంది. అందుకే కాబోలు జి. కె. సి. అంటాడు—"మగవాళ్ళు మగవాళ్ళే; కాని మగవాడు మాత్రము ఆడుది..." అని.

జీవితంలో ఎక్కువగా తప్పులుచేసే సంస్థ వివాహం. వివాహం ఒక బంధనం అయిపోయింది. అందరూ తప్పకుండా వివాహం చేసుకు తీరుతారు. చాలామంది వయస్సుముదిరినతరువాత వివాహం చేసుకోవాలి. కొంతమంది వివాహంచేసుకోకుండా వుంటే బాగుండును.

కొంతమంది మానవుల ప్రకృతి కొంచెం సంకుచితమైనది. తనను గురించి తప్ప ఆలోచించుకోలేరు. ఆ జన్మాంతమూ తనతో జీవించేవారికికూడా తనలో తావు యివ్వలేరు. ఒంటరిగా వున్నట్లే మసలుకొంటారు. స్వవిషయం మాత్రమే ఆలోచించుకోగలరు. తమ ఆనందం మరొకరితో పంచుకోవడం తెలియదు. వారికి వివాహంలో సుఖం ఎక్కువగాలేదు—ఇంకొకరు తమ ప్రకృతిని పూర్తిగా అణచుకొని వీరి సౌఖ్యం కోసమే తాపత్రయపడితే తప్ప. ఈ పరిస్థితిలో తెగతెంపు చేసుకోలేని బాంధవ్యం లేకపోతే మంచిది.

మరికొంతమందికి ఉదారత హెచ్చు. దీనినే ఆధారం చేసుకొని ప్రతిసమస్యనూ చులకనగా చూడడమూ, జీవితపు పద్ధతులపై నిర్లక్ష్యతా బయలుదేరుతాయి. సంఘనియమాలను పాటించడమంటే వీరికి విసుగు. అందరూ త్రొక్కిన దారులు కఠినముగా వున్నాయనుకుంటారు. ఈ "అతి" వున్నవారు వివాహం చేసుకోబోయేముందు ఎంతో ఆలోచించుకోవాలి.

చాలామంది వివాహం చేసుకొన్నతర్వాత తప్పు చేశామని విచారిస్తారు. వివాహముతో అదృష్టము వస్తుందనుకొని బయలుదేరుతారు. వివాహముముందు ఎన్నో ఆశలతో వుంటారు. తనకు అనువైన భార్యో, భర్తో రావొచ్చునని ఊహించుకుంటారు; లేదా తనకు జీవితంలో పెద్ద మార్పు వస్తుందని ఆశతో వుంటారు. ఈ దశలో వీరి మూర్ఖత చూస్తే జాలివేస్తుంది. వివాహం అయిన తరువాత అన్నీ అడ్డు తిరుగుతాయి. అప్పుడు ఎన్నో ఆశలు పెట్టుకొని వివాహానికి ఒడంబడినవారు నిర్ఘాంతపడిపోతారు. వారి ఆశయాలను పాటించేవారు వుండరు. కబుర్లతో వారిని ఊరడించడానికి యితరులు ప్రయత్నిస్తారు. దానితో వారి ప్రకృతే వక్రంగా తిరుగుతుంది. వారు వివాహంలో పొరపాటుచేశామా అని ప్రశ్నించుకోవలసి వస్తుంది.

వివాహంలో ప్రేమనుగురించి నాకు తెలియదు. కాని ఇదిమాత్రం అందరూ ఒప్పుకొంటారు. వివాహము శారీరకమైన దివ్యబాంధవ్యము. ఈ కలయికలో దేనికి ప్రాముఖ్యము లేకపోయినా వివాహము అనర్థమవుతుంది. సవ్యంగా జరుగుతే వివాహమంత సూక్ష్మమైనది లేదు. కాని సమస్యగా పరిణమిస్తే అన్నీ చిక్కులే. వివాహం కొంతమందికి విధినిర్వహణ; కొంతమందికి చెలగాటం; చాలామందికి ఏమీకాదు. విధిలేక పెళ్ళిచేసుకున్నవారు "ధర్మ" భీతి వున్నవారు. చెలగాటంగా పెళ్ళిచేసుకున్నవారు శారీరకంగా, మానసికంగా కొంతకాలమువరకూనైనా సుఖపడతారు. ఆఖరివారే వివాహాన్ని సమస్యగా తయారుచేశారు... కాని కాట్యా ధైర్యవంతురాలు. వివాహంనాడు భర్త నచ్చేవాడేమో. కాలక్రమేణా భర్త యివ్వగలిగే ఉత్సాహంతో ఆమె తృప్తిపడలేదు. ఈ విషయంలో నికొలైకి ధైర్యం వుండాలి.

దాషా బాహాటంగా బ్రతకాలనుకొనే అందమైన తెలివితక్కువపిల్ల. అక్కగారికి ఆమె ఒక్కరితే నిజమైన స్నేహితురాలు. అందుకు దాషా భావాలను తృణీకరించకుండా గౌరవిస్తుంది. కాట్యాకు దాషామనస్సులో వున్నంత స్వచ్ఛందమైన మార్గాలలో నమ్మిక పోయింది. కాని తనకు సుఖము నిచ్చే పద్ధతులను దాషా అనుకరించాలని ఏనాడూ ప్రయత్నం చెయ్యదు. ఆమెజీవితం ఆమెది; తన ఒడుదుడుకులు తనవి. వీలయినంతవరకూ తన స్నేహితురాలు దాషాకు కష్టం కలుగచెయ్యకుండా చూస్తుంది. నిజమైన స్నేహం అది.

కాని స్నేహము చెయ్యడమే జీవితంలో మనం చేసే తప్పులలో ఒకటి. నిజమైన స్నేహితులను చెరుకోగలిగిన నాడు మన తప్పులను మనం కనిపెట్టగలిగామన్నమాట. ద్రుపదుడు ద్వేషంతో పలికినా యథార్థమైన మాట చెప్పేడు: 'సమశీల శ్రుతయుతులకు, సమధనవంతులకు, సమసుచారిత్రులకు' మాత్రమే స్నేహము కుదురుతుందంటాడు. కాని ముఖ్యమైనది సమమైన లోపాలు వుండడం మరచిపోతాడు. అత్యద్భుతమైన స్నేహాలన్నీ యించుమించు సమమైన లోపాలమీద ఆధారపడినవే.

నిజమైన మిత్రుడు మన తప్పులను గర్హించడు; అతనికి వాటి ప్రశంసే లేదు కనుక. గర్హించినా మనకు చెప్పడు; మనకు కష్టం కలుగచెయ్యడం యిష్టంలేక. ఇంకా యథార్థప్రపంచానికీ, మనకూ మధ్య నిలిచి మనకు దెబ్బలు తగులకుండా చూస్తాడు. అప్పుడే మనకు అపకారము జరుగుతుంది. మన జీవితము యితరులదగ్గర నుంచి అప్పుతెచ్చుకొన్నట్లు తయారవుతుంది.

ఋషికుమారుడు "ఓదకాంతం స్నిగ్ధో జనః అనుగంతవ్యః" అన్న ప్రమాణవాక్యము జ్ఞాపకం చేస్తాడు. మనం గర్హించుకోవలసినది అదే: ఎంతవరకూ ఆప్తులైన వారిని అనుసరించాలి? అని. "నీటి ఒడ్డువరకూ" అని అంటారు. కాని ఈ "ఓదకాంతం" జీవితంలో ఎక్కడో?

# పరధ్యానం

[కథానిక]

●

= 'జమదగ్ని' =

చొక్కా గుండీలైనా పెట్టుకోకుండా హడావిడి పడి ఎల్లాగైతేనేం అరగంట ఆలస్యంగా ఆఫీసుకు చేరుకోగలిగాడు కృష్ణమూర్తి.

కాని జేబులో తాళంచెవు లేవీ ?

అయిన ఆలస్యం ఎల్లాగూ అయింది, పోనీ ఇంటికి పోయి వద్దామా అంటే, ఈమధ్య తనంటే జోత్తిగా గిట్టక మండిపడుతున్న పెద్దగుమాస్తాతో వేగడం సాధ్యమైన పనికాదు.

అదృష్టవశాత్తూ పక్క గుమాస్తా తాళంచెవి తన అల్మారాకు సరిపోయింది. 'బ్రతికి పోయాంరా ! భగవంతుడా' అనుకుంటూ తలుపు తెరిచి పనికి ఉపక్రమిద్దామని కుర్చీలో కూర్చున్నాడు.

ఇంతలో పెద్దగుమాస్తాగారు పిలుస్తున్నారంటూ జవాను రానేవచ్చాడు.

'నిన్న పంపించిన కాగితాలమీద నోట్ పుటప్ చేశావా ?'

'చిత్తం చిత్తం ! ఇదిగో పట్టుకొస్తున్నాను.'

షెల్ఫు లన్నీ వెతికినా ఆ కాగితాలు కనబడి చావవేం ?

కొరడాదెబ్బలా హెడ్ క్లార్కు బల్లమీద గంట మోగుతూనే ఉన్నది.

'వస్తున్నానండి, వస్తున్నానండి' అని యెన్ని సార్లు మొత్తుకున్నా ఆయనతొందర ఆయనదే !

కొంప మునిగింది! ఇంకేముంది ? నిన్న ఇంటికి తీసుకుపోయిన కాగితాల్లో ఉనికూడా ఉన్నాయేమో ! వంటినిండా చెమటలూ, శేష్లూ పోశినట్లయి కంగారు పడిపోతున్నాడు పాపం !

సమయం దొరికిందికదా అని నలుగురిమధ్యా నిలబెట్టి పెద్దగుమాస్తా నానా చివాట్లూ పెడుతూ ఉంటే, అతనియందు సానుభూతిగల మిగిలిన గుమాస్తాలందరూ బిక్కమొగం వేసుకు చూస్తున్నారు. కొందరికి ఆయన్ని పట్టుకుని నమిలి మింగేద్దా మన్నంత కోపంకూడా వచ్చింది. అయినా ఏం చెయ్యడానికీ ధైర్యంలేక అల్లాగే చతికిలబడిపోయారు.

అంతసేపు హంగామా చేసి, అన్ని చీవాట్లు పెట్టినా, కసితీరక క్రౌర్యంతో కదను తొక్కుతూ, 'ఇవ్వాళ ఆ కాగితాలు కనబడకపోవాలి! చూడు ఏంచేస్తానో' అంటూ పెద్దగుమాస్తా అల్లా వెళ్లాడు.

'ఏం కాగితాలోయ్' అంటూ నారాయణరావు వచ్చి పాడ్ కుళ్ళగించి చూస్తే ఆ కాగితాలు అక్కడే ఉన్నాయ్.

దాంతో కృష్ణమూర్తిగుండె కాస్త కుదుటబడింది.

నిజానికి అతను చాలా సజావైన మనిషి. అయితే ఏం ? అతని కున్న ఉద్రేకం ఆ గుమాస్తా ఉద్యోగానికి పనికిరాదు. వెనక నాలుగు అయిదు పర్యాయాలు పెద్ద గుమాస్తా తప్పు రిమార్కులు వ్రాస్తే అందరిమాదిరీ ఊరుకోక వాటిని సరిదిద్ది కలెక్టరుముందు సమర్థించుకోవడమే ఆయన కితనిమీద ఇంతకోపం ఉండడానికి కారణం. ఆ కలెక్టరు ట్రాన్స్ఫర్ అయిపోవడంతో ఈయనకు పట్టపగ్గాలు లేకపోయాయి.

కాగితాలు కనపడ్డా పెద్దగుమాస్తా ఝాడింపుమాత్రం వదలలేదు. ఈ నోట్‌లో ఈ పాయింటు ఎందుకు వదిలిపెట్టావనీ, ఇక్కడ ఇదికూడా ఎందుకు వ్రాశావనీ సాధిస్తూనే ఉన్నాడు. ఆయన ఎన్ని వాగినా ఆనాడు కృష్ణమూర్తి మాత్రం సమాధానం చెప్పలేదు. పైగా ఇంటిదగ్గర మరచిపోయిన కాగితాల ప్రస్తావన వస్తుందేమోనని బిక్కు బిక్కుమంటూనే ఎన్ని అక్షతలైనా అల్లా వేయించుకుంటూనే ఉన్నాడు.

మనిషన్న తర్వాత ఎంతవాడికైనా ఎప్పుడో ఒకప్పుడు, ఎందులోనో ఒకందులో పొరపాటుపడుతూ ఉండడం సహజమే! మంచి ఉద్యోగం గల మనిషి ఒక్కమాటు పొరబాటుపడ్డాడంటే మనస్సు కావేగం శాంతించేవరకూ అల్లా పొరపాట్లు వస్తూనే ఉంటాయి.

ఆనాడు కృష్ణమూర్తికికూడా అంతే అయింది. చేతా వాతా గాని వంటపని పూర్తిచేసుకుని అదరబాదరగా ఆఫీసులో పడితే తాళంచెవులు ఇంటిదగ్గరే మరచిపోవడం తటస్థించింది. ఆ కంగారులో వెతికితే అవసరమైన కాగితాలే కనిపించలేదు. చివరికి కనిపించినా వెనకటి కసి తీర్చుకోవడానికి ప్రయత్నిస్తున్న పెద్దగుమాస్తా చివాట్లవల్ల ఉన్న కాస్త మతీ పోయినట్లయి ఆనాడు అతను చేసిన ప్రతిపనీ తప్పే అయింది. ఒకదానిమీద వ్రాయవలసింది మరొకదానిమీద వ్రాయడం, అయిన దానికి కాదనీ, కానిదానికి అవుననీ వ్రాయడం, ఇల్లాగే ప్రతిదీ పొరబాటుగానే జరిగింది. ఒకసారి దారితప్పిన తర్వాత మళ్లీ క్రమగతిలో పడాలంటే వెనక్కి మళ్లాలిసిందే! చిత్తస్వాస్థ్యంకోసం సాయంత్రం మెల్లా అవుతుందిరా అని ఆనాడు కృష్ణమూర్తి పడ్డ బాధ ఇంతా అంతా కాదు.

అటువంటి పరిస్థితిలో పోస్టువేళ అయింది. ఆ వేళా, ఆఫీసుమూసే వేళా ఒకటే అయిందిగాని, కాకుంటే ఆ నాడతని శాఖకు వచ్చిన పెద్దకట్టను అప్పుడే విప్పవలసివస్తే నిజంగా అతనికి పిచ్చి ఎక్కిపోయేది. అందులో మర్నాడు ఆదివారంకూడా అవడంవల్ల దానితో అంత అవసరం లేక ఆ కట్టకట్టా అల్లాగే షెల్ఫులోకి తోసేశాడు.

ఇంతలో జవాను స్వంతఉత్తరాలు రెండు పట్టుకొచ్చి ఇచ్చాడు. అందులో ఒకటి కార్డూ, రెండోది కవరూ!

కార్డువంక చూస్తూ ఉండగానే అతని పైప్రాణం పైనే ఎగిరిపోయింది. మూడురోజులక్రితంవరకూ నిక్షేపంలా తిని తిరుగుతున్న తన మేనమామ అకస్మాత్తుగా గురువారంరాత్రి గుండె ఆగిపోయి చనిపోయాడట! అసలే అంతంతగా ఉన్న అతని మనస్థితికి ఈ దారుణవార్త మరింత వైకల్యం కలిగించిందంటే ఆశ్చర్యం ఏముంది?

అంత ఛిన్నాభిన్నమైన మనస్సుతో కృష్ణమూర్తి కవరు విప్పాడు. మొదటివాక్యం సగం చదువుకుని తన కళ్లను తానే నమ్మలేకపోయాడు. 'నాకు హోటలుతిండి పడదు. వండుకోలేక చస్తున్నాను. మరదలిని వెంటఇచ్చి చిరంజీవి సౌభాగ్యవతిని పంపవలసిం'దని కోరుతూ తానెంత ప్రాధేయపడ్డా మూడురోజులక్రితమేగా 'అమ్మాయి ఇంకా బలహీనంగా ఉన్నది. మూడోనెల వచ్చాక పంపుతా'మంటూ మామగారు వ్రాసింది? ఇప్పుడిదేమిటి! 'శుక్రవారం మెయిలులో బయలుదేరి...శనివారం సాయంత్రం......రాజమండ్రి వస్తున్నాము!' అరే ఇవ్వాళ శనివారమేనే! అదిగో మెయిలు టైముకూడా అయిపోయింది.

ఇక కృష్ణమూర్తి ఒక్కనిమిషంకూడా ఆఫీసులో కూర్చోలేకపోయాడు. అదృష్టవశాత్తూ పెద్దగుమాస్తా ఆనాడు అందరికంటే ముందే వెళ్లిపోయాడు. చకచకా బల్లమీద కాగితాలన్నీ చిందరవందరగా షెల్ఫుల్లో కుక్కేసి సరాసరి స్టేషనుకు బయలుదేరాడు.

ఈ దరిద్రపుగొట్టు ఉద్యోగంవల్ల భూమిమీద పడి నెలరోజులైనా ఇంతవరకూ తన ప్రథమసంతానాన్ని చూచుకునే అదృష్టం అతనికి కలగలేదు. కాజువల్ లీవులు అంతకుముందే అయిపోయాయి. అధికారులతో తనకున్న వైరుధ్యంవల్ల ప్రివిలేజిలీవులు మంజూరుకాలేదు. కాకపోయినా సరే సెలవుపెట్టాలంటే, వచ్చే నలభైరోజుల్లోనూ రోజు ఒకటి వస్తుంది.

అది భరించే తాహతు లేక నోరుమూసుకు పడి ఉన్నాడు. అంతకంటే ఏం చెయ్యగలడు పాపం ?

తల్లీ, బిడ్డా వస్తున్నారంటే అతని ఆతురతకు అంతులేకపోయింది. నెలలో చివరిరోజులు. చేతిలో ఒక్క రూపాయికూడా లేదు. ఎందుకైనా మంచిదని నారాయణరావు నడిగితే అతను కొద్దో గొప్పో వెనకఉన్నవాడు కాబట్టి అడిగినంతలో ఒక ఇరవై రూపాయలు ఇవ్వగలిగాడు. పొద్దుటినుంచీ సాయంకాలంవరకూ గడచిన అంధకారమయమైన అతని మానసికజీవితంలో ఈ ఉత్తరం రావడమూ, సమయానికి డబ్బుచిక్కడమూ వెన్నెలలా పనిచేసి కొంత ఉల్లాసం కలిగించాయి.

మెయిలు గోదావరి స్టేషనులో ఆట్టేసే పాగదు. రాజమండ్రి స్టేషనులో అయితే పెట్టె బేడా దింపుకోవడానికి వీలుంటుంది. అంతదూరం నడిచిపోతే ఆలస్యం అవుతుందేమో! అందులో సరిగ్గా వారంరోజుల క్రితమే ఇంటివారి పోరు పడలేక ఇల్లు మారవలసి వచ్చింది. పదిరోజుల కింద తాను వ్రాసిన ఉత్తరానికి మామగారి జవాబు వచ్చాక తాను తిరిగి సమాధానం వ్రాయడం పడనేలేదు. సమయానికి రాజమండ్రి స్టేషనులో ఉండకపోతే మామూలు ప్రకారం గోదావరికి వెళ్లిపోవచ్చు. పోనీ, అక్కడికి వెళ్లితేనో! అదీ ఇంచుమించు ఇంతదూరమూ ఉన్నది. ఏమో ఏమవుతుందో! తాను వెళ్ళేసరికి రైలు వెళ్లిపోయి మామూలు ఇల్లే అనుకొని ఈ చీకట్లో ఇంత నడిశీతాకాలంలో తల్లీ, బిడ్డా ఎంత ఇబ్బంది పడతారో గదా!

ఛా! ఎంతసేపటికీ ఆలోచన తెమలదేం? కృష్ణమూర్తి జట్కాలో ఎక్కడన్న మాటేగాని మనస్సు మాత్రం రాజమండ్రి గోదావరి స్టేషన్లలో పర్యాయక్రమేణా భార్యాపుత్రుల నన్వేషిస్తోంది.

బండివచ్చి స్టేషనుముందు ఆగింది. తొంగిచూస్తే ప్లాటుఫారం మీద రైలు కనపడలేదు. జనం ఉన్నారుగాని మెయిలు నిరీక్షణకైన తహతహ కనిపించడంలేదు. వెళ్ళిపోయిందేమో అన్న ఆతురతతో బండివాడికైనా డబ్బులివ్వకుండా గుప్పున గంతువేసి కృష్ణమూర్తి ప్లాటుఫారం మీద పడ్డాడు.

అమ్మయ్యా! మెయిలు రెండు గంటల ఆలస్యమట! పోర్టరు ధర్మమా అని చల్లని వార్త చెప్పాడు. అప్పటికి కృష్ణమూర్తి తహతహ కాస్త అణిగింది. వెంబడి వచ్చిన బండివాణ్ణి పంపించి, పెళ్లాంబిడ్డల రాకకోసం నిమిషాలు లెక్కపెడుతూ చికాకుతో పచార్లు చెయ్యడం మొదలుపెట్టాడు.

కడచింది అరగంటే అయినా ఒక మహాయుగం ఎదురుచూచిన ట్లనిపించింది. ఉండబట్టలేక పదేపదే స్టేషనుమాస్టరు గది దగ్గరికి వెళ్ళి వారినీ వీరినీ ఎంతలేటని అడుగుతూనే ఉన్నాడు. ఈ స్టేషనువాళ్ళ కిదో రోగం. ఒక్కరూ సరిగా చెప్పరు. బోర్డుమీద గంటా ఇరవై నిమిషాలు వేసిఉన్నది. అసిస్టెంటు రెండుగంటలన్నాడు. టిక్కెట్లు ఇచ్చే ఆయన మూడు అన్నాడు. చెకింగ్ ఇన్స్పెక్టరు నాలుగుసార్లడిగినా తన్నుకాదన్నట్లు తల వంచుకుపోయాడు.

గంట అయింది, గంటన్నర అయింది. ఇంకా మెయిలురాలేదు. కృష్ణమూర్తి చిరాకుమాత్రం నిమిష నిమిషానికీ అధికమవుతోంది.

'సామర్లకోట దాటిందట' అని జనంలో పుకారు! ఈమాట విని అప్పుడే రైలువచ్చేసిందన్నంత ఆతురతతో ఏమాత్రమూ ఆలస్యంకాకుండా పెళ్లాంబిడ్డలను కనుక్కోవడానికి వీలుగా రైలురాబోయేవంకే చూస్తూ నిలబడ్డాడు కృష్ణమూర్తి.

'ఆ! ఆ! ఎంతపని జరిగింది!'

'ఘోరం! ఘోరం! రెండు పెట్టెలు తుక్కు తుక్కు అయిపోయాయట'

'నూటఏభైమంది ముక్కూ మొహమూ తెలియకుండా చనిపోయారటయ్యా!'

'అనపర్తిమలుపులో గూడ్సుబండితో మెయిలు ఢీకొన్నదట!'

కృష్ణమూర్తిగుండె ఆగిపోయినంతయింది. ఒకటి రెండు నిమిషాలు అతనిలో చైతన్యమే నశించినట్లయింది. మొహాన కత్తితో వేసినా నెత్తురుచుక్క కనిపించనంతగా నిశ్చేష్టుడైపోయాడు.

జనమంతా ఎక్కడివాళ్ళక్కడ చెల్లాచెదరైపోతున్నారు. కొందరు గుండెలు దడదడలాడుతూ స్టేషను మాస్టరుగది చుట్టవేసి అత్యాతురతతో సమాచారం కోసం నిరీక్షిస్తున్నారు. ఎవరిముఖం చూచినా భయభ్రాంతులు తప్ప మరొకటి గోచరించడంలేదు. స్టేషనులో ఉండవలసిన తమవాళ్లే ఏమయిపోయారో అని హడావిడిపడి కొందరు అటూఇటూ తిరుగుతున్నారు.

వారి తోపుడువల్లా వీరి తోపుడువల్లా కొంచెం సేపు కొయ్యమొద్దులాగానే అటూ ఇటూ ఊగాడిన కృష్ణమూర్తి మరునిమిషంలో కాళ్లకింద నిప్పులు పోసినట్లయి ఉన్నచోట ఉండకుండా సంచలించి పోయాడు.

తరిమితరిమి ఆ ఊహే అతని మనస్సులోకి వస్తోంది. ఎంత ధైర్యం తెచ్చుకుందామనుకున్నా లాభం లేకపోతోంది. ప్రథమసంతానం కాసైనా చూచుకునే యోగ్యత తనకు లేదేమో! పెట్టిపుట్టని అదృష్టం రమ్మంటేమాత్రం ఎట్లా వస్తుంది? ఏమో! భగవంతుడు తనమీద ఇంత నిర్దయ చూపడేమో! ఎల్లాగైనా అనపర్తి వెళ్లిపడితే తన అదృష్టం బాగుంటే తనవాళ్లు సురక్షితంగా ఉండకూడదూ! కర్మంచాలక గాయాలు తగిలినా......అబ్బ! మళ్లీ అదే ఊహ!

ఎల్లా వెళ్లాడో వెళ్లాడు. కృష్ణమూర్తి కారులో కూర్చున్నాడు. కూర్చున్నాడా? ఆ స్థితిలో మనిషేమిటి? కూర్చోవడమేమిటి? అతని గుండెల్లో రైళ్లు పరుగెత్తుతున్నాయి. సర్వదిశలా భూమ్యాకాశాలు గిర్రున తిరిగిపోతున్నాయి. అరగంటక్రింద బయలుదేరవలసిన కారుకాబట్టి సరిపోయిందిగాని మామూలు ప్రకారం అతను వచ్చాకే ఆ ఆలస్యమయిఉంటే అసాధ్యమైనా రెక్కలుకట్టుకుని ఎగరాలని ప్రయత్నించేవాడేమో కాని అందులోమాత్రం ఒక్క నిమిషం ఉండగలిగేవాడు కాదు.

నాలుగుమైళ్ళల్లో అనపర్తి వస్తోందనగా ఏవార్త వినవలసి వస్తుందో అని అతనిగుండె మరింత తీవ్రంగా దడదడ లాడింది.

అనపర్తి రానేవచ్చింది. కారు రైలుకట్ట దాటుతోంది. అదిగో! అదిగో! అక్కడే కాబోలు ప్రమాదం జరిగింది. బస్సు ఆపివేసి ప్రయాణీకులూ, బస్సువాళ్ళూ కూడా ఆ ప్రదేశం చేరుకున్నారు.

అబ్బ! ఎంత దారుణం! ఇటువంటి రైలుప్రమాదం ప్రపంచంలో మరెక్కడా జరిగిఉండదు. పది గంటల వేళ ఆ చీకట్లో ఆప్రదేశమంతా రక్తమయమై లసలసలాడి పోతోంది. తలలు చితికి, కాళ్ళు ముక్కలయి, పొట్టలు పగిలి, నానావిధ వికృతాకారాలతో మరణించిన అభాగ్యుల శవాలు అడిగేవారు లేక కొన్ని, ఆనవాలు తెలియక మరికొన్ని పోలీసుల రక్షణలో పడి ఉన్నాయి. గుర్తుపట్టిన శవాలమీద పడి అయినవారు చేస్తున్న ఆక్రందనలు మిన్నుముట్టి పోతున్నాయి. క్రేనులు పనిచేసి కూలిపోయిన పెట్టెలను లేవనెత్తుతుంటే కేవలం రక్తమాంస పిండాలు కొన్ని బయట పడుతున్నాయి. తల్లులను కోల్పోయిన అనాథ శిశువులూ, కన్న సంతానం అదృశ్యం కాగా ఆవురావురని ఏడ్చే తల్లిదండ్రులూ, తమ బిడ్డలకు ఏ అపాయం వస్తుందో అని రెండుచేతులతో గుండె కానించుకునే మరణించిన దురదృష్టమాతృమూర్తులూ, కంటక శిలావృతమై అంధకారమయమైన ఆ ప్రదేశాన్ని ద్రవీభూతం చేస్తున్నాయి.

ఆ మహాసంక్షోభంలో కృష్ణమూర్తి అన్వేషణ ప్రయత్నం ఏం ఫలిస్తుంది? పట్టరాని దుఃఖావేగంతో కనబడ్డ ప్రతివ్యక్తినీ తనవారినిగూర్చి అడిగాడు. కాని అతనికి సమాధానం చెప్పేదెవరు? కళ్లు చిల్లులుపడేటట్లు ఎంతగాలించినా బ్రతికిఉన్నవారిలో ఎక్కడా అతని భార్య కనిపించలేదు. దుఃఖోద్వేగంతో గొంతెత్తి ఎంతఅరచినా, అడుగుల సవ్వడికే ఆతురతతో బదులు పలికే ప్రేయసి మధురవాక్కులుగాని, ఆర్తనాదం కాని అతనికి శ్రవోగోచరంకాలేదు. హతాశుడై, జరిగిన దారుణ సంఘటనకు పరితపిస్తూ, హతులయినవారి ఆప్తులమని ఎవరెన్నిసార్లు వెళ్లిఅడిగినా విసుగుకోని క్వాచిత్కంగా ఉన్న అధికారుల ఔదార్యంవల్ల, మృతస్త్రీకళేబరాలవద్దకు పోయి ఎంత పరీక్షించినా అతని భార్యజాడ కానరాలేదు. పోలీసుల అధీనంలో ఉన్న మాతాపితృరహితశిశుసమూహంలో తన బిడ్డ ఉండేమో గుర్తుపట్టడానికైనా అతనికి యోగ్యత లేకపోయింది.

తెల్లవారింది. కొంచెంకోసం కల్లబొల్లి ఏడుపులు ఏడ్చిన దొంగచుట్టాలు అదృశ్యమయిపోగా నిజమైన బంధువులు తమవారి శవాలకు అంత్యక్రియలు చెయ్యడంలో నిమగ్నులై పోయారు. మానవత్వం నశించని చూపరులకుమాత్రం చీకటిపొర తొలగడంవల్ల ఆ సంఘటన దారుణత్వం మరింత గాఢంగా హృదయాలను కలచివేసింది.

పగలు పన్నెండయినా కృష్ణమూర్తి అన్వేషణ ఫలించలేదు. అతని మనస్సులో ఏ ఆలోచనకూ తావే లేకుండాపోయింది. ఆస్థితిలో అతన్ని ఓదార్చేందుకైనా అయినవాడు ఒక్కడూ లేకపోవడంవల్ల అతని దుఃఖం అవధులుదాటిపోయింది. అందువల్లనే కొంత సేపటికి దానంతటదే అణగిపోయిందికూడా!

కృష్ణమూర్తి భార్యాపుత్రులను కోల్పోయినంత మాత్రాన ప్రపంచగమనం ఎందుకాగుతుంది? ఎవరున్నా, లేకపోయినా జగన్నాథరథం సాగుతూనేఉండేటట్లు అన్నీ యథాప్రకారం జరిగిపోతూనే ఉన్నాయి.

విశాఖపట్నం పోయే రైలురావడముతో స్తబ్ధమయిన కృష్ణమూర్తిమనస్సుకు చైతన్యం కలిగింది. 'ఏం చెయ్యాలి?' అన్న ప్రశ్న అతని కప్పటికి తట్టింది. విశాఖపట్టణం! అత్తమామలు! అణగిపోయిన అతని దుఃఖం మళ్లీ అతిశయించింది.

కదలబోతుండగా ఎల్లాగైతేనేం కృష్ణమూర్తి రైల్లో పడ్డాడు.

విశాఖపట్టణం స్టేషనులో దిగీదిగడంతోటే రామారావుగారు కనిపించారు.

'ఏమోయి కృష్ణమూర్తీ! అంతా కులాసా?'

ఈప్రశ్నకు అత నేం సమాధానం చెప్పగలడు? జరిగిన సంగతంతా తెలుసుకొని ఆయనకూడా విచారించాడు. ఎవ రెంత విచారిస్తేమాత్రం అతని బాధకు ఉపశమనం ఎట్లా కలుగుతుంది?

మాటిమాటికీ తన పుండు తానే కెలుక్కోలేక కృష్ణమూర్తి తలవంచుకొని దారినిబడ్డాడు.

తీరా మామగారి ఇంటిదగ్గరకు పోగానే ఆ ఇల్లు తాళంవేసిఉన్నది. ఇరుగుపొరుగువాళ్లను వాకబుచేస్తే, ఇద్దరుపిల్లల్నీ వెంటబెట్టుకొని అమ్మాయివెంట ఆవిడ కూడా వెళ్లిందని తెలిసింది. రామరామ! ఆ వల్లకాటిలో వీళ్లనుకూడా తాను గుర్తుపట్టలేక పోయాడేమో! ఇదంతా ఏజన్మలోనో తాను చేసుకున్న మహాపాపానికి ఫలితం. హతవిధీ! హతవిధీ!

అయితే మామగా రేమైనట్లు? ఆ చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళని ఎంతమంది నడిగినా ఆయనసంగతి తేలలేదు. చివరకు ఆయన ఆఫీసులోనే పనిచేస్తున్న వరహాలరావు నడిగితే పదిరోజులు సెలవుపెట్టి ఏ ఊరో వెళ్లారనిమాత్రం తెలిసింది.

ఆయన వచ్చేదాకా అక్కడ పడిఉండి తా నేం చెయ్యాలి? ఉన్నచోటికి వెళ్లివద్దామా అంటే, ఊరుకూడా తెలియలేదాయె! సర్వనాశనమయి ఈదుఃఖంతా ననుభవించడానికి తోడు ఇతరులకుకూడా ఈవార్త తెలుపవలసిన బాధ్యత తనమీదే పడిందే! ఒకవేళ ఆయనకుకూడా ఎల్లాగో ఈ రైలుప్రమాదంసంగతి తెలిసి ఏ బస్సుమీదనైనా అనపర్తి వెళ్లారేమో! ఆయన రాకముందే తాను ఇటు వచ్చిఉండవచ్చు.

కృష్ణమూర్తి మళ్ళీ అనపర్తి వచ్చాడు. అతనికి వట్టి వెఱ్ఱిగాని ఆయన వచ్చిఉంటేమాత్రం అక్కడే కూర్చునుండబోయాడా? అనపర్తి వెళ్ళడంవల్ల ఆయనైతే కనిపించలేదుగాని, ప్రమాదం జరిగినచోటు, గుర్తుపట్టడానికి వీల్లేనంతగా ఇతరప్రదేశంతో కలిసిపోయినా, తద్దర్శనమాత్రం అతనికి వెనకటి భయంకరదృశ్యాలను స్మృతిపథంలో గోచరింపజేసింది. దాంతో తాను సరిగ్గా అన్వేషించలేదేమో అన్న అనుమానంకూడా తట్టింది. బ్రతికిఉండగా చూచుకోలేకపోగా కళేబరాలనైనా కళ్ళజూచే అదృష్టం తనకు లేకపోయింది. సర్వప్రాణికోటికీ మరణం తప్పనిసరిఅయినా అంత్యసంస్కార సమయంలోకూడా ఆపేక్షతో కన్నీరు విడిచేవారు లేని ఇటువంటిస్థితిలో మరణంమాత్రం తనకు కాదుగదా జన్మజన్మాలకూ మరెవ్వరికీ రాగూడదు!

ఇటువంటి ఊహాలు పొర్లుకొస్తున్న మనస్సుతో అనపర్తినుండి కృష్ణమూర్తి రాజమండ్రి వచ్చాడు.

తీసుకువెళ్ళిన పైకమంతా ఖర్చయిపోయి, ఓపిక లేక బండీ ఎక్కు రామన్నా చేతిలో దమ్మిడీలేక, వీర్జీవ ప్రతిమవలె సోమవారం ఉదయం పదకొండుగంటల వేళ చిరాకు సధికంచేసే ఆ చిటిమిటి ఎండలో మెయినురోడ్డువెంట కృష్ణమూర్తి నడుస్తున్నాడు. అమ్మయ్యా ! ఇంకొక్క మలుపు తిరిగితే ఇల్లు వస్తుంది. కానీపు నడుం వాలిస్తేతప్ప అత నింక బ్రతకలేడు. ఇంతవరకూ అత నెట్లా బ్రతికి ఉండగలి గాడో అతనికే ఆశ్చర్యంగా ఉంది. ఇంతటి విషాద సన్నివేశంలోనూ దురదృష్టవశాత్తూ ఆత్మహత్యా భావమే అతనికి గోచరించలేదు. కాని కాకుంటే ఈ పాటికి ఏపరలోకంలోనో తన ప్రియమైన భార్యనూ, తన రక్తమాంసాలతో మూర్తీభవించిన ప్రియుతనూ జుఙ్ని మనసారా ముద్దాడి తత్పరిష్వంగ తన్మయ త్వంలో స్వర్గసుఖమే పొందగలిగేవాడు ! ఛీ ! ఛీ! తన నైచ్యం ఎంతవరకూ వచ్చింది ? ఇంత దారుణ వార్త విన్నప్పటికీ తన మనస్సు ఆమూలాగ్రంగా సంక్షోభించి దుఃఖించిందేకాని, ఇహలోకంలో తన్ను సుఖపెట్టడంకోసం సర్వస్వం త్యజించిన ప్రేయసిని కలుసుకోవడానికి తాను వెళ్లడం తన ధర్మమని అణు మాత్రమైనా తలపోయలేదేం ? ఇదేనా తన కృతజ్ఞత ? ఇప్పటికైనా మించిపోయింది లేదు. కృష్ణమూర్తి ఇక లేడని లోకం నిస్సందేహంగా నిశ్చయించుకో వచ్చు !

అదేనా అతని ఇల్లు ?

ఆ ఇల్లు అల్లా తాళం తెరిచిఉన్నదేం ? వెళ్లే టప్పుడు తాను మరిచిపోలేదుగదా ! ఎల్లాగూ చని పోదలుచుకున్న తనకు ఏంపోయినా ఇబ్బంది లేదుగాని ఆ నారాయణరావు పైకం ఇచ్చివెయ్యడానికి మాత్రం ఏదో ఒక వెండివస్తువైనా మిగిల్చిఉంటే బాగుండును ! అంతకంటే తాను వాంఛించేది మరొకటి లేదు. తనకు పెద్ద ఆస్తిపాస్తులు ఉన్నవీ లేవు, ఉన్నవి ఏమైనప్పటికీ వీసమెత్తైనా వెంగాలేదు !

ఎవరో తిరుగుతున్నట్లున్నారే ? అదేమిటది రాజ్యమేనా ? అదిగో అత్తగారే ! పాపం మనమ రాలితో కుమార్తె గతించగా తన్నుమాత్రం భగ వంతుడు మిగిల్చాడని విచారంతో బాధపడుతోంది కాబోలు !

ఆఁ ! ఆఁ !

అదేమిటది నిజమేనా ?

తా నున్నది పరలోకం కాదుగదా !

'లచ్చూ ! లచ్చూ !'

ఎంత బిగ్గరగా అరచినా అతని గొంతు అతనికే వినబడలేదు. లచ్చుమాత్రం నిజంగానే వచ్చి వాకిట్లో నుంచుంది. కృష్ణమూర్తి తన కళ్లను తాను నమ్మలేక పోతున్నాడు. అదిగో అత్తగారు ! అదిగో రాజ్యం ! అదిగో మోహనుడు ! అంతా తనకంకే ఆశ్చర్యంతో చూస్తున్నారు. బావ వచ్చాడు, బావ వచ్చాడు అంటూ వాళ్లిద్దరూ నిజంగానే కేక వేశారు. అందరూ సంతోషంగానే ఉన్నారే ?

కృష్ణమూర్తిఅర్థంగు మందరికి పడడం లేదు. అదిగో పిల్లవాడి కేక !

ఒక్క గంతులో కృష్ణమూర్తి ఇంట్లోకి చేరి పోయాడు. అబ్బాయిని మనసారా కళ్లారా తనివితీరా చూచి గాఢంగా గుండె కదుముకున్నాడు. ఇంత గాఢత తెలియని ఆ పసికందు కెవ్వుమని కేకపెట్టింది. లచ్చూ, ఆమెతల్లీ భయభ్రాంతులై ఇతని వాలక మేమిటో తెలి యక తికమక పడిపోతున్నారు. దగ్గరకు వచ్చి చెయ్యి జాపిన భార్యకు కుమారుణ్ని అందిస్తూ ఆమెవంక కృష్ణ మూర్తి అనిమేషంగా చూచాడు.

* * * *

'శుక్రవారం మెయిలులో బయలుదేరి సామర్ల కోటలోదిగి కాకినాడ వెళ్లి అక్కయ్యను చూచి మర్నాడు సాయంత్రం అంటే- శనివారం సాయంత్రం బస్సులో రాజమండ్రి వస్తున్నాము.'

ఆ ఉత్తరం సావధానంగా చదువుకుని కృష్ణ మూర్తి తన తొందరపాటును తానే నిందించుకున్నాడు.

# సాహిత్యంలో చంద్రుడు



= శ్రీ వావిలాల సోమయాజులు =

"వెండిగిన్నెల్లోన వెన్న పెట్టుకొని.
పసిడిగిన్నెల్లోన పాలు పోసుకొని.
తేరుమీదా రావె తేనెపట్టూ తేవె.
కొండమీదా రావె కోటిగిన్నె తేవె.
చందమామా రావె జాబిల్లి రావె—"

అని తన కోసమూ, తమ్ముడి కోసమూ, ఆకాశవీథిలో నిత్యయాత్ర చేసే చంద్రుణ్ణి తెలుగుఆడబిడ్డ అనాదినుంచీ ఆహ్వానిస్తూనేఉన్నది. అయితే చందమామ తెలుగుబిడ్డలకు ఏనాటి మామ? ఎలా మామ?—జగదేకమాత లక్ష్మీదేవితో పాటు క్షీరసముద్రగర్భాన జన్మించటంవల్ల నేనా అతడు మామ?

"స్త్రీలకు నేనంటే బహుప్రీతి. జానపద పదాలు పాడుకుంటూ నా వెన్నెట్లో వాళ్లు రాటం త్రిప్పి నూలు వడుకుతుంటారు." "నేను వెలుతురు నీ కివ్వకపోతే నీకు బ్రతుకే లేదు"అని సూర్యచంద్ర లిద్దరూ ఒకరి నొకరు ఎద్దేవా చేసుకుంటారు. సూర్యుడు చంద్రముఖాన ఇసుక చల్లుతాడు. ఆమె ముఖాన మచ్చలు ఏర్పడుతవి. కొంతకాలా నికి సంధి కుదిరి ఇద్దరూ పెళ్ళిచేసుకుంటే సంతానం కలిగింది. మళ్ళీ మనస్పర్థలు. చంద్ర సూర్యుడికి విడాకు లిచ్చి ఇంట్లోనుంచి లేచిపోయి బిడ్డలను ముక్కలుముక్కలుగా చేసి పైకి విసరుతుంది. ఆకాశంలోకి వెళ్ళిన వన్నీ నక్షత్రాలూ, నేలమీద పడ్డవి జలచ రాలూ, జంతువులూ అయినవి.—ఇవి ఫిలి ప్పైన్‌జాతివారి సూర్యచంద్ర కథనంలో ముఖ్యాంశాలు.

నీగ్రోజాతి పుక్కిటి పురాణాలల్లో సూర్యచంద్ర లిద్దరూ స్త్రీమూర్తులు. అన్యో న్యం వారి సంతానాన్ని చంపుకొని తినటా నికి సంధిచేసుకున్నారు. దానికి విరుద్ధంగా చంద్ర సంతానాన్ని సూర్యకంటికి కనబడ కుండా పగలు దాచిపెట్టి రాత్రిళ్లు బయటకు తీసుకోవస్తుంది. వాళ్ళే నక్షత్రాలు.

ఆదిమయుగంలో సూర్యుడు భూమి మీదనే నివాసంచేస్తుంటే 'టిట్రకే' అనే రేచుకుక్క వెంబడించి అతణ్ణి మింగివేస్తుంది. అతని ఎముక ఒకటి ఆకాశంలోకి ఎగిరి "కొడవలి" ఆకారంతో చంద్రుడై క్రమ క్రమంగా పూర్ణరూపాన్ని పొంది ప్రకా శిస్తుంది. నాయకుడి డాలుమీద చిత్రితమైన

* సాహితీ సమితి గుంటూరు గోష్ఠిలో చదివిన వ్యాసము.

చంద్రరూపం రాత్రిళ్లు ఆకాశంలోకి ఎగిరి వెన్నెల కాస్తుందని ఒప్పోజాగుంపువారి నమ్మకం.

'త్సుకిరొయోమి' చంద్రదేవత 'ఇజానగి' (షింటోవారి పరమాత్మ) దక్షిణ నేత్రం నుంచి ఉద్భవించా డని జపానువారి నమ్మకం. 'హెంగో' అనే చైనావారి చంద్రుడు పూర్ణంగా అమృతపానం చేయలేకపోవటంవల్ల స్వర్గానికి వెళ్లుతూ దారిలో ఆగిపోయిన 'త్రిశంకువు'. రాత్రిళ్లుమాత్రమే ప్రకాశించే అతణ్ణి పట్టుకొని అహర్నిశలూ అమృతప్రదానం చేసేటట్లు చేసుకోవా లనే సంకల్పంతో 'చిన్'జాతిపూర్వులు ఆకాశాన్ని అందుకునే మేడలు కట్టడానికి ప్రారంభించారు. వినికిడివల్ల చంద్రు డిది తెలుసుకొని ఒక పెద్ద వెన్నెలతుపాను రేపి ఆ సౌధాల నన్నిటినీ నేలమట్టం చేశాడు.

దొంగలకూ, గూఢచారులకూ అధిదేవత ముసల్మానుల 'షాహూర్' అనే చంద్రదేవత. త్రిమూర్తులలో ఒకడు. బాబిలోనియాజాతి త్రిమూర్తిగణంలో 'సిన్'అనే చంద్రదేవత ప్రథమ—షమాస్(సూర్యుడు) 'ఇష్తార్'లతో బాటు.

గ్రీకుల చంద్రదేవత 'సెలినీ' యౌవనప్రదాయిని; హృద్రోగాలకు కారకురాలు. సూర్యుడు (హెలియస్) ఉషస్సు (ఇవోయస్)లకు తోబుట్టువు.

ఈ నాగరక, అనాగరక పురాణాలూ, పుక్కిటిపురాణాలూ పురస్కరించుకొని ఆయాజాతుల్లో అనంతంగా సారవత్సాహిత్యమూ, జానపదసాహిత్యమూ పుట్టినది; నేటికీ పుడుతూ ఉన్నది.

"ఒక వేయి తలలతో నుండ జగన్నాథు
బొడ్డుదమ్మిని బ్రహ్మ పుట్టె మొదల.
నతని గుణముల నతని బోలిన దక్షు
డగు నత్రిపంజాతు డయ్యెః నత్రి
కడగంటి చూడ్కుల కలువల సంగడీ
డుదయించి విప్రుల కోషధులకు.
నమర ధరాతతి కధిపతి వన్నెన నాథు
డై యుండి రాజసూయంబు సేసి
మూడులోకముల—"

చంద్రుడు గెల్చినట్లుగా మన భాగవతపురాణం పలుకుతూఉన్నది.

భారతీయుల అనేక ఆచారవ్యవహారాలు చంద్రుడిమీద ఆధారపడ్డవి. చాంద్రమానమే కర్మకాండకు ఆధారము. కృచ్ఛ్రచాంద్రాయణమూ, సూర్యచంద్రుల నోములూ మన ఆచారాలు. రెండు సంక్రాంతుల నడుమ గౌణచంద్రుడూ, ముఖ్యచంద్రుడూ ఇద్దరూ కనిపిస్తే కొన్ని కర్మలు ఆగిపోతవి.

'కుముదాప్తబాంధవుని కొమ్ము తరిగితే కాటకం తప్పదని ముసలమ్మల నమ్మకం. జాతకచక్రాలల్లో "చంద్రలగ్నాత్" చూడవయ్యా ఎలా ఉందో నంటాడు శాస్త్రవేత్త తోడి జ్యోతిష్కుడితో. హృద్రోగాలు పెరిగి వైద్యులతరం కాకపోతే "కాస్త చంద్రుడికి జపంచేయించి, మానెడు సోలెడు యవలు దాన మిప్పించండి, నయంకాక దాని తాతకు అచ్చామా" అనే ధీమాతో సలహా చెబుతాడు సిద్ధాంతి.

"ఆదిత్యాత్ చంద్రమసం; చంద్రమసో వైద్యుతమ్" అని ఛాందోగ్యోపనిషత్తు పలుకుతున్నది. అయితే ఈ చంద్రలోకం వేరని చెబుతున్నారు వేత్తలు. అగ్నిహోత్రాదికాలైన వైదికకర్మలుగానీ, సప్త

సంతానాదికాలుగానీ చేసినవారు చంద్రలోకాన్ని పొందుతారట! ఉత్క్రాంతి చెందిన జీవుడు రాత్రిదగ్గరకూ, రాత్రి కృష్ణపక్షంవద్దకూ, అది దక్షిణాయనందగ్గరకూ తీసుకోపోతుంటవి. జీవుడు అక్కడనుంచీ భౌతికాకాశాన్నీ, దానినుంచి చంద్రలోకాన్నీ చేరి ఉదకశరీరాన్ని పొంది కర్మక్షయమయ్యేవరకూ సుఖంగాఉండి, తరువాత ఆకాశాన్నీ, వాయువునూ పొంది మబ్బై వానగా మళ్ళీ అవనిమీద అవతరిస్తాడు.

చంద్రచంద్రికలమీద మమకారం చేతనే శాస్త్రకర్తలు సహితమూ గ్రంథాలకు చంద్రిక, కౌముది ఇత్యాదిగా నామకరణం చేశారు. మేఘవిజయకవి హైమకౌముది, భట్టోజీదీక్షితుని సిద్ధాంతకౌముది, జయదేవుని చంద్రాలోకము—ఇత్యాదులు నిదర్శనాలు.

ప్రణయవిహ్వలులైన నాయికానాయకులచేత అనేకఅచేతనాలను దూతలుగా ఆహ్వానించేటట్లు చేసింది కవిలోకం. మేఘుని ఆహ్వానించి మేఘదూతమూ, శుకాలకూ హంసలకూ అనంతవాక్ప్రౌఢిమను ప్రసాదించి శుకదౌత్యాలూ, హంసదౌత్యాలూ నడిపించారు కవులు. కృష్ణచంద్రతర్కాలంకారుని సీత రామచంద్రునితో దౌత్యం నెరపటానికి చంద్రుణ్ణి ఆహ్వానించింది. ఆధునికులలో విశ్వనాథవారి 'శశిదూతము' 'సహస్రశీర్షా పురుషః'వలె వేయి పడగలు విప్పినది.

—అంటే మనకు చంద్రుడంటే ఎంతో అభిమాన మన్నమాట. అతనికి నామకరణం చేయటంలోనే 'చది' (ఆహ్లాదనే) ధాతువును గ్రహించారు శబ్దద్రష్టలైన మహర్షులు. ఓషధీశు డతడేనని అంతరంగికంగా ఆమోదించారు. 'అబ్జ' శబ్దంతో అతణ్ణి నీటబుట్టినవా డన్నారు. అతడు జైవాతృకుడు—పైరుపచ్చలను బ్రతికించేవాడు. అమృతతుల్యమైన సోమాన్ని ప్రసాదించడంవల్లనే సోముడైనాడు. స్థితినిబట్టి శశధరుడూ, మృగాంకుడూనూ. 'వాగ్వై బృహతీ తస్యా ఏష పతి స్తస్మా దు బృహస్పతిః'అయిన బృహస్పతికి శిష్యుడు. తారాజారుడు. ఐతేనేం? శంకరశీర్షానికి అవతంసమైనాడు.

వైదికసాహిత్యంలో చంద్రుడు 'సూర్యాచంద్రమసు' లనే దేవతాద్వంద్వంలో ఒకడు. సోమయాగవిశేషాలను చెపుతూ "వాగ్దేవతకోసం స్థూలశరీరుడైన పశువును ఉపయోగించి, ప్రాణపంచకాన్ని వరుణుడికీ, నేత్రద్వయాన్ని సూర్యుడికీ, మనస్సు చంద్రుడికీ, శ్రోత్రాలను దిక్కులకూ, జీవాత్మను ప్రజాపతికీ ఇవ్వవలసిందని తైత్తిరీయబ్రాహ్మణంలోని ఒక అనువాకం అనుశాసిస్తున్నది.

చంద్రుడు గంధర్వుడు. "సుషుమ్నః సూర్యరశ్మి శ్చంద్రమా గంధర్వః"అని శ్రుతి. 'గాం ధరితేతి గాంధర్వః'అని నైఘంటికులు. ఇక్కడసూర్యకిరణమే గోవు. సుషుమ్నమనే సూర్యకిరణాన్ని ధరిస్తున్నాడుకాబట్టి చంద్రుడు గంధర్వుడు. నక్షత్రా లనే అప్సరసలతో మిథునభావాన్ని పొంది చంద్రుడు క్రీడిస్తున్నాడని శతపథబ్రాహ్మణఋషికల్పన.

సూర్యచంద్రు లిద్దరూ అశ్వినీదేవతలు. 'అశ్వ'శబ్దానికి యాస్కాచార్య నిరు

క్తాన్ని అనుసరించి కాంతి, జలము, కిరణము అని ఏఅర్థం చెప్పుకున్నా సూర్యచంద్రు లిద్దరూ అశ్వనీదేవతలు.

"ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః" అన్నాడు మహాకవి కాళిదాసు. చంద్రుడు దోషాకరు డని అంగీకరించి వ్యవహరిస్తూఉన్నది కవి లోకం. అందువల్లనే అసభ్యపరసీమ నంటుతూఉన్న 'తారాశశాంకం'వంటి కావ్యాలు చంద్రుని దోషాన్ని ఆపాదించు కొని పుట్టినవి. అయితే లౌకికదృష్ట్యా ఏర్పడ్డ ఈ తారాజారత్వం చంద్రదేవతకు గొప్ప లోపం. చంద్రు డొక్కడే కాదు; శ్రుతిలో సూర్యుడుకూడా జారుడే. అతడు మాత్రేజారుడు. తల్లి అయిన అహస్సువల్ల పుట్టి ఆమెతో రమించి లయింపజేస్తాడు కాబట్టి సూర్యుడు జారుడు. ఇటువంటిదే ఇంద్రుని అహల్యాజారత్వంకూడాను. మహా శబ్దద్రష్టలైన వైదికసాహితీపరుల హృద యాన్ని గ్రహించలేక చంద్రుడికి దోషా పాదనం చేసి లౌకికకవులు కలుషకావ్య కల్పనం చేశారు. అందువల్లనేకాబోలు 'నా నృషిః కురుతే కావ్య'మనే ప్రవచనం పుట్టి ఉంటుంది.

పురాణసాహిత్యంలో చంద్రుడు అవి నీతికీ, అసభ్యతకూ నిలయమైనట్లు అనేక కల్పనలు కనిపిస్తున్నవి. నిజజారత్వం కార ణంగా లోకంలో శ్వాసకాస, క్షయ, రాజ యక్ష్మ—ఇత్యాది రోగాలను చంద్రుడే సృజించాడట. ఇతడు దక్షుని కుమార్తెలను ఇరవైఏడుగురినీ వివాహమాడాడు. కాని రోహిణీవల్లభుడూ, రోహిణీప్రియుడు. దక్షు డంటే సూర్యుడేనని నిరుక్తమెరిగినవారు చెపుతారు. అంటే చంద్రుడు సూర్యుని కుమార్తె లని చెప్పుకోదగ్గ నక్షత్రాలను వివాహమాడాడని చెప్పవచ్చు కల్పనా పూర్వకంగా. "సర్వదాహిదివారాత్రే సంధ్యా యాం వనితా రతః, సేవతే సురతం తస్మిన్ రా జ య క్ష్మ వసిష్యతి"—ఇత్యాదిగా చంద్రునిగురించి పురాణవర్ణనలు కనిపిస్తూ ఉన్నవి.

చంద్రునిలో నైల్యం అతనిమీద ప్రతిఫలించిన భూచ్ఛాయ అని కవికుల గురువు కాళిదాసుకు తెలుసును. "ఛాయాహి భూమేః శశినో మలత్వే నారోపితా శుద్ధి మతః ప్రజాభిః"—అని ఒకచోట అంటాడు. చంద్రుడు అమృతంపుబావి అనీ, ఆ అమృ తాన్ని ఆహారార్థం దేవతలు తోడుకుంటే బయటపడ్డ అడుగేననీ అంటాడు కవితా దృష్టితో బిల్హణభట్టు యామినీపూర్ణతిలక విలాసంలో.

పద్మినీకమలాప్తుల బాంధవాన్ని పోలి నదే కుముదినీచంద్రముల స్నేహము. ఇది కవితాసమయము. ఒక కవి వ్యంగ్యగర్భి తంగా నాయికానాయకుల సంభాషణను ఇలా నడిపాడు: "నాయకుడు: నిరర్థకం జన్మ గతంనలిన్యాః యయానదృష్టం తుహినాంశు బింబమ్—" "నాయిక: ఉత్పత్తి రిందోరపి నిష్ఫలైవ దృష్టా ప్రహృష్టా నలినీ న యేన" —చంద్రబింబాన్ని చూడని నళినీజన్మము నిరర్థక మంటే, నళినసరోవరాన్ని చూడని చంద్రుని జన్మకూడా నిరర్థకమని సమా ధానము. ఒక మహాకవి ఈస్నేహాన్ని ఆధారంచేసుకొని—

"కిం చంద్రమాః ప్రత్యుపకారలిప్సయా
కరోతి గోభిః కుముదావబోధనమ్.
స్వభావ ఏవోన్నతచేతసాం సతాం
పరోపకారవ్యసనంహి జీవితమ్."

"చంద్రుడు ఏ ప్రత్యుపకారాన్ని కోరి కలువలకు వికాస మిస్తున్నాడు? గొప్పవారు పరోపకారాన్ని చెయ్యటంలోనే జీవితాన్ని వినియోగిస్తారు" అని కవి ప్రకృతిసిద్ధమైన ఒక రహస్యంమూలంగా మానవజీవితం మీద నిశితవిమర్శ చేశాడు.

చంద్రుడికి కుముదినీప్రియత్వంతో బాటు పద్మవైరమూ కవిలోకసిద్ధము. మహాకవి భట్టుమూర్తి ఒక విరహిణినోట—

"ఈ వఙ్గుంఠవు పీటబుగ్గోతిసుమీ యేనంచు మోమోటపుం
గ్రోవ ల్పెప్పగ పిగ్గుగాదె!—మరి. పీ తోబుట్టుశ్రీదేవి లీ
లావాసంబుసిరుల్ హరింతు వనుచోనయ్యో కళానుందు చే
తోవీథిన్ సహజాధనావహరణోద్యోగంబు వెగ్గి-చునే"

అని అనిపించాడు.

విరహిణులకూ, విధుమండలానికీ చుక్కెదురు. తాపాపనోదన మౌతుందని తరిపి వెన్నెలలోకి వెళ్లితే అది సంతప్తాగ్ని కావటం ప్రబంధనాయికలకు పరిపాటి. చంద్రోపాలంభం చెయ్యని చేడియ అరుదు. ఒక అంగన "ఇంతులను ఏచే పాతకమే నీకు అజహత్కళంక మైన"దని ఆడిపోసుకుంటుంది చంద్రుణ్ణి. విప్రలంభనాయికల దృష్టిలో చంద్రుడు కటికకసాయి. "గోవధ చేసే తురకల దైవంబవు నీవు మొదల దక్కక పాంథస్త్రీవధము సేయ రోయుదె" అని ఒక అతివ అర్థాంతరీకరిస్తుంది. పాపము! చంద్రుడు వారి నోట వినరాని తిట్లు తింటాడు. అందరికంటే అతిగడసరి వరూథిని.

"త్రిపురసంహార మొనరించునపుడు హరుడు
జిందికల్లగ నీమేను గందిచేసె;
పదియు నెలవారి తెగటార వైతి చంద్ర
యకట! రోహిణిమెడ నపత్యమువఁజేసి!"

అని అతని చావును కోరుకున్నది. త్రిలోకకంటకుడవైన నీవు ఎప్పుడో ఒకప్పుడు నశింపక పోవని—

"ఒక పెను దాపరేదు చలమొప్ప రసాతలసీమకున్ చకో
రకములు భూతధాత్రికి సురల్ దివికిన్ వగ దీరునట్లుగా
మెకమెకపాటుతోడ నిను మ్రింగక పోరె పుడున్: త్రిలోకకం
టకుడవుగాన నీయొడలు నఙ్జుగ జేసె కురంగలాంఛనా!"

అని అతనిని బెదిరిస్తుంది.

ఒక ఆషాఢమాసవిరహిణి "కురంగం నీవద్ద ఉన్నా శక్రచాపానికి గురికాకపోవడమూ, మెరపువేడికి భయపడి పారిపోకపోవడమూ చాలా చిత్రంగాఉన్న"దని ఆశ్చర్యపడుతుంది.

నాగరకవృత్తాన్ని అనుసరించి 'యక్షరాత్రి'నాడు మదిరాపానం చేసి మదోన్మత్తమైన ఒక నాయిక సురాచషకంలో ప్రతిబింబించిన చంద్రునితో చేసిన ఉన్మత్త ప్రలాపాన్ని ఒక మహాకవి—

"ఓ చంద్రుడా! ఎందుకీ మధుపాత్రలో ప్రతిఫలిస్తావు? మీ రోహిణీదేవిని తలవెంట్రుకలు లేనిదానినిగా చేయిస్తాను సుమా!... ద్విజరాజువై కూడా నా మధుపాత్ర జోలికి వస్తున్నావా? ఈమద్యములో కలిపి నిన్నుగూడా మ్రింగుతాను. జాగ్రత్త! దగ్గరకు రాకు. మా రాజుకోపానికీ, రోహిణీదేవికోపానికీ గురి ఔతావు. మాగుంపులో దేనినో కామించి వస్తున్నట్లున్నావు. లేకపోతే నీకీ క్షయ ఎక్కడినుంచి వస్తుంది? నివు ఇతరస్త్రీలంపటుడవని నీ భార్యలకు! అనుమాన మున్నట్లున్నది. లేకపోతే మధుపాత్రలో ప్రతిబింబించిన నిన్ను ఈ తారలు

ఎందుకు అనుసరిస్తవి? నిన్ను ఎవ్వతో రమ్మని ఆశపెడుతున్నట్లున్నది. అందుకనే ప్రతి రాత్రీ పశ్చిమదిక్కుకు వెళ్లుతున్నావు....” అని అతిరసస్ఫూర్తితో భావించాడు.

చంద్రుణ్ణి మహాకవులు నానావిధాలుగా ఊహించారు. ఒకరు ‘అత్రిమునిలోచన భూషికా’ అంటే, మురారి మహాకవి ‘జ్యోత్స్నాకరంభ’ మన్నాడు. తెల్లవారు జామున చంద్రుణ్ణి పేలపిండి కలిపిన పెరుగు ముద్ద అన్నాడు భోజనప్రియుడైన ఒక కవిరాజు. ‘నభస్సీమంతినీ సిందూర రేఖ’ అనీ, ‘గగనసరోవరహంస’ మనీ, ‘ప్రాక్సతీలలాట తిలక’మనీ ‘గగనకాసారపోత’మనీ, ‘అప్సరస్త్రీకరసరోజచషక’మనీ అనేకంగా పోలికలు కనిపిస్తున్నవి. సరోజినీదేవి అతణ్ణి ‘A caste-mark on the azure brow of heaven’ అని అన్నది. ఒకానొక ఆధునిక కవి అష్టమి చంద్రుణ్ణి చూచి ‘అప్సరఃప్రణయినీకబరీ చ్యుత మాల’ అన్నాడు. ఉదయించే చంద్ర కాంతిని ‘అభినవఖరయోషిత్కషాయకంఠ కాంతి’ అని ఉపమిస్తే, తెలుగుకవి ధూర్జటి చంద్రోదయసమయాన ‘శీతగభస్తిబింబశివలింగంగా దర్శించి’ పూర్ణోపమగా ఇలా ప్రస్తరించాడు:

“ఉదయగ్రావము పానవట్టం. మఱి పేకోదగ్రవాహంబు వార్ధి. శరధ్వాంతము ధూపధూమము. జ్వలద్దీపప్రభారాశి కౌముది. తారానివహంబు లర్చిత సుమంబుల్ గా. తమస్స్వామ్యదూరదమై శీతగభస్తిబింబ శివలింగం బొప్పు ప్రాచీదిశన్”

సాహిత్యంలో చంద్రుని సమగ్రస్ఫూర్తిని బహిర్గతం చేసేటట్టు ‘అల్లసాని’ అల్లిక జిగిబిగులతో కూర్చిన వర్ణన:

“కలశపాథోరాశి గర్భవీచిమతల్లి
కడుపార నెవ్వాని కన్నతల్లి.
యనలాక్షు ఘనజటావనవాటి కెవ్వాడు
వన్నెవెట్టు ననార్తవంపు పువ్వు.
సకలదైవతబుభుక్షాపూర్తి కెవ్వాడు
పుట్టు గానని మేని మెట్టపంట,
కటికిచీకటితిండి కరముల గిలిగింత.
నెవ్వాడు తొగకన్నె నవ్వఁజేయు,
నతడు వొగడొందు మధుకైటభారి మరది.
కళల నెలవాడు. మించుచుక్కలకు రేడు;
మిసిమి పరసీమ వలరాజు మేనమామ
వేవెలుంగుల దొర జోడు. రేవెలుంగు”



# ప్రాచీన భూగోళము



= శ్రీ వేలూరి శివరామశాస్త్రి =

## 3

దక్షిణమహోదధిలోని మలయ బర్హిణాదిద్వీపములు పాతాళాంతర్గతము లని నవ్యుల యూహ. కాని అది సత్యము కాదు. ఆ ద్వీపము లనుద్వీపము లనియు, భరతవర్షమునకు దక్షిణముగా నున్న వనియు, పాతాళము భూగర్భమున నున్న దనియు వాయుపురాణము విస్పష్టముగా జెప్పెను (మా. ౪౮ అధ్యాయాంతము). సూర్యసిద్ధాంతముకూడ పురాణమునే అనుకరించెను. యోగవాసిష్ఠముగూడ అటులే చెప్పెను. పాతాళము భూగోళగర్భమునందున్న సంగతి అసంగతముగుచో అది అసంగతమే యని యందముగాక. పురాణమతమును అపలపింపకుందుముగాక. పురాణమీ ద్వీపములను పాతాళముగా చెప్పలేదు.

వాయుపురాణము కురు భద్రాశ్వములను వర్షములుగా విభజించుటయేకాక అచటి నదులను, గిరులను, మనుష్యులను, దేశకాలములను వివరించెను. కాని జంబూ కేతుమాలములను వివరించినటుల వివరింపలేదు. అనగా పురాణకర్త యీ రెండు ద్వీపములలోని కొన్ని కొన్ని విషయములను చూచినటులు కనబడును. కావున వాయుపురాణకర్తకుగాని, కర్తలకుగాని యీ రెండు ద్వీపములలోని కొన్ని భాగములతోనయినను సాక్షాత్పరిచయ ముండవలయును. వెనుకటి ప్రకరణమున ఆ సంగతి పాఠకులకు విస్పష్టముగా గోచరించియుండును.

### అత్యుక్తి

ఈ మూడు ద్వీపముల వర్ణనలలోను నమ్ముటకు వీలులేని అత్యుక్తులు కలవు. కవు లొక రాజనగరమును వర్ణించుచో తమ మనోరాజ్యమును కుదువపెట్టి ఇంద్రుని అమరావతిని తెచ్చి మన కనుల గట్టుదురు. ఆ రీతిగనే పురాణకవులును ఈ భూగోళ ఖగోళముల నీశ్వరరూపముగా తలచి పామరుల కా సంగతి తెలుపుట కెన్నియో ప్రక్రియ లవలంబించిరి. "అవి అత్యుక్తులు కావు, నిక్కమే" అని వాదించువారును, నిక్కముగా నమ్మువారును లేకపోలేదు.

### గోలకొండ వెలగకాయ

నా బాల్యమున నొక కథ వింటిని. కథకు డిటుల చెప్పెను :

మేము కొండదేశము చూడబోతిమి. పోయిపోయి గోలకొండ చేరితిమి. ఆ కొండమీద దయ్యములు గోల చేయుచుండునుగాన దానికి గోలకొండ యని పేరు.

ఆ నగరమున తిరిపెమునకు బయలుదేరగా 'చందులాల్ దివాన్జీవారు[1] పూర్ణమల్లు తోటలో రేపు సంతర్పణచేయుదు'రని వింటిమి. మే మందఱమును నలునకును, భీమునకును గురువులము కావున వంట

(1) చందులాలుమీద కొన్ని గేయములు తెలుగునాడున వాడుకలో నున్నవి—'చందులాలు మంచివాడు చచ్చిపోయెనూ, ఈత బరికెల చరకలుపోయె ఇచ్చేవాడు తరలిపోయె ఇత్యాది. ఈతడు మహాదాత యని ప్రసిద్ధి. మూగిన యాచకులను జవానులు క్రమముగా మంచుటకు కొరడా లుపయోగించుటయు, ఎన్ని దెబ్బలు కనబడిన అన్ని మాడలు చందులా లిచ్చుటయు ఇందు వర్ణితము.

చేసి కొంత సంపాదించుకొనవచ్చు నని చందులాల్ దేవిడీకి పోయి కొరడాదెబ్బలు తిని దానికి ప్రతిఫలముగా కొన్ని అశరఫీలను, వంటపనిని సంపాదించుకొని మఱునాటి ప్రొద్దుటికి సదరు పూర్ణమల్లు తోటలోనికి పోతిమి. ఆ తోట ఎటు చూచినను నూఱామడ.

పచ్చడి చేయవలసిన పని నాది. కావున గల వెలగచెట్టెక్కి మొదలుపెట్టి, తొమ్మిదిగంటలకు చెట్టునకొమ్మకి చేరి ఒక కాయ గొడ్డలి గూలగొట్టి రెండు జాములకు దిగి వచ్చి పచ్చడి చేసితిని. చందులాల్ స్వయముగా వచ్చి చూచుచుండగా, ఆ పచ్చడి ఏబది వేలమందికి వడ్డించితిని. రాచిప్పెడు పచ్చడి తిన్న వానికి చందులాలు కాసుకాసుచొప్పున నిచ్చెను. వడ్డింపగా మిగిలిన పచ్చడి నలుబదిగూనల కెత్తితిమి."

అప్పటి వెలగకాయయు, ఆ పచ్చడియు ఒకటేమి, అంతయు నిక్కమనియే అనుకొంటిమి. క్రమక్రమముగా కథకుని అత్యుక్తియంతయు అడుగునబడి చందులాలుమాత్ర మిప్పటికిని మిగిలెను.

## కురుద్వీపము

పురాణము కురుద్వీపము నిటులు వర్ణించెను - "ఇది ఉత్తరసముద్రము నంటియున్నది. ఇచట చంద్రకాంత, సూర్యకాంత పర్వతములు కలవు. వాని నడుమ భద్రసోమ యను నది ప్రవహించును. ఇంకను ఇచట తేనెవాగులు, నేతివాగులు, పెరుగువాగులు, కల్లువాగులు పాఱుచుండును. ఇది సిద్ధక్షేత్రము. ఇచటి స్త్రీలకు ప్రసవధర్మము లేదు. ఇచట వింతచెట్లు కలవు. అవి దంపతుల జంటలను కనును2. ఇచట క్షీరలను కొన్ని చెట్లు కలవు. వారు వాని పాలు త్రాగుదురు. కొన్నిచెట్లు రంగురంగుల బట్టల నిచ్చును. వారు వాని దాల్తురు. అట వ్యభిచారము లేదు. వ్యాధి లేదు. జర లేదు. దుర్బుద్ధి లేదు. వారు స్వర్గభ్రష్టులు. వారు కాలము తీఱగా బుడగలవలె మరణింతురు. వారి నీశ్వరానుగ్రహమువలన భూమి తినివేయును. వారు ౧౩,౫౦౦ ఏండ్లు బ్రతుకుదురు. బ్రహ్మమానసపుత్రుల కిది కాణాచి."

ఒక భరతవర్షమునందుగాక మిగిలిన వర్షములందింక వింతగా వర్ణన కనబడును. ఈ వింతలు నమ్ముటగాని, నమ్మకుండుటగాని, ఆ వింతలలోనుండి అసలు సంగతి చూచుటగాని పాఠకుల యిచ్ఛాధీనము.

## పొడవు - ఆయువు

మనుష్యుడు తన అంగుళి పెట్టి కొలచుకొనునెడల ఎనుబది నాలుగంగుళముల పొడవుండును. అనగా ఏడడుగులు. యుగాంతమునం దీపొడవు తగ్గును. మఱియు గడచిన యుగములందును, రాబోవు యుగములందును మనుష్యుడు తన అంగుళి కొలతచే ఎనిమిది తాళముల యెత్తుండును. (తాళమనగా పండ్రెండంగుళములు. అనగా ఎనిమి దడుగులు). తొమ్మిదడుగుల ఆజానుబాహుని దేవతగని పూజింతురు.

కలిలో మనుజుల పరమాయువు నూఱేండ్లు. కాని ఇది అస్థిరము. అని వాయు మత్స్యపురాణములు.

పురాణము జంబూద్వీపముకడకు వచ్చి అత్యుక్తి విడిచిపెట్టును. 'ఇది జంబూవృత్తాంతమే కాదు, మఱి ప్రపంచవృత్తాంత'మని ఎవరేని అనవచ్చును. 'కలి మొదలగు యుగములు ఒక భరతవర్షమందే కాని ఇతరత్ర లేవని పురాణమతము. కావున ఇది జంబూ లేక భరతవర్ష వృత్తాంతమే.

'కావున మిగిలిన ద్వీపములయెడ సత్యుక్తు లేల దొరలెను?' అను శంక ఉదయించుచున్నది. పురాణకర్తగాని, సంస్కర్తగాని తాను చూడక కర్ణాకర్ణికగా వచ్చుచున్న అత్యుక్తులను విని వాని నటులే గ్రంథస్థము చేసియుందురు. ఈ యూహ పొరపాటయినచో అభిజ్ఞులు సరిగా ఊహింతురుగాక.

---

(2) క. ఏ వేషము ధరియించిన నా వేషము తనకు నందమై యద్ధాత్రి
దేవుడు చెట్టున బుడికిన భావంబున నుండు రూపు పాయము కలిమిన్. (కా.)

## భరతవర్షము

భరతవర్షమునందు తిలింగ[3] అంధ్ర[4] అంధ్రక[5] అంధ్రవాక[6] అంధ్ర[7] దేశము లున్నవని వాయుపురాణమున గలదు.

ఇందు తిలింగము మధ్యదేశమున గోదావింధ్యలతో సంబంధపడ్డది. ఇది తెలింగానా కావనును. అంధ్రకము గంగాప్రాంతము. అంధ్రవాకములు తూర్పుదేశములు. మిగిలిన అంధ్ర మొకటి దక్షిణాపథమున గలదనియు, మరియొక ఘట్టములో అంధ్ర, లేక ఆంధ్రదేశము దాక్షిణాత్య మనియు, ఇంకొక ఘట్టమున అంధ్రదేశము పాపదేశ మనియు, బ్రాహ్మణుడెవడు నచటికి పోగూడ దనియు గలదు. దక్షిణమున నున్నదని చెప్పిన అంధ్ర, లేక ఆంధ్రదేశము ప్రకృతాంధ్రము కావనును.

## రెండు మేరువులు

మేరు విలావృతమునకు నడుమ గలదనియు, అది స్వర్గమనియు కొన్నిపట్లనుకి, సర్వోత్తరముగ నున్నదని కొన్ని పట్లను[9] మాపట్టును. ఇందు మొదటిది పర్వతము. రెండవది భూమి ఉత్తరబిందువు.

ఈ రెండవ మేరువు ఉత్తరధ్రువప్రాంత మని కాని, ధ్రువోపలక్షితమగు ఆకాశ మని కాని పురాణ మెచటను చెప్పలేదు. మేరువు భూమికి నాభి యనుటయు, సర్వోత్తరముగా నున్న దనుటయు నెటులు పొసగును? కావున నాభిస్థానీయమగు మేరువు పర్వత మనియు, సూర్యుడు ప్రదక్షిణించు మేరువు ఉత్తరబిందువు, లేక ధ్రువము లేక నారాయణోపనిషత్తు చెప్పిన ధ్రువక్షితి యని అనుకొని తీఱవలయును.

## కురువుల నమెరికా కిత్తురా?

ఈ సంగతి ఆలోచింపక కొందఱు తియాన్ షాన్ (Tien shan) శిఖరమును మేరువుగా తెల్పి అన్నిటికి నుత్తరమగు మేరు వేది కలదో అదియే యిది యని వ్రాసి కురువులు ఉత్తర అమెరికా, లేక మెక్సికో అని చెప్పిరి. కొందఱు టిబెట్టు కురుద్వీప మనిరి. మఱి కొంద ఱుత్తరధ్రువప్రాంతమే మేరుపర్వతముగాని ఉత్తరబిందువుగాని అని అనిరి. ఈ దిసవ భూగోళ చిత్రము జూచునది—




ఈ తియాన్ షాన్ శిఖరముగాని, మేరుపర్వత శిఖరముగాని సర్వోత్తర మగునెడల దానికి ఉత్తరముగా కురుద్వీప మున్నదని చెప్పుటయే అసంగతము. అప్పుడు కురుద్వీపము సర్వోత్తర మని చెప్పవలయును గాని మేరువు సర్వోత్తరమని చెప్పుట వృథా. సర్వోత్తరమగు మేరువునకు ఉత్తరమున నున్నది ఉత్తరదిగాకాశమును, ధ్రువమును. పటముమీద ఉత్తరబిందువునకు ఉత్తరముగా అమెరికా కనబడునుగాని ఆ ఉత్తరబిందువు అమెరికాకును ఉత్తరబిందువే - అనగా నాక్తపోతే.

---

(3) ౪౩-౧౧౧-వాయు.
(4) ౯౯-౩౩౫.
(5) ౩౮-౬౯-౬౦.
(6) ౯౮-౧౦౮.
(7) ౪౩-౧,—౧౬౦ వఱకు.
(8) ౩౪,౯౪-౯౫.
(9) సర్వేషా ముత్తరే మేరుః ౩౦-౧౦౮.

## రెండు కురువులు

లోకవేదములయందు కురువ్యవహారము కలదు. ఇవి రెండు. ఒకటి పాంచాలములందలిది. మఱియొకటి మేరుపర్వతమునకు ఉత్తరముగా ఉత్తరసముద్రము వఱకు వ్యాపించియున్నది.

పాంచాలములందలి కురుదేశములకంటె ఉత్తరకురుదేశములు భిన్నము లని ఐతరేయబ్రాహ్మణము. వాయుపురాణాదు లీ యుభయకురువులను అచట నచట కలిపివేయును. ఆ కలిపివేసిన భాగములు ప్రక్షిప్తములు కావలెను. ఏలన, వాయుపురాణకర్త యీ రెంటిని వేఱుగనే వ్యవహరించెను.

ఆసియాఖండము ఉత్తరకురువు లున్నట్లు గ్రీక్ చరిత్రకారులు క్రీ. పూ. ఐదవ శతాబ్దిలో వ్రాసిరి. ఉత్తరకురు వను పట్టన మొకటియు (Uttara Korrab), పర్వత మొకటియు, నది యొకటియు చీనాటర్కికి చెందిన సెరీక్ (Serique) దేశమునం దున్నదని మొట్టమొదట మనకు టాలెమీ తెలిపెను. ఇతడు క్రీ. శ. 3 వ శతాబ్దికి చెందినవాడు. కావున కురుదేశములు మేరుపర్వతమునకు ఉత్తరముగను, ఉ. సముద్రము నభివ్యాపించియున్న వనుట నిర్వివాదము.

అటు లగుచో పురాణకర్త మిథ్యావాదియా! కాదు. మనమే అతనిని సరిగా అర్థము చేసికొనవలసి యున్నాము. ఇది జటిలమగు విషయము. ఇందు మనముగూడ పొరపాటు చిత్రించుచున్నామేమో యను మాట విషయముక్రింద జమకాదు.

## పురాణము వేదవ్యాఖ్యానము

పురాణకర్త తాను కన్నవియు, విన్నవియు, వేదమున గలయవియు, తా నూహించినవియుగూడ జెప్పెను. ఇందులకు పురాణమే సాక్షి.

పురాణము మేరువిషయమున బ్రాహ్మణముల ననుసరించెను. ఇంకను పలువిషయములయెడల బ్రాహ్మణముల ననుసరించెను. అటుపిమ్మట తన గురు సంప్రదాయము ననుసరించి ఆ యా యీ విషయములను బహుముఖములుగా వివరించెను.

## బ్రాహ్మణములలో మేరువు

బ్రాహ్మణముల కాలమునకే మేరువు తెలిపి మఱుపులలో బడుట కారంభించెనని యీ దిగువ బ్రాహ్మణమువలన తెలియగలదు. 10 ఆరోగ భ్రాజ పటర

(10) ఆరోగో భ్రాజః పటరః పతఙ్గః। స్వర్ణరో జ్యోతిషీమాన్ విభాసః। తే అస్మై సర్వే దివ మాతపన్తి। ఊర్జం దుహానా అనపస్ఫురన్తః। సప్తకర్తశ్య ప్లాశిః। అమత్రవిక ఏవ నా కశ్యప ఇతి। ఉభౌ వేదయితే। న హి శేకుమివ మహామేరుం గన్తుమ్। అపశ్య మహ మేత త్సూర్యమండలం పరివర్తమానమ్। గార్గ్యః ప్రాణత్రాతః. గచ్ఛన్త మహామేరుమ్' ఏకం చాజహతమ్.
(తైత్తి. అర. ౧. ప్రపా. ౭ అను.)

లోతులకు దిగినచో ఈ బ్రాహ్మణమునందలి సూర్యులు సూర్యులు కారనియు, మేరువు మేరువు కాదనియు కశ్యపుడను సూర్యు డాత్మ యనియు, మేరువు శారీరకమేరు వనియు తోచును. ఏలనిన- ఈ బ్రాహ్మణముననే 'ఈ సప్తసూర్యులు సప్తప్రాణములు, లేక సప్తజ్ఞానేంద్రియములు, లేక సప్తావరణములు' అని కొందఱు వేదకర్త లభిప్రాయపడిరి. మఱి కొందఱు 'భౌతికసూర్యులే కాని మనకంటికి కనబడరు' అని అనిరి. 'ఏడుగురు సూర్యుల నెటనుండి తెత్త'మని ఒక డడుగగా 'ఏడుగురే యేమి? నీకు కనబడకపోయినంతమాత్రమున నయినదా? వేగురు సూర్యులు కలరు; మఱి మాటాడిన లక్ష కలరు' అని వైశంపాయను డనెను. ఇటులని అతడు తన వాదమున కుపష్టంభకముగా 'చిత్రం దేవానా ముదగా దనీకమ్' అను ఋక్కు నుదాహరించెను.

కాని ఈ యుదాహరణముకూడ ఆత్మపరమే. ప్రాణత్రాతుడు 'భ్రాజాదులగు మూగురు సూర్యులు మేరువు క్రింద నుందురు. వారు కిరణములను క్రిందికి బంపుదురు. స్వర్ణరాదులు పై నుందురు, వారు పైకి బంపుదురు. వారి నడిమిదారిని బడి మీరు చల్లగా మేరువు మెట్టగలరు' అని చెప్పెను. ఇది ఆత్మపరమని వేఱ చెప్ప బనిలేదు.

అటు లగుచో ఈ సూర్యులకును, కశ్యప సూర్యునకును వేదకర్తలే కొందఱు ప్రాణత్రాతేతరులు వైశంపాయనాదులు భౌతికత్వ మేల యాపాదించిరి?

ప్రకృతవిషయము అరుణకేతుకమగు అగ్ని. తదారాధనమున ఇష్టకానిరూపణ మున్నది. దానిని ప్రత్యక్షమటుల చూపవలయును. యజ్ఞమున బాలవట్టు ఆధ్యాత్మికవిషయమును ప్రాకృతప్రక్రియచే యజించుటయే చూపట్టును.

పతఙ్గ స్వర్ణర జ్యోతిషీమ ద్విభాసులని సూర్యు లేడు గురు. వీరందఱును లోకముల కూర్జ మొసగుచు ఆకసమున వెలుగుచున్నారు. 'కశ్యపు డెనిమిదవ సూర్యుడు' అతడు మహామేరువును విడువడు.

“ మేమీ యేడుగురు సూర్యులను జూచితిమి. కశ్యపునిమాత్రము వినుమంటే వింటిమి. మేము మేరువుకడకు పోజాలకపోతిమి ” అని పంచకర్ణుడును, సప్తకర్ణుడును ఆవేదించుచున్నారు.

“పరివర్తమానమగు నీ సూర్యమండలమును నే జూచితిని. ఈ సూర్యు డొకడే. అతడు మేరువు వదలడు. మీరును మహామేరువునకు జనుడు. మేరువును వదలని ఆ సూర్యుని గనుడు” అని ప్రాణత్రాతు డనెను.

ఈ మహామేరువు సూర్యుని జూపుటకు ఉపలక్షకము. కావుననే సాయణుడు మేరుమార్గరూపమగు ఆకాశము అని 11ఈ మహామేరుపదమున కర్థము వ్రాసెను. ఇక ఈ మేరువు ఖమేరువు. జ్యోతిస్సిద్ధాంతమునం దిది సంజ్ఞామాత్రము. X వంటిది. అదియే ఉత్తర బిందువు.

సూర్యుడు భూమికి నాభిస్థానీయుడును, ఇలావృతమధ్యస్థమును, అపర స్వర్గమును అగు మేరుపర్వతమును వలగొనుచున్నాడని పురాణములు చెప్ప లేదా ? చెప్పెను. ఏల చెప్పెను ? ఇదియు మేరువు. అదియు మేరువు. ఈ రెంటికిని పర్వతమనియు, స్వర్గమనియు వ్యవహార మున్నది. కావున నటులం చెప్పెను. సూర్యుడు మేరుపర్వతమును వలగొనును విషయమును భాస్కరు డెటులు ఖండించుచున్నాడో చూతము:

“మేరువే రేయికి కారణముగునేని, అది సూర్యునకును భూమికిని నడుమ నుండునేని అది మన కేల కనబడదు?12 మేరు వుత్తరమున నున్న దనియు, రవి ఎప్పుడును దాని వలగొనుననియు పురాణములు చెప్పునుగదా. ఇది నిక్కమగుచో రవి దక్షిణమున నేగుచున్నటులు మన కేల కనబడును ? కావున సూర్యుడు వలగొను మేరువు వేఱు, మేరు పర్వతము వేఱు.

భాస్కరుడు జ్యోతిర్మేరువు నిటు వేఱు చేసెనుగాని మేరుపర్వతముకడకు వచ్చి దానినే మరల సర్వోత్తరముగా భావించి దానికి పడమటనున్న ప్లక్షాదిద్వీపసప్తకమును జంబూదక్షిణార్ధమున కెక్కెను. ప్లక్షాదు లీ మతమున కల్పనామాత్రము. జలస్థల పర్యటనము చేయక కంటగనక పుస్తకకీటములై ఊహించిన దానిని ఒక శాస్త్రము చేయబోవుచో నిట్టి పొరపాటులు వచ్చునని నవ్యులు విమర్శించిరి. నిక్కమే. వారికి స్టీమరా, రైలా, తుదకు పడవా! ఒకవేళ ఏకట్టె రొడరో యున్నను సముద్రయానము నిషిద్ధము కదా ! మఱియు కొన్ని సీమలే నిషిద్ధములుగదా !

భాస్కరుడు భూవిన్యాసవిషయమున పురాణమునే అనుకరించి కొన్ని చోటుల స్వతంత్రించెను.

## భాస్కర భూగోళము

“లవణసముద్రమునకు ఉత్తరమున నున్న పాశాలు నేల జంబూద్వీప మని పలువురు ఆచార్యులు చెప్పిరి. మిగిలిన దక్షిణపు పాశాలున ఆఱు ద్వీపములును, ఏడు సముద్రములును గలవు...

పాతాలము భూమికి పుటస్వరూపముగానున్నది. అచట నాగులు, నసురులు నుందురు. సిద్ధు లచట దైత్య రమణులతో క్రీడించుచుందురు.

---

సరియ. అటులగుచో నచటి మహామేరువు శారీరకము కాదా ? కాకేమి ? ఈ మేరువు నగును. ఆమేరువు నగును. సూర్యుడుకూడ ఈ సూర్యుడు నగును, ఆ సూర్యుడును అగును. ఈ రెంటికిని కలిసివచ్చుటచే సూర్యుడు మేరువును వదలడు అని శ్రుతి చెప్పెను.—'గచ్ఛన్త మహామేరుమ్. ఏకం చాజహాతమ్'

(11) మేరుమార్గరూప మాకాశమ్. (తై. అర. ౧-౭)

(12) రవి చాల దవ్వగుటచేతను, శిఖము అడ్డగుటచేతను కనబడదని పురాణకర్త చెప్పెను;

'విదూరభావా దర్కస్య భూమే ర్లేఖావృతస్య చ
హ్రియన్తే రశ్మయో యస్మా త్తేన రాత్రౌ న దృశ్యతే' (వా. ౩౦.౧౦౮)

శాక శాల్మలక్రౌంచ గోమేదక పుష్కరద్వీపములు రెండురెండు సముద్రముల నడుమల నున్నవి.

జంబూద్వీపమున తొమ్మిది ఖండములు. లంకకు ఉత్తరమున (నిరక్షదేశ) హిమగిరి. దానికి ఉ. హేమకూటము. దానికి ఉ. నిషధము. ఈ పర్వతములు సముద్రమువఱకును వ్యాపించియున్నవి. ఇటులు సిద్ధపురమునకు ఉ. (ఉజ్జయినుండి నూఱుతొమ్బది అంశలలో నున్న తూరుపు మేర) శృంగవంతము. దానికి ఉ. శ్వేతము. దానికి ఉ. నీలము.

మన ముండునది భారతవర్షము. దీనికి ఉత్తరమున కింపురుష, లేక కింనరవర్షము. దానికి ఉ. హరివర్షము. ఇటులు సిద్ధపురినుండి చూచినచో మొదట కురువర్షము. దానికి ఉ. హిరణ్మయవర్షము దానికి ఉత్తరమున రమ్యకవర్షము.

యమకోటికి ఉత్తరమున (ఉజ్జయినుండి తొంబదంశల తూరుపుమేర) మాల్యవతము. రోమకమునకు ఉ. (ఉజ్జయినుండి తొంబదంశల పడమటిమేర) గంధమాదనము. ఈ రెండు కొండలు నీల నిషధములవఱకు వ్యాపించియున్నవి. ఈ నాలుగుకొండల నడుమ ఇలావృతవర్షము. మాల్యవంతమునుండి సముద్రమువఱకు భద్రాశ్వము. గంధమాదనమునుండి సముద్రమువఱకు కేతుమాలము. నిషధ-నీల-గంధమాదన-మాల్యవంతముల నడుమ ఇలావృతము. దాని నడుమ మేరువు. అదియె స్వర్గభూమి."

ఈ పై భాస్కరభూగోళము పురాణభూగోళముకంటె కొన్నికొన్నిచోటుల భిన్నము (మూడవ పటము చూ).

## సూర్యసిద్ధాంతము

"భూగోళమునడుమ గుహారూపముగా పాతాళము కలదు. ఓషధులు దానికి వెలుగిడును. అట నాగులును, అసురులును ఉందురు. భూగోళమధ్యమును భేదించుకొని పైకివచ్చి ఉభయపార్శ్వము లావరించి మేరువు దండాకారముగా నిలిచెను. దానికి తూర్పున భద్రాశ్వవర్షమున భూమిలో ఒక పాదము దవ్వున (౯౦ అంశలు) యమకోటి కలదు. దక్షిణమున భారతవర్షమున లంకాపురి కలదు. పడమట కేతుమాలవర్షమున రోమకపత్తనము కలదు. ఉత్తరమున కురువర్షమున సిద్ధపురి కలదు. ఈ పత్తనము లన్నియు భూపరిధికి ౯౦ అంశలు దూరదూరముగా నున్నవి. మేరువు గూడ వానికి అంత దూరములోనే యున్నది. ఈ దిగువ చిత్రమును చూడుడు:




## బ్రహ్మ - అండము

స్వాయంభువాదులు దేశముల నాక్రమించుకొనుటకు కత్తిపట్టి తిరిగిరేమో కాని ఋషులు మాత్రము తాము పోగలిగిన దేశమునకు పోయి, చూచినదానినెల్ల బ్రహ్మ-అండముగా తలచిరి. పరమేశ్వరుడు విశ్వమెల్ల నిండియున్నాడు. ఆ పరమేశ్వరునకు మహదహంకారపంచభూతము లను ఏడావరణములు కలవు. ఇది తెలియుటే భూగోళమెఱిగిన ఫలము. ఈ ఆత్మనెల్లయపుడును గుఱుతుంచుకొనుటకు భూగోళ ఖగోళముల నేడేసి విభాగము లొనరించితిమి అని వారు విస్పష్టముగా వ్రాసిరి. అది యటులుండె13.

(18) సప్తప్రకృతయ స్త్వేతా ధారయన్తి పరస్పరమ్. ౪౯-౧౮౩
అణ్డానా మీదృశానాం తు కోట్యో జ్ఞేయా స్సహస్రశః. ,, ౧౪౯
తిర్య గూర్ధ్వ మధస్తాచ్చ కారణ స్యావ్యయాత్మనః
కారణైః ప్రాకృతై స్తత్ర హ్యావృతం ప్రతివస్తుభిః .. ౧౩౦
దశాధిక్యేన చాన్యోన్యం ధారయన్తి పరస్పరమ్.
పరస్పరావృతా స్సర్వే ఉత్పన్నాశ్చ పరస్పరాత్. .. ౧౩౧

వారొకరీతిగా దేశద్రిమ్మరలు. వారు తాము చూచినదానిని బ్రహ్మబుద్ధితో కవితలో పాకము పట్టిరి. ఇటులు భావాద్వైతము క్రియాద్వైతమగుట వలన ప్రాకృత మంతయు అతిరంజితమాయెను, అగును. పిదప వారు తమ యెుఅంకను శిష్యులకును, మాతులకును చెప్పిరి. అది వారి అందఱ కంఠములచేతను, గంటములచేతను అత్యంతరంజిత మాయెను. ఈ అత్యంత రాగమును తొలగించినచో మూలమును మనము కనుగొనగలము.

## భా ర త ము

భారతమున పాండవులు స్వర్గకామనచే హస్తిననుండి ద్వారకకు పోయి అచటినుండి ఉత్తరముగా నడచి హిమాలయమున కేగి యటనుండి వాలుకాసముద్రమును దాటినటులు ఉన్నది. ఈ వాలుకాసముద్రము గోబీ, శక మహా ఎడారి. వారు సుమేరువు చూచిరి. అప్పటికింకను అది స్థానభ్రష్టము కాలేదు. మహాభారతకవికి సుమేరువు స్వర్గము.

## రా మా య ణ ము

హిమాలయములకు ఉత్తరమున విశాలమగు శూన్యము కలదు. దానికి ఉత్తరమున ఉత్తరకురుదేశములు కలవు. దానికి ఉత్తరమున ఉత్తరసముద్రము కలదు అని ఉన్నది. ఇచటి విశాలశూన్యము టిబెట్ పీఠభూమికాని, మంగోలియా పీఠభూమికాని, గోబీ ఎడారి కాని కావచ్చును.

## న వ ఖ ం డ ము లు

ఈ పృథివిలో తొమ్మిది ఖండము లున్నవి. భరతదేశమునందును తొమ్మిది ఖండము లుండవలయును. ఈ పేర్లన్నిటినిబట్టి చూడగా మొదట భూవిభాగమును, పిమ్మట భరతవర్షవిభాగమును అయినటులు తోచును. పైని ఉత్తరకురవు లున్నవి. భరతఖండమందును ఉండవలయును. ఈ దెసనే పలుదేశములయు, పర్వతములయు పేరులు ఔత్తరాహములు రతవర్షమున గలవు.

## నే రే డు బ ం డు

వాయ్వాదిపురాణములు ప్రచారములోనికి వచ్చినపుడును, భాస్కరాది జ్యోతిషికుల సమయమునను ఈ జంబూద్వీపమమాత్రమే, అనగా ఈ భరతవర్షమే నచనచగా వారికి తెలిసిన భూమి. ఇది పేరునకు దగినటులు ఈ జంబూద్వీపము భూమిలో నేరేడుబండంత. ఈ ఛేద్యకము చూడుడు:




ఆర్యజాతి నవవర్షవిభాగము కల యీ భరతఖండమునం దునికి గొనె ననుటలో మనము సందియంపడ నక్కఱలేదు. ఆర్యద్వీపమునం దిది చాల చిన్నదయినను అసామాన్యమయినది. ఎన్నియో వీర జాతు లీదేశమునుండి పడమటికిని, దక్షిణమునకును వలస పోయిరి. తొలుదొలుత ఆర్యజాతులలో నెవ రెవ రాసియాఖండమున నానావర్షములలో నెలకొనిరో ఎవరు చెప్పగలరు! ఉత్తరమున తెల్లవారును- మతాంతరమున ఎఱ్ఱవారును, దక్షిణమున పచ్చవారును, పడమట నల్లనివారును, తూర్పున తెల్లవారును- మతాంతరమున ఎఱ్ఱవారును నివసించుచుండిరి. మన మందఱమును ఆర్యనామముచే ఏకవర్ణులము.

ఏవర్ణము దారి దాపునో మిగిలిన వర్ణము లా దారిని నడచును. అయినా యీ కాలములలో తెలుపు ఎఱుపు పసపు రంగు కల జనులు ఈ భరతఖండమున ప్రవేశించిరి. ఎంతకాలమువెనుక ఈ ప్రవాహము ఇటులు ప్రవహించెనో దాని తెలియగడు సహాయము లేదు. వేనునిపిదప మొదటి క్షత్రియుడు పృథుచక్ర

వర్తి. అతఁడే ఢిల్లీనివాఁడు[14]. ఆ సమయమునందు పసపు రంగుకల వైశ్యజాతి తొలుత సేద్యము చేయ నారంభించెను[15]. అటుపిమ్మట కొంతకాలమునకు సెంట్రల్ ఏషియానుండి (అశ్వద్వీపమధ్యమునుండి) శకులు, హూనులు భారతమునకు వచ్చిపడిరి. మఱి కొంతకాలమున కక్కడినుండియే టర్కీజాతి పుష్కరకాల్మల ద్వీపములకు వచ్చెను. కేతుమాలాంతర్గతమగు జంగ దేశమునుండి వచ్చినవారు హైదర్ జంగ్ మొదలగువారి వంశధరులు. మఱి కొంతకాలముపిదప చీనా - టర్కీ జాతియు, మంగలజాతియు (మొగల్)వచ్చి ఢిల్లీ సింహాసన మాక్రమించెను. ఈ రెండు జాతులను ముసలి మానులు కాక బౌద్ధులయియుండురేని క్షత్రియులు అయి పోయెడివారు.

దీని నంతయు ఒకసారి సింహావలోకనము చేసి చూడగా పూర్వార్ధగోళమున ఉత్తరధ్రువము మొదలు కొని లంకవఱకు గల జనులు పరస్పర దేశములలో ఎట్లు కలిసిపోయిరో, భరతవర్షమున చాతుర్వర్ణ్య మెట్లు బిగిసికొనిపోయెనో తేటపడును.

(14) కేతుమాలమునకు వలసపోయి కురువులు కురదు లయినటులను. పాంచాలములకు వచ్చి కురుదేశ మేర్ప ఱచికొని క్షత్రియజాతియై భరతఖండమం దంతటను క్షత్రియులుగా వ్యవహృతు లయినటులను ఒక ఊహకు అస్పదమున్నది.

(15)వీరు కేతుమాలమున విదిక్కులు. వీరు ఋగ్వేదమునుండి జనించినటుల అశ్వమేధపన్నము. చూ. తై. బ్రా

---

## సవరణ

౧-వ వ్యాసమున-౧౨౦ పుట, ౧౨ పంక్తిలో "మేరువునకు ఉత్తరమున" అనుదానిని "మేరువునకు పడమట"అని చదివికొనవలయును.

౨-వ వ్యాసమున-౨౬౩ పుట, ౨౬ పంక్తి."చెప్పబోయి నెప్పమఱచినటుల కనిపించును" అనుదానికి బదులు "సప్తావరణములను చెప్పెను" అని చదివికొన వలయును.

# ఈనాటి ఆంధ్రదేశపు పంచాయతీలు

= శ్రీ అజ్జరపు వెంకటరమణరావు =

క్రీ. శ. ౧౯౩౦ సంవత్సరంలో దేశంలోనూ, రాష్ట్రంలోనూ యితర భాగాలతో పాటు ఆంధ్రదేశంలోనూ పంచాయితీలు తిరిగి స్థాపించారు. అంతకుముందే అమలులో వుండి క్రీ. శ. ౧౯౫౦ సంవత్సరపు స్థానిక స్వపరిపాలనచట్టంనాటి నుంచి పనిచేస్తున్న పంచాయితీలకు 'యూనియన్' అనే పేరు పోయి, నాటినుంచి పంచాయితీ నామకరణమే స్థిరపడింది.

నాటినుంచీ నేటివరకూ గ్రామపంచాయితీలు ప్రతిజిల్లాలోనూ పనిచేస్తూనేవున్నాయి. కాని యీ పరిపాలనలో పలురకాల మార్పులు వస్తున్నట్టు మనం ఎరుగుదుం. ఈ మార్పులు పంచాయితీని ఎంతవరకూ బాగుచేశాయి? ఎంతవరకూ పాడుచేశాయి? పంచాయితీ యీనాడు బలమయిన సంస్థగా వుందా? లేదా? లేకపోతే ఎందుచేత యీస్థితికి వొచ్చింది? అన్న పరిశోధన కొంత అవసరం.

పంచాయితీ సంస్థ నలువిధాలుగానూ ప్రాబల్యం చెందిన చోటు ఆంధ్రదేశం. గ్రామపంచాయితీ ఒకటే పంచాయితీ కాదు. అడివిపంచాయితీ, నీటిపారుదల పంచాయితీ, కులపంచాయితీ, పంచాయితీకోర్టు—యీ విధంగా పంచాయితీవిధానం ప్రజల కనేకవిధాల తోడు పడుతున్న అనుభవం మనకు వుంది. అయితే, ముందు, గ్రామపంచాయితీలు ఎలా నడుస్తున్నాయి అని మొదట విచారించి చూచినతరువాత తక్కినవాటి విషయం ఆలోచించవచ్చును.

గ్రామపంచాయితీలు మొదట రెండు తరగతులుగా వున్నాయి. మైనరు పంచాయితీలు, మేజరు పంచాయితీలు అని వీటిని అంటున్నారు. చిన్న పంచాయితీలు మామూలుగా పల్లెటూళ్లలో వుంటున్నవి. రెండోరకం పెద్ద పంచాయితీలు కొస్త పెద్దగ్రామాలలోనూ, తాలూకాలలోనూ వుంటున్నవి.

మొదటిరకం మైనరుపంచాయితీలకు ఆదాయం మూడు వేలకు మించదు. సభ్యులు సాధారణంగా గ్రామంలో వున్న వాళ్ల చేత బహిరంగసభలో చేతులు ఎత్తి సభ్యత్వాన్ని అంగీకరించినతరువాత, పంచాయితీలో వారి పనిచేయడం ప్రారంభించి ఆహోదాలో మూడేళ్ల దాకా వుంటారు. తరువాత తిరిగి ఎన్నికలు జరుగుతాయి. వారే రావచ్చు, యింకొకరు రావచ్చు. ప్రతీసారీ ఆగ్రామానికి అలవాటయిన పద్ధతిని ఎంత మంది సభ్యు లుంటారో అందులో ఒకరిని పంచాయితీకి అధ్యక్షుడుగానూ, యింకొకరిని ఉపాధ్యక్షుడుగానూ ఎన్నుకొంటారు. వారు తక్కిన సభ్యులతో కలసి, గ్రామంలో కావలసిన సౌకర్యాల విషయం ఆలోచించి పనిచేస్తుంటారు.

గ్రామంలో నీటి వసతి ఏర్పరచడం, గ్రామ పరిశుభ్రతను కాపాడి, రోడ్లు తుడిపించి, కసువు తీయించడం, ప్రజావినియోగానికి కొన్ని బహిరంగ స్థలాలలో పాయిఖానాలు కట్టించడం, రాత్రి చీకట్లో దారి కనిపించేలా దీపాలు వీథుల్లో వెలిగించే ఏర్పాట్లు చేయించడం, అంటువ్యాధులు వచ్చినప్పుడు జాడ్యం ప్రబలంగా వ్యాపించకుండా అరికట్టే సాధనాలు ప్రజలతరఫున చేయడం, సర్వవిధాలా గ్రామీణుల జీవితం సుఖప్రదంగా చేయడం పంచాయితీ విధ్యుక్త ధర్మం.

అయితే యిందులో ఏపని చేయాలన్నా ధనం కావాలి. చిన్న పంచాయితీలకు యీ కార్యక్రమం

జరిపించాలంటే ధనం ఎలా వొస్తుంది అనేది ప్రశ్న. ఇందులో చాలామటుకు పంచాయితీలకు ముఖ్యంగా వుండే ఆధారం Land cess. అంటే ప్రభుత్వం భూమిపన్ను వసూలుచేసేటప్పుడు అదనంగా రూపాయికి రెండణాలు వసూలుచేసి జిల్లాబోర్డులకు యిస్తుంది. జిల్లాబోర్డు అందులో నాలుగోవంతు పంచాయితీలకు పంచిపెడుతుంది. ఇది ఒకటే పంచాయితీలకు వుండే నికరమయిన ఆదాయం. సాధారణంగా యీ మొత్తం రెండువందల రూపాయలకు మించదు. ఈ మాత్రంతో యీ గ్రామపంచాయితీలు చేయగలిగే పనులు ఏమీ వుండవు. ఈ ఆధారం ఒకటేకాక యితరత్రా ఆదాయం ఏమన్నా వుంటే యీ సంస్థ అభివృద్ధికావడానికి సావకాశాలు లేకపోలేదు. వీలయినచోట్ల ఇంటిపన్ను వేయవచ్చు. ఇంటి ఖరీదునుబట్టి నూటికి సంవత్సరానికి అర్ధరూపాయిచొప్పునో, లేక సులువుగా వుండే రేటు ఏదో నిర్ణయించి యీ పద్ధతి అమలు జరిపితే యీ ఆదాయం కొంత వృద్ధి అవుతుంది. అదిగాక, చెరుకుగానుగలు మొదలయినవాటిమీద నిర్బంధంగా లైసెన్సురుసుములు వసూలుచేసే అధికారం పంచాయితీలు సంపాదించాలి. ఇలాగే ఎక్కడ కక్కడ వున్న ఆధారాలను వొదిలిపెయ్యకుండా పన్నువిధించే హక్కు పంచాయితీకి వుండాలి. కేవలం పన్నులే కాకుండా స్తోమతుకలిగిన రైతులుంటే వారంతా కలిసి చందాలు వేసుకొని రస్తాలు వేయించుకోవచ్చు. చెరువులు తవ్వించుకోవచ్చు. ఇతర సౌకర్యాలు ఎన్నయినా యీవిధంగాగాని, లేక పాటకజనం అంతా తలొక రోజున గ్రామాభివృద్ధికోసం వూరికే పనిచేసి రోడ్డుగాని, చెరువుగాని తవ్వుకోవచ్చు. ఉత్సాహం, గ్రామాభివృద్ధికోసం ఆవేదనా అంటూ వుంటే, మైనరు పంచాయితీ లయినా బాగా ముందుకు రాగలిగి చక్కని సంస్థలుగా పనిచేసే అవకాశాలు ఎన్నయినా వున్నాయి. కొన్నిచోట్ల పంచాయితీ పాఠశాలలు పెట్టవచ్చు. నీటి పారుదల పంచాయితీ, పంచాయితీకోర్టు అన్నీ ఒకటే అయి గ్రామానికి అండగా వుండవచ్చు. అయితే యిలా ఉపయోగకరంగా ఆదర్శంగా వుండే చిన్న పంచాయితీలు లేవా అంటే ఆంధ్రదేశంలో ఎన్నో లేవు; అవి చాలా తక్కువ.

సాధారణంగా చిన్న పంచాయితీ లన్నీ నామకః పని చేస్తున్నట్టు పరిగణింపబడుతున్నాయనే అనాలి. ప్రసిద్ధిపొందినవిమటుకుకూడా లేకపోలేదు. అయితే వాటిసంగతి తరువాత వివరిస్తాను. ప్రస్తుతం మైనరు పంచాయితీలు సర్కారులలోగాని, రాయలసీమలోగాని తమతమ బడ్జెటులనుగాని, కార్యనివేదికలనుగాని తయారు చేసుకోవడం అంటే ఎలాగో, అసలు తమ కార్యక్రమం ఏమిటో కూడా తెలియని స్థితిలోనే వున్నారని మటుకు అనకతప్పదు. దీనికి కారణాలనేకం. ప్రతి జిల్లాకు ఒక జిల్లాపంచాయితీ ఆఫీసరు, యిద్దరు ముగ్గురు అసిస్టెంటు పంచాయితీ ఆఫీసర్లకంటే ఎక్కువ లేరు. సాధారణంగా జిల్లా పంచాయితీ ఆఫీసరు పెద్ద పంచాయితీల తనిఖీతోటే తనపని పూర్తి అయినట్టు భావించడం జరుగుతోంది. పోనీ, వారూ కలిసి చిన్న పంచాయితీలనుకూడా తనిఖీ చేస్తున్నా, ప్రతిజిల్లాకు రెండు మూడు వందల పంచాయితీలు వుంటున్నప్పుడు, ఒక్కొక్క పంచాయితీ అధమం ఒకసారి అయినా చూడడం తటస్థించడంకూడా కష్టమయిపోతోంది. రోజురోజూ కార్యక్రమం ఏమిటో చెప్పవలసిన స్థితిలో వుండే యీ పంచాయితీలకు అధికారరీత్యా యివ్వగలిగిన సాయం ఏమిటో తెలిశాక, యివి యింతకంటే బాగా పనిచేయలేకపోతే మాత్రం వాటిని ఏమనగలం? ఇన్ని పంచాయితీలను అప్పచెప్పి, చాలీచాలని జీతబత్తెముల నిచ్చి, ఒకే సంవత్సరములో ఎన్నిసార్లు ఒక్కొక్క పంచాయితీ మీరు తప్పక అజమాయిషీ చేయవలసిందే అని ప్రభుత్వం నిర్బంధిస్తుంది? నిర్బంధిస్తే మాత్రం ఇది సాధ్యం అయేది ఎలాగ? అధికార వర్గాలమీదా, ప్రభుత్వాదరణమీదా ఆధారపడితే యింక స్థానికసంస్థ అన్న మాటకి అర్థమేమిటి? మనలో వున్న ప్రజానాయకులు, పంచాయితీమీద ఆదరంవున్న పెద్దలు అనేకమంది వుంటున్నపుడు వాటికి కావలసిన సలహాలు, సాయం చేయలేరా అని మనం అనుకుందామా అంటే, అది యెంతవరకు యథార్థరూపంగా యీ సంస్థలకు ఉపయోగపడే సావకాశం వున్న పని అని మనం ఆలోచించక్కర్లేదూ! అనేకమంది పెద్దలు పంచాయితీ ఉత్కృష్టతను గురించి ఉపన్యాసాలు యిస్తున్నారు. వ్యాసాలు వ్రాస్తున్నారు. బహిరంగ సభలు

జరుగుతున్నాయి. తీర్మానాలు పత్రికల్లో ప్రచురింప బడుతున్నాయి. రాష్ట్రసభలుకూడా యీసందర్భంలో సమావేశ మవుతున్నాయి. ఇందుకోసం ఒక పత్రిక కూడా ప్రచారంలో వుంది. ఈ విషయంలో మటుకు ఉపేక్ష జరగడం లేదనడానికి యిన్ని నిదర్శనాలు మనకు కనిపించేటప్పుడు, ఈ సంస్థమీద మనకు యింత మోజు వున్నప్పుడు, మనం క్రియారూపంగా, చట్ట రూపంగా ఏంచెయ్యగలిగాం? పంచాయితీ ఇదివరకు ఎక్కడ వుంకో యిప్పుడూ అక్కడేవుంది. సద్దు జరుగు తోంది; అణిగిపోతోంది. ముఖ్యంగా పంచాయితీ వల్ల ఎక్కువ ఉపయోగం అనుభవించవలసిన పల్లెల మాట యింతేనా?

ఇక రెండోరకం పంచాయితీల సంగతి చూడాలి. ఈ మేజరు పంచాయితీలను మూడు తరగతులుగా ఆదాయాన్ని బట్టి విభాగాలు ఏర్పరచారు. మొదటి రకం పంచాయితీలకు సాలీనా ఇరువదివేల రూపాయిల ఆదాయం మించిరావాలి. రెండోరకం మేజరు పంచా యితీలకు సాలీనా పదివేల రూపాయలనుంచి యిరవై వేల రూపాయల వరకు ఆదాయం వుండాలి. మూడో రకం మేజరు పంచాయితీలకు సాలీనా అయిదువేల నుంచి పదివేల రూపాయలదాకా ఆదాయం ఉండాలి. ఈ మూడురకాల పంచాయితీలకూకూడా కార్యభారం సరిగ్గా నెరవేరేలా చూడాలంటే కొంతమంది గుమా స్తాలు,వారిపనిచూచే అధికారి ఒకడూ కావాలి. ఇందు కోసం యీ రకం పంచాయితీలో ప్రతీచోటా ముఖ్య కార్యనిర్వాహకుడు (Executive Officer) అని ఒక ఉద్యోగి వుంటున్నాడు. యీపద్ధతి యిటీవలనే అమలు లోకి వచ్చింది. క్రీ. శ. ౧౯౪౪ సం॥ నుంచి యీ నియామకాలు రాష్ట్రం అంతటా జరిగాయి. అంతకు ముందు పంచాయితీ అధ్యక్షుడే యీ కార్యభారం యావత్తూ భరించవలసివుండేది. పంచాయితీ సభ్యులంతా కేవలం గౌరవార్థం పనిచేసే పెద్దలు గనుక, దైనందిన గ్రామావసరాల విషయ పరిష్కారం యావత్తూ చూచు కోవలసిన బాధ్యత వేరే జీతం బత్తెంవున్న ఒక వుద్యోగికి అప్పగించి,అతనిని, అతని కింద పనిచేసే వారిని పంచాయితీ అధికారానికి అప్పగించడం జరిగింది. అయితే యీ మార్పు పంచాయితీ పరిపాలనా విధానంలో మెఱుగు తెచ్చిందా లేదా అన్న సందర్భంలో అభి ప్రాయభేదాలు చాలా వున్నాయి.

మేజరుపంచాయితీలలో సభ్యులు మామూలుగా ఓట్లు వేసి ఎన్నుకొనేపద్ధతిమీదనే పంచాయితీలోకి వొస్తారు. గ్రామంలో వార్డువిభజనకూడా వుంటుంది. ప్రత్యేకవార్డునుంచి యింతమంది సభ్యులుగా రావడం, కొన్ని నియోజకవర్గాలలో తురకలు, క్రైస్తవులు, ఆదిఆంధ్రులు రావడం జరుగుతోంది. ఈ పంచాయి తీలుకూడా అధికారంలో వుండేది మూడేళ్లే. కార్య క్రమంకూడా వీటికీ, చిన్నపంచాయితీలకూ ఒకటే.

అయితే వీటి ఆదాయం ఎక్కువగనుక, గ్రామా లలో కావలసిన సదుపాయాలు సరిగా చేయడానికి వీటి కెక్కువ అవకాశాలు వుంటాయి. కాని అవకా శాలువున్నా, వాటిని వుపయోగించే, సవ్యంగా గ్రామో పయోగార్థం పనిచేస్తున్న పంచాయితీలు చాలా తక్కువ.

ఈ పంచాయితీలకు ఆదాయం—ఇంటిపన్ను, బండ్లమీద పన్ను, సంతలమీద పన్ను, చెరువులమీదా కాలువలలోనూ పట్టే చేపలమీద పన్ను, పశువధశాల మీద పన్ను, వృత్తిపన్ను, వినోదాలపన్ను. ఇవి గాక లైసెన్సురుసుములు, సైకిళ్లమీద, బండ్లమీద, కాఫీహోటళ్లు, భోజనపుహోటళ్ళు, మిఠాయిదుకా ణాలు, గానుగలు, చర్మాలు శుభ్రపరిచే దుకాణాలు, నూనె, నేయి, పాలు, పెరుగు కల్తీ అమ్మకాలమీద విధించే జరిమానాలు, అసలు యీ వ్యాపారంలో వుండేవారిమీద విధించే రుసుములు, భూమిరిజిస్ట్రీ షనుమీద వచ్చే రుసుములో భాగం, చెరుకుబెల్లం గానుగలమీద పన్నులు యిత్యాదులు.

ఇవన్నీ సక్రమంగా వసూలుచేసి గ్రామంలో రస్తాలు వేయించడంగాని, దీపాలుపెట్టించడంగాని, మంచినీటివసతులు ఏర్పరచడంగాని,విద్యావ్యాపకమైన వ్యాసంగానికి తగిన ఏర్పాట్లు చేయడంగాని, ఇతర గ్రామోపయోగమయిన పనులు చేయడంగాని చేస్తే ప్రతీపంచాయితీ ప్రతీగ్రామానికీ జీవనాధారంగా వుండి

పంచాయితీసంస్థ యీరాష్ట్రింలో రాణించినంత యింకేచోటా రాణించదు.

అవకాశా లున్నాయి. అన్ని సదుపాయాలూ చేసుకోవచ్చు. ఆర్థికంగా ఆధారా లున్నాయి. అసలు యీ కార్యక్రమంలో వున్న లోపాలోపాలు తెలిసి, సమర్థతతో నిర్వహించగలిగిన పెద్దలున్నారు. ఇన్ని వున్నా, పంచాయితీ ఆంధ్రదేశంలో చాలా అధమ స్థితిలో వుందనే నా మతం.

గత ఆరుమాసాలలోనూ ప్రతీజిల్లాలోనూ పర్యటనం చేసి ప్రత్యక్షంగా వున్న పరిస్థితులు తెలుసుకోవాలని అనేకపంచాయితీలు చూస్తూవొచ్చాను. మంచివీ చూచాను, చెడ్డవీ చూచాను. పనిచేస్తున్నవీ చూచాను, చేయనివీ చూచాను. వీటి యీనాటి స్థితికి కారణా లంతదాకా నా కింత సులభంగా బోధ పడినాయికాదు.

యుద్ధం వచ్చినప్పటినుంచీ స్థానికసంస్థలకు యీరాష్ట్రింలో ఎన్నికలే ఆపేశారు. తొమ్మిదేండ్ల నుంచీ సభ్యులలో మార్పు లేదు. పంచాయితీ ఆదాయాలలో కొన్నిచోట్ల తప్ప సాధారణంగా విపరీతమయిన మార్పులేవీ లేవు. కార్యక్రమం అన్నది అసలే లేదు. పంచాయితీ వుందా అంటే, వుంది అని చెప్పడానికే యివి వుంటున్నట్టు అనిపిస్తుంది.

పంచాయితీగ్రామాలు పెద్దవి అయినా, చిన్నవి అయినా ఒకటీ సర్వే కాలేదు. జిల్లా అంతటా కలసి అయినా ప్రతిపంచాయితీలోనూ ఇంటిపన్నుగాని, పాయిఖానాపన్నుగాని, యితర లైసెన్సులుగాని ఒకే రేటులో లేవు. జిల్లా జిల్లాకూ యీ రేట్లు వేరు. ఒకే జిల్లాలో పంచాయితీకీ పంచాయితీకీ వేరు. వేరువేరురేట్లు అయినా, పోనీ అన్నిచోట్లా ఏదోవిధంగా యీపన్నులన్నీ అయినావున్నాయా అంటే, వున్నచోట్లవున్నాయి; లేనిచోట్ల లేవు. ఉండడంకంటే, అందులోనూ, లేకపోవడమే మామూలు. ఆదాయం సంపాదించడంలో శ్రద్ధ లేనప్పుడు అస లింక కార్యక్రమం సాగే విధానం ఏముంటుంది? సహజంగా పంచాయితీ పడుకొని నిద్రపోతుంది. ఇదే యీనాడు సర్వసాధారణంగా జరుగుతున్న పని. ఈ పంచాయితీసంస్థ బాగుపడాలని అందరికీ వుందిగాని, కార్యరూపేణ ఎవరికి వారే ఇది మాపని కా దనుకోవడంతోటే యీ స్థితి ఏర్పడింది.

ఏజిల్లాలో పర్యటనం చేసి చూచినా, ఎన్నివందలకొద్దీ పంచాయితీలు చూచినా, పంచాయితీ సభ్యుల తత్వంలోగాని, ప్రజల తత్వంలోగాని, పన్నులు యివ్వడంలోగాని, పన్నులు వేయడంలోగాని తగినంత ఔదార్యం కనిపించలేదు. కనిపించి, పంచాయితీలు వాటంతట అవే అభివృద్ధిలోకి వస్తాయనుకోవడంకూడా అసంభవం అనిపిస్తుంది. పన్ను అన్నది ఏనాడయినా నిర్బంధం వుంటేనేగాని వసూలుగాని సామ్ము. అప్పుడయినా ఎన్నిబాధలో పడాలి. అందుచేత, పంచాయితీలు సరిగా పనిచేయాలంటే, పన్నులు అన్నిఆధారాలమీదా విధిగా వేస్తేనేగాని వీలులేదు. ఈ విషయం పంచాయితీవిచక్షణకి వదిలి లాభంలేదు. మానవస్వభావంలో సంకుచితత్వం సాధారణంగా యిలాంటి సావకాశాలు వున్నంతకాలం వాటిని పట్టుకునే వేళ్లాడుతుంది. అందుచేత అది తప్పించేయాలి. తరువాత ప్రతిపంచాయితీకీ ఒక నిర్ణీత కార్యక్రమం ఏర్పరచి, ఆ పని కొనసాగించకపోతే శిక్షించాలి. పంచాయితీ పనులకు వేరే యింజనీరులను, ఓవర్‌సీర్లను పంచాయితీలే తమ ఆదాయంనుంచి ఖర్చుపెట్టుకొన్నా, వారిని నియమించుకొనే సావకాశాలు యివ్వాలి. ఆరోగ్యవిషయంలో అవి ఏమాత్రం ఉపేక్ష వహించినా, తీవ్రమయిన శిక్ష విధించేలా ఏర్పాటులు చేయాలి. ప్రతీగ్రామం సర్వే చేయించి, అన్యాయపు ఆక్రమణలకు జరిమానాలు విధించాలి. సాధ్యమయినంత త్వరలో వాటిని తొలగించాలి. అదీగాక, యీ సంస్థలు అభివృద్ధిలోకి రావాలంటే, పంచాయితీ ఆఫీసర్లు, అసిస్టెంటు పంచాయితీ ఆఫీసర్లు యింకా చాలామంది కావాలి. వారు ఉత్సాహంతో పనిచేయాలంటే, వారికి సరియయిన సహకారం ప్రభుత్వం చూపాలి.

ప్రతీతాలుకాలోనూ, జిల్లాలోనూ పంచాయితీ సభలు జరగాలి. గ్రామపంచాయితీ అధ్యక్షులు, పంచాయితీ వుద్యోగులు, పంచాయితీ అభిమానులూ అంతా కలిసి పంచాయితీ వుద్యమాన్ని గురించి,

చర్చలు జరుగుతుంటూ, పంచాయితీని పురోగమనం లోకి తేవాలి. ఈ చర్చలన్నీ గాలిలో పల్లటీలు కాకుండా, యథార్థపరిస్థితుల నాధారం చేసుకొన్న వాస్తవికవిషయాల చర్చలుగా వుండాలి. పంచాయితీ సభ్యత్వం కోరే అభ్యర్థులు వారి స్వధర్మాన్ని గుర్తించి సామాన్యమయిన లోభాలకు అతీతులయి వుండాలి. ప్రజలు వారికి కావలసిన సౌకర్యాలకు తగిన ఆస్కారాలు వెతుక్కోవాలి. అంటే, అవసరం అయిన ఆర్థిక ఆదాయాన్ని చూచుకోవా లన్న మాట. సవ్యమయిన, సంతృప్తికరమయిన కార్యకలాపం కావాలంటే పన్నులను సంకోచంలేకుండా పంచాయితీలు వసూలు చేయగలగాలి. పంచాయితీలు చేయవలసిన కార్యక్రమాన్ని ఒక రాష్ట్రప్రణాళిక ద్వారా మొదట తెలియబరచాలి. పంచాయితీ అభివృద్ధిలోకి రావాలంటే, యిలాటి మార్పు లెన్నో చేయవలసిన అగత్యం ఎంతో వుంది. పంచాయితీ బలపడి ప్రఖ్యాతితో రాజ్యాంగానికి వన్నె తెచ్చేసంస్థ కాక పోదుగాని, అది ఆదర్శంగా రాణించాలంటే, చేయవలసిన కార్యక్రమం చాలా వుంది. ఈమధ్య స్థానిక స్వపరిపాలన మంత్రులు పత్రికావిలేఖరుల సమాగమంలో చెప్పిన రాబోయే పంచాయితీ విధానపు సూచనలు నాబోటివారికి చాలా అనవసరమయిన, ఉపద్రవకరమయిన మార్పులుగా కన్పిస్తవి. అయితే ఆ విమర్శకు యిక్కడ చోటు చాలదు. అదీగాక యిక్కడ ఆ తర్కం అప్రస్తుతం.

ఇక మిగిలిన పంచాయితీ సంస్థలు—పంచాయితీ కోర్టులు, పంచాయితీ పాఠశాలలు, అడివిపంచాయితీలు, నీటిపారుదల పంచాయితీలూను. పశ్చిమగోదావరిలో నీటిపారుదల పంచాయితీలు కొన్ని వున్నాయి. కాని వాటి ఆదాయం చాలా తక్కువ. ప్రభుత్వ ఆదరణయితే నీరసంగా వుంది. స్తోమతు కలిగిన పెద్ద రైతులుగల అయిభీమవరం, భీమవరంచానలు చిలమత్తూరు పంచాయితీలు సవ్యంగానే పనిచేస్తున్నాయి. అయితే నీటిపారుదల పంచాయితీలు రాష్ట్రంలోనే చాలా తక్కువగా వున్నాయి. బళ్లారిలో కంప్లి, అనంతపురంలో బ్రాహ్మణ ఏలూరు మంచినీటిపారుదల పంచాయితీలు. వాటివాటి స్వంతనిర్గంటులతో పని చేసుకొంటున్నాయి. వాటిపై అధికారులు రెవెన్యూ ఉద్యోగులూ, పబ్లికువర్క్సు డిపార్టుమెంటు ఉద్యోగులూను. పొలా లున్న రైతులంతా నీటిపారుదల పంచాయితీ సభ్యులను ఎన్నుకొంటారు. పెద్దరైతులు అభ్యర్థులు. అన్ని పొలాలకూ సరిగా, కావలసినంత నీటి పారుదల జరిగేలా చూడడం వీరి విధి.

అడివిపంచాయితీలు గ్రామంలోని పశువులకు కావలసిన మేతకు చీట్లు అమ్ముతారు. తరువాత అడివిలో వుండే పుల్ల, ఎండుఆకులు బండికి యింత ఖరీదు అని అణా, అర్ధణా చొప్పున పెర్మిట్లు అమ్ముతారు. పశువులు వున్నవాళ్లంతా యీ పంచాయితీ సభ్యులను ఎన్నుకొనే ఓటర్లు. ఊళ్లో వున్న మోతుబర్లు అడివిపంచాయితీ సభ్యులు అవుతారు.

అడివి పంచాయితీ సభ్యులు ప్రభుత్వానికి ప్రతీ మూడేళ్ళకూ కొంతసొమ్ము కడుతూవుండాలి. ఈ అడివిపంచాయితీల వైశాల్యం సాధారణంగా కొన్ని వేల ఎకరాలు వుంటుంది. ఎకరానికి పన్ను అర్ధణా కంటె ఎక్కువ వుండదు. మొత్తం సంవత్సరానికి అడివి పంచాయితీ రెవెన్యూ కలెక్టరుకు కట్టవలసిన **Lease Amount** మాట ఏభై, లేక రెండువందల రూపాయిలు మించదు. అడివిపంచాయితీనుంచి వచ్చే ఆదాయం పుల్లరిమేత, అడివికట్టెలు, ఆకులు, తేనె, చిన్నఅడివి ఫలసాయం, మోదుగ, తంగేడుఆకులు, మంచిగంధం చెట్లు, వంటచెరుకు మొదలయినవి. అడివిపంచాయితీలు ప్రతీజిల్లాలోనూ వున్నాయి. అయితే నెల్లూరులోనూ, బళ్లారిలోనూ వాటి ప్రతిభ ఎక్కువ. బళ్లారిలో 'తోగా' అడివిపంచాయితీ చాలా ప్రసిద్ధిపొందినది. ఇదికాక, హాస్పెట్ వైపు ఎన్నైనా అడివిపంచాయితీలు మంచివి వున్నాయి. అనంతపురంలో పెనుగొండవైపు అడివిపంచాయితీలు అభివృద్ధిలోకి వస్తున్నాయి. హిందూపురందగ్గరున్న దేమకేతుపల్లి, చిలమత్తూరువంటి అడివిపంచాయితీలు నేను చూచినంతవరకు చాలా మంచిస్థితిలో వున్నవాటిలో అరుదయినవని చెప్పగలను. ఇక్కడే అనంతపురం కలెక్టరైన గెలటీగారుకూడా యీ విషయంలో చాలా అభిమానంగల పెద్దలు. ఆయన యీ విషయంలో చాలా చక్కని అభినివేశంతో పనిచేయుస్తున్నందుకు ప్రజ చాలా కృతజ్ఞతతో వుండాలనే నా అభిప్రాయం. ఆయన యీ విషయంలో తీసుకొంటున్న శ్రద్ధ,. వాటి అభివృద్ధికోసం పడే ఆవేదనా ఆయన నాతో యీ విషయాలను గురించి చర్చించేటప్పుడు ప్రతిమాటలోనూ ద్యోతకమయినాయి. విదేశీయుడయినా, ఆయన తన విధ్యుక్తధర్మాన్ని చేయడంలో యింత సరసంగా నిర్వ

ర్తించే నేర్పు అదే హోదాలో పనిచేస్తున్న మన దేశీయులలో వారు కనిపించలేదనడానికి నేను విచారిస్తున్నాను. కొన్నిచోట్ల జిల్లాకలెక్టర్లు తమ జిల్లాలో అడివిపంచాయితీలు వున్నాయా లేవో, వుంటే ఎక్కడున్నాయో, ఎలా పనిచేస్తున్నాయో తెలియని స్థితిలో వున్నారు. దీన్నిబట్టి వీరు తమ అధీనంలో వున్న యీ అడివిపంచాయితీలను ఎంత శ్రద్ధగా తనిఖీ చేస్తున్నారో బోధపడుతుంది.

ప్రస్తుతం వున్న అడివిపంచాయితీలు నామకః అడవులు; అంతే. ఏటా ఏభైచెట్లు పాతిపెంచుతామని అడివిపంచాయితీ సభ్యులు వ్రాసి యిస్తారు. మేకలను లోపలికి మేతకు రానియ్యమనికూడా హామీ యిస్తారు. లోపల అగ్నిభయం లేకుండానూ, చెట్లు పెరిగేలా చూడడానికీ, వాచర్లను నియమించి వారి జీతాలు వచ్చే ఆదాయంలోంచి యిస్తారు. కాని వారికిచ్చే జీతం ౬ లేక ౮ రూ. కనుకా, వారు చూడవలసినది వేలకొలది ఎకరాల విస్తీర్ణ లికనుకా యీ పంచాయితీల పరిపాలన చాలా అసంతృప్తిగా వుంటోంది. చెట్లు పెరగడం లేదు. కొత్తచెట్లు లేవడంలేదు. మేకలమేత మానడంలేదు. ఈ స్థితిలో అవి ఎలా బాగుపడతాయి? వీటి నభివృద్ధి చేయాలంటే, అడవులశాఖవారికి అప్పగించి వాటిమీద పంచాయితీకుండే అధికారాన్ని కొంత తప్పిస్తే, అవి వృద్ధిలోకి వచ్చినతరువాత సంగతి చూడవచ్చు.

పంచాయితీ కోర్టులు న్యాయాన్యాయ పరిష్కారాలకు తగిన సదుపాయాలు చేస్తున్నాయి. పంచాయితీ పాఠశాలలు పరస్థలాలకు పిల్లలు వెళ్ళక్కర్లేకుండా చదువులు నేర్పడానికి వినియోగపడుతున్నాయి. ఐతే యిదివరకు చెప్పినట్లు వీటిస్థితి చాలా హీనంగా వుంది. ఇవి ఎంతో అభివృద్ధి పొందవలసిన అగత్యం వుంది.

ఏవిధంగా చూచినా గర్వించదగిన స్థితిలో కాకుండా, చివరకి సంతృప్తికరమయిన స్థితిలోనయినా లేవు ఆంధ్రదేశపు పంచాయితీలు. ఇవి బాగుపడి అభివృద్ధిలోకి రావాలంటే జరగవలసిన కార్యక్రమం ఎంతయినా వుంది. యథార్థపరిస్థితుల పంథా ఒకటి; ప్రభుత్వం అనుసరించబోతూన్న పంథా ఒకటి. రెండు రెండుమార్గాలా నడిస్తే, పంచాయితీపేరిట జరిగే కార్యకలాపం పంచాయితీకీ, పంచాయితీప్రజకీ ముప్పు తెస్తుందని చెప్పినా చెడచెవిని పెట్టేమాటుంటే, ఆసంస్కరణ తన తప్పిదాన్ని తనే గుర్తించేదాకా పరిశోధకుడుమాత్రం ఏంచేస్తాడు? మన రాష్ట్రంలో సంస్కరణలన్నీ యీ పంథాలోనే నడుతున్నప్పుడు, పంచాయితీకి ఒకదానికే వచ్చే ముప్పు కాదిది. ఫిర్కా డెవలప్‌మెంటు ఆఫీసర్లను నియమించారు. ఫిర్కా డెవలప్‌మెంటు అంటే ఏమిటో ఈ వుద్యోగులకుగాని, నియమించినవారికిగాని అర్థం అయినట్లు లేదు. పంచాయితీలకు యీ స్కీములు కలిపారు కొన్నిచోట్ల. అవి ఏమిటో తెలియక వాళ్ళు అవస్థపడుతూ, ఏమీ చేయక కూచుంటే, యీపని ఎలావుందో చూడడానికి ఓకమిటీ బయలుదేరింది. పరిపాలనవిధానం అంటే ఏమిటో పరిచయం వున్నవారి కెవరికయినా యీ పరిస్థితులు హాస్యాస్పదంగా వుండకతప్పవు. అయితేనేం? యిది మనవాళ్ళు చేసిన తప్పు లేగనుక మనం మాట్లాడానికి వీలులేదు. ఇదే ఎడ్వయిజరీ ప్రభుత్వం అయితే మన విమర్శలకు అంతులేకపోవును. కాని యిది మనం స్వయంగా చేసికొన్న అపరాధం అయినా, అలా అనుకోడానికి వీలులేని స్థితి యిది. తప్పు అయినా ఆలోచించుకొని దిద్దుకోడానికి యిష్టంలేని కాలం మనది. ఈ సంస్థల స్వరూపం ఏమిటి? దేశస్వరూపమే, చరిత్రే అడ్డంతిరిగిన రోజు లివి. శతాబ్దంనుంచి మనం పెట్టుకొని పోరాడిన ఆశయాలే వదులుకొని, దేనికి పడితే దానికే సిద్ధపడిన దేశంలో, ఏసంస్థ బాగుపడకపోయినా, ఏసంస్థ అధఃపతితమయినా ఆశ్చర్యపడవలసిన కాలం కాదిది. మన తాహతునుబట్టే మన సమస్యల పరిష్కరవిధానమూ వుంది. ఇది వికటంగా వుందని అసహ్యించుకుంటేమాత్రం, ఇంతకంటే మనకు శక్తి లేనపుడు, యీ విషమప్రక్రియకు మనమే సిద్ధపడినామని ఎలా మరిచిపోలేమో, ఆలాగే భవితవ్యంలో పంచాయితీగతి ఏమయినా అంతే, మనం సంతృప్తిపడాలి. పంచాయితీరాజ్యమే వస్తే, అప్పుడే ఆనాటి పంచాయితీతో పరిచయం చేసుకోవచ్చు. మనం ఎరగని కొత్తపంచాయితీనిగురించి ఏమీ అనకుండా, చూచేదాకా ఊరుకోవడమే ఉత్తమం.

# మార్షల్ పథకము: యూరప్ పునరుద్ధరణ

శ్రీ సీతంరాజు సుబ్రహ్మణ్యశర్మ

కీర్తికాయుడు రూజువెల్టు అధ్యక్షుడు దేహయాత్ర చాలించినతరువాత అమెరికాసంయుక్తరాష్ట్రములు (అ. సం. రా.) ప్రపంచమునకు రెండే రెండు మహత్తర విషయములు ప్రసాదించినది: ఒకటి ఆటంబాంబు; రెండు మార్షల్ పథకం. ఆటంబాంబు సర్వవిధ్వంసక శక్తిని, జపానును ఓడించుటకు ఆటంబాంబు చేసిన సహాయమును, శాంతికాలములో ఆటంశక్తి సత్ప్రయోగము వలన మానవునకు కలుగు ఇతోధికసౌఖ్యమును, ప్రపంచ నాగరికతాభివృద్ధిని అందరును గుర్తించినారు. కాని మార్షల్ పథకము, దానితోపాటే ముడిపెట్టబడునని చాలమంది భయపడుచున్న ట్రూమన్ సిద్ధాంతము, సక్రమముగా ఆచరింపబడినచో ప్రపంచఆర్థిక పునరుద్ధరణకు, మానవుని జీవస్థాయి అభివృద్ధికి, ప్రపంచరాజ్యముల సామరస్య సౌహార్దములకు చేయగలిగిన సహాయము గాని, అక్రమవిధానము ననుసరించినచో ఇందువలన గలుగు ప్రపంచవ్యాప్త విద్వేషము, సంక్షోభము, బహుశః సర్వనాశనము ఇప్పటికింకను ఊహామాత్రములుగానే యున్నవి. యుద్ధానంతర రాజనీతిజ్ఞతలో మార్షల్ పథకము అత్యంతప్రముఖస్థాన మాక్రమించుకొని భవిష్యత్తులో ప్రపంచవిధానములకు సూచికగా పరిగణింపబడగలదు.

మార్షల్ ప్రణాళికసూచనను, తదుపరి సంఘటనలను పరిశీలించుటకుముందు యూరపులోని ఆర్థికపరిస్థితి, అ. సం. రా. వాణిజ్యాభివృద్ధి, అంతర్జాతీయ రాజకీయపు పోకడలు ఇవి కొంతవరకు తెలిసికొన్నచో ఈ పథకములోని అంతరార్థము స్పష్టముగా గ్రహించుటకు వీలగును.

యుద్ధకాలములో యూరపురాజ్యములలోని పరిశ్రమలన్నియు జర్మన్ల యాజమాన్యమున పనిచేయవలసి వచ్చినది. అందువలన వానిని చాలవరకు మిత్రరాజ్యముల విమానదాడులలో నాశన మొనర్చిరి. కొన్ని పరిశ్రమలను జర్మన్లు తమ భూదగ్ధ విధానము ననుసరించి నాశనమొనర్చిరి. సస్యశ్యామలములగు సుక్షేత్రములు రణరంగములుగా మార్చబడి భూమిలోని సారము నాశన మొనర్చబడినది. అన్ని విధముల ఆహారపదార్థప్రదాతలగు ఆవులు, పందులు, కోళ్ళు మొదలగు జంతువుల సంఖ్య ఆందోళనకరముగా తగ్గిపోయినది. అందువలన జర్మన్లపై విజయముసాధించిన మరుసటి నాటినుండియు ఆక్రమిత దేశములలోని ప్రజల కాహారపదార్థము లిచ్చి కాపాడవలసిన బాధ్యత మిత్రరాజ్యములపై బడినది. ఆయా దేశములు సైనికఆక్రమణ క్రింద ఉండి, సైనిక పరిపాలనలోనే ఉండుటవలనను, ఆయా దేశముల అజ్ఞాతప్రభుత్వములు మిత్రరాజ్యములలో తలదాచుకొనుచున్న నామమాత్ర ప్రభుత్వములగుట వలనను, ఆయాదేశప్రజలలో ధైర్యోత్సాహములు కల్గించి జర్మన్ల శీఘ్రపతనమునకు వారు తోడ్పడునట్లు చేయవలసిన అవసరముండుటవలనను, మిత్రరాజ్యములు తమ ఖర్చుపైననే ఆయా దేశప్రజలను పోషించినవి. జర్మనీ సంపూర్ణపతనానంతరము ఆయా దేశముల ప్రభుత్వములు పరిపాలనా బాధ్యత వహించినను వానికి తగినంత ఆర్థిక పటుత్వము కలుగువరకు మిత్రరాజ్యములు సహాయపడవలసిన అవసరము గుర్తింపబడినది. అందువలననే లోకోద్ధరణసంఘ మను పేర నొక సంఘమును స్థాపించి, మిత్రరాజ్యములన్నియు ధనసహాయము చేసి, ఆ సంఘము ద్వారా విముక్తయూరప్ ప్రజలకు పునరావాసము కల్పింపవలె నని ఉద్దేశింపబడినది. ఆ సంఘము ఏర్పడి తన కార్యక్రమమును జయప్రదముగా నడిపినది. ఈ లోకోద్ధరణ సంఘములో ప్రముఖపాత్ర అ. సం. రా. ప్రభుత్వమే వహించినది. ఈ లోకోద్ధరణ సంఘకార్య

క్రమము పూర్తియైన దని తలచి ఈ మధ్యనే ఆ సంఘము మూసి వేయబడినది.

అ.సం.రా. యుద్ధములో చాల ఆలస్యముగా చేరిన మిత్రరాజ్యము. అ. సం. రా. సహజసంపత్తి, పరిశ్రమాభివృద్ధి, నూతనసాధనావిష్కరణోత్సాహము ఆ దేశమునకు ప్రపంచార్థికాధిపత్యము చేకూర్చినవి. యుద్ధప్రారంభదశలో అ. సం. రా. అధికతర మొనర్చుకొనుటయేగాక, యుద్ధావసరములకు తగిన మార్గములలో ప్రత్యేకాభివృద్ధిసలిపి, మిత్రరాజ్యములకు సర్వవిధయుద్ధసామగ్రి అమ్ముచుండెడిది. అ.సం.రా.లో వ్యవసాయముకూడ వృద్ధిచేయబడి మిత్రరాజ్యసైనికులకు కావలసిన ఆహారపదార్థములుకూడ ఆదేశమే సరఫరాచేయుచుండెడిది. యుద్ధము తీవ్రతరమైనకొలది, మిత్రరాజ్యములు తాము అ. సం. రా. లో కొనుచున్న ఆయుధములకు, ఆహారములకు ధనము ఇచ్చు పరిస్థితిలో లేనందువలనను, కొన్ని దేశముల అజ్ఞాతప్రభుత్వములతరఫున యుద్ధము సాగించవలసివచ్చుటచేతనే, ఆ ప్రత్యేక పరిస్థితులలో అ. సం. రా. ప్రభుత్వము 'అరువు-కౌలు' చట్టమొకటి తయారుచేసి, ఆవిధానము ప్రకారము యుద్ధమునకు కావలసివచ్చిన సామగ్రినిసరఫరాచేయుచుండెడిది. యుద్ధము పరిసమాప్తమై 'అరువు-కౌలు' చట్టము తొలగించివేసినతరువాత ఆయా దేశముల పునరావాసమునకు మిత్రరాజ్యములు సహాయపడవలసిన అవసరము, అందుకొరకు వారు స్థాపించిన లోకోద్ధరణ సంఘములను గురించి పైన మనవిచేసితిని. లోకోద్ధరణసంఘములో కూడ అ. సం. రా. లే ప్రముఖబాధ్యత వహించి, విముక్త యూరప్ ప్రజలకు కావలసిన ఆహారపదార్థములు ఆయా దేశములలోని పరిశ్రమలు పునః స్థాపించుటకు కావలసిన యంత్రసామగ్రిని సరఫరాచేయవలసివచ్చెను. ఈ కార్యముకూడ చాలవరకు జయప్రదముగా జరిగినది. ఈ విషయములు పరిశీలించినచో అ. సం. రా. యుద్ధకాలములోను, యుద్ధానంతరమును యూరప్ దేశములకు చేసిన సహాయము అపారమని తెలియగలదు. కాని లోకోద్ధరణసంఘమును మూసివేసినంతనే, ఆయా దేశములకు అ. సం. రా. నుండి వస్తువులు అక్కరలేకపోవునా? ఇదివరకు కావలసినన్ని వస్తువులే యిప్పుడుకూడ కావలసివచ్చును. కాని యిదివరకు 'అరువు-కౌలు' చట్టప్రకారముగాని, లోకోద్ధరణసంఘముద్వారాగాని లభించిన ఆ వస్తువులు ఇప్పుడు ధనమిచ్చి కొనవలసివచ్చినది. అందుకు తగినంత ధనము సంపాదించగలంతగా ఆయా దేశములు కోలుకోలేదు. కాబట్టి అ. సం. రా. ఆయాదేశములకు అప్పుపెట్టి ఆ అప్పుసొమ్ముతో ఆయాదేశములు వస్తువులు కొనుటకు సౌకర్యము చేసినది. ఈ అప్పుమొత్తములు కూడ, సంపూర్తిగా ఆర్థిక పునర్నిర్మాణము జరిగి, ఆయాదేశములు తమకు కావలసిన సరకు తమ ధనముతోనే కొనుక్కొగలంత ఆర్థికసౌష్ఠవము పొందగలుగునంతటి కాలమువరకు కావలసిన అవసరముల అంచనావేసి, చాల జాగ్రత్తగానే నిర్ణయింపబడినది. అనుకొన్నట్లుగా కార్యక్రమమంతయు జరిగియుండినచో ఆయాదేశముల ఆర్థికపునరుద్ధరణ, పునర్నిర్మాణము ఇప్పటికి సంపూర్తిగా జరిగి, అవి స్వయంపోషకములై యుండెడివే. కాని ఆయాదేశములలో ఆర్థికపునర్నిర్మాణము ఆశించినప్రకారము జరుగలేదు. ఆయాదేశములలోని రాజకీయవిభేదములవలనను, పరిస్థితులన్నియు అప్పుడే కాలూదుకొనుచున్న ప్రభుత్వముల అదుపులోనికి రాకపోవుటవలనను, వ్యవసాయాభివృద్ధి జరుగుటకు కావలసిన ఎరువు, యంత్రసామగ్రి విరివిగా లభించకపోవుటవలనను, గతశీతాకాలములో నితీవ్రమగుశీతలవాయువులవలన పరిశ్రమలకు కావలసిన బొగ్గుఉత్పత్తి కుంటుపడుటచేతను, ఇతరదేశముల కన్నివిధముల సహాయపడగల జర్మనీపరిశ్రమలు పునరుద్ధరింపబడక పోవుటవలనను ఆర్థికపునర్నిర్మాణము అనుకొన్నప్రకారము జరుగలేదు, అందువలన ఆయాదేశములకు కావలసిన ఆహారపదార్థములు, తదితర అత్యవసరవస్తువులు, యంత్ర సామగ్రి అ. సం. రా. నుండి ఆశించినంతకన్న ఎక్కువగా దిగుమతిచేసికొనకతప్పినదిగాదు. అదేసమయములో ఈ వస్తువుల ధరలు అ. సం. రా. లలో పెరిగిపోవుటవలన ధనరూపములో ఖర్చు మరింత ఎక్కువైనది; అ. సం. రా. నుండి ఆయాదేశములు పుచ్చుకున్న అప్పుమొత్తములు చాల తొందరగా ఖర్చయిపోజొచ్చెను. ఈ మొత్తములనుగురించి కొన్ని వివరములు తెలిసి

కొన్నచో పరిస్థితి తేలికగా అవగాహన చేసికొన వచ్చును. ౧౯౪౫ వ సం. అక్టోబరు నెలలో వివిధ దేశములకు అ. సం. రా. లలో మొత్తము ౧, ౫౦౦ కోట్ల డాలర్ల నిలువలు ఉండెను. ఆయా దేశములలో ఆర్థిక పునర్నిర్మాణము జరుగువరకు ఈ మొత్తములు వాడుకొనుచుండవచ్చునని ఉద్దేశింపబడెను. ఈ ౧౫౦౦ కోట్ల డాలర్ల నిలువలే గాక, లోకోద్ధరణ సంఘము, ఎగుమతి-దిగుమతుల బ్యాంకు, అంతర్జాతీయద్రవ్యనిధి, అంతర్జాతీయబ్యాంకు, తదితర బ్యాంకులు మొదలగు సంస్థలుగూడ విదేశములకు సహాయముచేయగలవు. ౧౯౪౬ వ సం.లో అ.సం.రా. మొత్తము ఎగుమతులు ౧౨౩౦ కోట్ల డాలర్లు; దిగుమతులు ౫౧౦ కోట్ల డాలర్లు; వ్యత్యాసము ౭౨౦ కోట్ల డాలర్లు. ఈ మొత్తమునకు అప్రత్యక్ష ఎగుమతుల మొత్తము ౧౦౦ కోట్ల డాలర్లు కలిపిన, వాణిజ్యవ్యత్యాసము ౬౨౦ కోట్ల డాలర్లు అ.సం.రా. లకు విదేశములు చెల్లించవలసిన నికర మొత్తమని తేలుచున్నది. ఈ ౬౨౦ కోట్లకుగాను ౩౨౦ కోట్ల డాలర్లు లోకోద్ధరణసంఘము, తదితరధర్మములు పోను మిగిలిన ౫౦౦ కోట్ల డాలర్లు పైచెప్పిన ౧౫౦౦ కోట్ల డాలర్ల నిలువనుండి చెల్లింపబడెను. ౧౯౪౭ వ సం. అ.సం.రా. ఎగుమతులు ౨౦౦౦ కోట్ల డాలర్లు ఉండునని అంచనా వేయబడినది; దిగుమతులు ౮౫౦ కోట్ల డాలర్లుమాత్రమే; వ్యత్యాసము ౧౧౫౦ కోట్ల డాలర్లు. అప్రత్యక్ష ఎగుమతుల మొత్తము కలిపినచో ఈ మొత్తము ౧౨౫౦ కోట్ల డాలర్లు కాగలదు. (ఒక దేశము మరొక దేశమునకు భీమా, నౌకా, బ్యాంకింగు మొదలగు సౌకర్యములను కలిగించి సంపాదించుకొన్న ధనము అప్రత్యక్ష ఎగుమతులు; ఈ సౌకర్యము లుపయోగించుకొని డబ్బు చెల్లించవలసిన దేశములకు అవి అప్రత్యక్ష దిగుమతులు. కంటితో చూడగలిగిన వస్తువుల ఎగుమతి ప్రత్యక్ష ఎగుమతి. దీనినే సాధారణముగా ఎగుమతి అని వ్యవహరింతురు.) కాని వివిధ విదేశములకు అ. సం. రా. ఇచ్చిన అప్పుతోసహా గల నిలువలు ౧౫౦౦—౫౦౦=౧౦౦౦ కోట్ల డాలర్లు మాత్రమే; ౨౫౦ కోట్ల డాలర్లకు తక్కువ లేకుండా కొరత ఏర్పడి తీరును కాని ఏ దేశము తన డాలరు నిలువలన్నియు సంపూర్ణముగా వాడుకొనదు. కొంత మొత్తము ఏ పరిస్థితులలోను వాడకుండ ఉంచుకొని, ఈలోపునే వేరొక విధముగా డాలర్లు సంపాదించుకొనుటకు ప్రయత్నించును. కాబట్టి ఈ సంవత్సరము చివరకు డాలరుకొరత ౨౫౦ కోట్ల డాలర్ల నికరపు మొత్తమైనను, ఇంతకన్న ఎక్కువ మొత్తము కొరత ఉండి, కొంతనిలువ ఉండగలదు. యూరప్ రాజ్యములలో ఆర్థిక పునరుద్ధరణ యింకను జరగనేలేదు. అందువలన ఆ రాజ్యములకు అ. సం. రా. సహాయము కావలెను; అంతకన్న సహాయముచేయగల దేశము ఈరోజున ఏదియులేని సంగతి విశదమేకదా! అత్యవసరములైన ఆహారపదార్థములు మొదలగువాని సహాయము లభించకపోతే ఆ దేశములలో దుర్భిక్షము తప్పదు. తద్వారా రాజకీయ విప్లవములు జరిగితీరును. ప్రజాస్వామ్య సిద్ధాంతముల రక్షణయే, అసాధ్యమగును. యూరప్ రాజ్యముల పరిస్థితి యిది.

అ. సం. రా. లలో సౌభాగ్యము వెల్లివిరియుచున్నది. యుద్ధకాలములో పాతపరిశ్రమ లభివృద్ధి చేయబడుటయేగాక, చాల క్రొత్తపరిశ్రమలు స్థాపింపబడినవి. నిరుద్యోగము పేరునకైనను సమస్యగా కన్పించుటలేదు. అ. సం. రా. ఉద్యోగులసంఖ్య ౧౯౪౬ వ సం. లో ౫, ౫౬, ౪౦, ౦౦౦; ౧౯౪౭ వ సం. ప్రథమార్థ భాగములో ౬, ౧౪,౦౦, ౦౦౦. అ. సం. రా. వ్యావసాయిక పారిశ్రామిక, ఉత్పత్తి మొత్తము ౧౯౪౭ వ సం. ప్రథమార్థభాగపు మొత్తమునుబట్టి సం. నకు ౨౨,౫౦౦ కోట్ల డాలర్లు; యుద్ధకాలములో, అన్ని సంవత్సరములలో ఎక్కువ మొత్తము ౨౧,౩౦౦ కోట్ల డాలర్లు. అ. సం. రా. దేశీయాదాయము మొత్తము ౧౯౩౯ వ సం.లో ౭,౨౦౦ కోట్ల డాలర్లు; యుద్ధకాలములో అన్నిసంవత్సరములలో ఎక్కువమొత్తము ౧౮,౨౦౦ కోట్ల డాలర్లు; ౧౯౪౭ వ సం. ప్రథమార్థభాగపు లెక్కలప్రకారము సం. ౧౯,౯౦౦ కోట్ల డాలర్లు. కాబట్టి ఏవిధముగా జూచినను అ. సం. రా. ఇదివరకెన్నడును లేనంత సౌభాగ్యముతో ఈనాడు తులతూగుచున్నట్లు తెలియగలదు. అ. సం. రా. దిగుమతులు చాల తక్కువ; ఎగుమతులు చాల ఎక్కువ. ఆ దేశము అమ్ముటయేగాని కొనుట అరుదైపోయినది.

ఇట్టి పరిస్థితులలో, విదేశముల కొనుబడి తగ్గిపోయిన కొలది, దేశములో పరిశ్రమల ఉత్పత్తి తగ్గించవలసి వచ్చును. నిరుద్యోగము సమస్య కాగలదు. యూరపు రాజ్యాలకు డాలర్లు లేవుకదా, ఆ రాజ్యాలన్నియు అ. సం. రా. లో వస్తువులు కొనుట మానివేసినచో, ఈ దేశములో పరిశ్రమలు చాలభాగము మూసివేయ వలసినదే; ఆహారపదార్థాలు పందులకు మేపుకోవలసినదే. కార్మికసమస్య విషయమై, రాజకీయ వాతావరణము భయంకరమైపోగలదు. అందువలన ఏవిధముగానైనను అ. సం. రా. ఎగుమతులు నిలబెట్టుకుని, ఆర్థిక సౌష్ఠవము కాపాడుకొనకతప్పదు. విదేశములకు, ముఖ్యముగా యూరపురాజ్యాలకు వస్తువులు కావలసినను, కొనుటకు డబ్బులేదు. కొనకపోయిన ఆదేశాలలో కరువు ఏర్పడి విప్లవము వచ్చితీరును. కాబట్టి, రెండుపక్షాలకు సంతృప్తికరముగానుండు విధానము ఒకటి అవలంబింపక పోతే, రెండుపక్షాలకును ఎక్కువ నష్టము కలిగితీరును. ఈ పరిస్థితి నెదుర్కొనుటకు క్రొత్తగా సృష్టింపబడిన విధానమే మార్షల్ పథకం.

జూలై ౫ వ తేదీన హార్వర్డు విశ్వవిద్యాలయములో ఉపన్యసించుచు అ. సం. రా. దేశీయశాఖ కార్యదర్శి జనరల్ జార్జి మార్షల్ యూరప్‌రాజ్యాల దుస్థితిని వర్ణించి, వానికి సహాయము చెయ్యవలసిన అగత్యము నిరూపించి, ముఖ్యముగా అ. సం. రా. సహాయము చెయ్యకతప్పదనియు, ఆయాదేశాలు కలిసి ఒకప్రణాళిక ఏర్పరచుకొంటే, అ. సం. రా. ప్రభుత్వము తగు సహాయము చేయగలదనియు సూచించెను. ఈ సూచనకు యూరప్‌రాజ్యాలన్నియు ముఖ్యముగా బ్రిటన్, ఫ్రాన్సులు అమితముగా హర్షించినవి. 'ఎకానమిస్టు' పత్రిక "యిది మన కాలక సవాలు" అనియు, సోషలిష్టుపక్ష పత్రిక 'న్యూస్టేట్సుమన్ అండ్ నేషన్' "రూజ్వెల్టు మరణానంతరము అమెరికన్ అధికారులు ప్రదర్శించిన ప్రథమ రాజనీతిజ్ఞత" అనియు ఈ ప్రణాళికను శ్లాఘించినవి. బ్రిటన్ విదేశాంగశాఖమంత్రి బెవిన్ వెంటనే పారిస్ వెళ్లి, ఫ్రెంచి విదేశాంగశాఖ మంత్రి బిడాల్ట్‌తో సంప్రదింపులు జరిపినాడు. సోవియట్ యూనియనునుకూడ ఆహ్వానించి, త్రైరాజ్య సమావేశములో ఈ విషయము ఆలోచించవలెనని నిశ్చయించి, సోవియట్ యూనియనుకు ఆహ్వానము పంపినారు. సోవియట్ యూనియన్ ఈ ఆహ్వానము నంగీకరించుచు, ఈ సమావేశము జూన్ ౨౭ వ తేదీన, పారిస్‌లో జరుపవచ్చునని సూచించినది. ఆ ప్రకారము సమావేశమై అగ్రరాజ్యత్రయ విదేశాంగశాఖ మంత్రులు ఆరు రోజులు సంప్రదింపులు జరిపి, అంగీకారము కుదుర్చుకొనలేకపోయినారు. ఈ సమావేశములో బ్రిటన్, ఫ్రాన్సులు సంయుక్తముగా చేసిన సూచనలను తీవ్రముగా విమర్శించుచు మాలటావ్ ఉపన్యసించినాడు. ఈ సమావేశము విఫలమైనను, ఈ పథకము కొనసాగించవలెననే బ్రిటన్, ఫ్రాన్సులు నిర్ణయించినవి. ఆ ప్రకారమే సోవియట్ యూనియనుతో సహా ౨౨ యూరప్‌రాజ్యాలకు జూలై ౧౨ వ తేదీన పారిస్‌లో జరుగు సమావేశమునకు హాజరుకావలసినదని ఆహ్వానములు పంపబడెను. రష్యా ప్రాబల్యములో ఉన్న రాజ్యముల వైఖరి మొదటినుంచి అనుమానముగానే ఉండెను. జెకోస్లవేకియా ఆహ్వానము అంగీకరించి, చివరకు నిరాకరించినది. తక్కిన రాజ్యాలు అసలు అంగీకరించనేలేదు. మొత్తము ౧౬ రాజ్యాలు జూలై ౧౨ వ తేదీన బెవిన్ అధ్యక్షతన సమావేశమైనవి. ఆ రాజ్యాలు బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ, పోర్చుగల్, బెల్జియం, నెదర్లండ్సు, డెన్మార్కు, స్విట్జర్లండు, లగ్జంబర్గు, నార్వే, స్వీడన్, గ్రీస్, టర్కీ, ఆస్ట్రియా, ఐర్లండు, ఐస్లెండు. స్పెయిన్ ఈ సమావేశమునకు ఆహ్వానింపబడనేలేదు.

మార్షల్ పథకములో పాల్గొనుచున్న ౧౬ రాజ్యాలు కలిసి ఒక కస్టమ్సు యూనియన్ ఏర్పరచుకొని, తమ దేశాలన్నింటిలోను ఒక దేశములో మరొకరు స్వేచ్ఛాపూరితవర్తకము జరుపుకొనుటకు అవకాశము ఏర్పరచుకోవలెనని బెవిన్ చేసిన సూచన ఆమోదించబడినది.

ఈ సమావేశపు ప్రస్తావన ఆపి, అగ్రరాజ్యత్రయ విభేదములనుగూర్చి వివరములు తెలిసికొందము. బ్రిటన్, ఫ్రాన్సులు సంయుక్తముగా ప్రతిపాదించిన ప్రణాళిక ప్రకారము యూరప్‌రాజ్యాల సమావేశ

మొకటి జరిగి, అగ్రరాజ్యత్రయము, తదితర కొంత మంది సభ్యులు గల ఒక సారథ్యసంఘమును; వ్యవసాయము, విద్యుచ్ఛక్తి, రవాణా, ఉక్కు, ముడిపదార్థములు, వ్యాపార వ్యత్యాసములనుగూర్చి యూరప్ రాజ్యాల పరిస్థితులను విచారించుటకు ప్రత్యేక సంఘములను నియమించును. ఈ ఆరు సంఘముల నివేదికలు పరిశీలించి, సారథ్యసంఘము, యూరప్ పునర్నిర్మాణమునకు కావలసిన సహాయమునుగురించి ఒక సమగ్రనివేదిక తయారుచేసి అ. సం. రా. ప్రభుత్వమునకు దాఖలు చేయును.

ఈ సూచనలను మాలటావ్ తీవ్రముగా విమర్శించినాడు. యూరప్ రాజ్యాల కన్నిటికిని కలిపి ఒక సమగ్ర పథకము నిర్మించేటట్లయితే ఆయా దేశముల సర్వస్వతంత్రతకు భంగము వాటిల్లగలదు; ఈ సారథ్య సంఘముగాని, అ. సం. రా. గాని ఆయా దేశములపై పెత్తనము చేయుటకు పూనుకోవచ్చును. ఒక్కొక్క దేశమునకు ఎంతెంత సహాయము కావలెనో ఆయా దేశాలు అంచనాలువేసుకొని కోరితే, విడివిడిగా ఆ దేశాలకు అ. సం. రా. అప్పయిస్తే మంచిది. అన్ని రాజ్యాలును కలిసి వాటి అవసరములను సంయుక్తముగా ఆలోచించవలెనంటే వాని హోదాకు భంగము వాటిల్లును. అసలు అ. సం, రా. ఎంతమొత్తము అప్పు ఇవ్వగలదో తెలియదు. ఈ దేశాలన్నియు సమగ్ర నివేదిక పంపినచో అ. సం. రా. కాంగ్రెస్ ఆమోదించుననీ హామీ లేదుకదా! ఏ షరతులపై ఎంతమొత్తము తాను అప్పు పెట్టుటకు సిద్ధముగా ఉన్నదో అ. సం. రా. ప్రభుత్వము ప్రకటించవలెను. ఆయా దేశాలు తమ ఆర్థిక పునర్నిర్మాణమునకు ప్రణాళికలు వేసి కార్యక్రమము జరుపుచున్నవి. ముఖ్యముగా సోవియట్ యూనియన్ లాంటి దేశాల ప్రణాళికలకు ఈ మార్షల్ పథకమువలన భంగముకలుగును. అని సోవియట్ యూనియన్ ఈ సూచనలను తిరస్కరించినది.

తమ సూచనలను బలపరుచుకొనుచు బ్రిటన్, ఫ్రాన్సులు వాదించినవి. యూరప్ రాజ్యాలన్నిటికిని విడివిడిగాగాక, ఒకే మొత్తముగా మాత్రమే సహాయము చేయుటకు అ. సం. రా. పూనుకొన్నది. ఈ విషయములో అ. సం. రా. ప్రభుత్వము ఇంతకన్న ఎక్కువ జోక్యము కలిగించుకోకూడదు. అట్లు జోక్యము కల్గించుకొన్నచో సోవియట్ యూనియన్ అ. సం. రా. ఆయా దేశాల సర్వస్వాతంత్ర్యమును భగ్నపరుచుచున్నదని ఆరోపణచేయును. అందువలన తమకు కావలసిన సహాయము మొత్తము యూరప్ రాజ్యాలే ఆలోచించి నిర్ణయించుకోవలెను. ఈ రాజ్యాల నివేదిక పరిశీలించిన తరువాతనే అ. సం. రా. కాంగ్రెస్ ఈ మొత్తము మంజూరు చేయగలదు; ఇంతమొత్తము అప్పు ఇవ్వబడునని ముందుగా చెప్పుటకు అవకాశము లేదు అని ఈ దేశాల వాదన. ఈ ప్రతిపాదనల ప్రకారము కార్యకలాపము జరిగితే యూరప్ రెండు భాగాలుగా విభజితమై పోగలదని బెదిరించుచు మాలటావ్ మాట్లాడినాడు. కాని ఈ కార్యక్రమము జరుపుటకు బ్రిటన్, ఫ్రాన్సులు నిశ్చయించినవి.

సోవియట్ నాయకత్వాన ఉన్న తూర్పు యూరప్ రాజ్యాలు చేరకపోవుటవలన కలుగు లాభనష్టములను గురించి పరిశీలింతము. తూర్పుయూరప్ రాజ్యాలు ముఖ్యముగా వ్యవసాయిక దేశాలు; పశ్చిమ యూరప్ దేశాలు పారిశ్రామికదేశాలు. పశ్చిమయూరప్‌నుండి తయారైన సరకు తూర్పుయూరపుకు ఎగుమతిజరుగును. తూర్పు యూరపునుండి ముడిపదార్థములు, ఆహారపదార్థములు పశ్చిమయూరపునకు దిగుమతిఅవును. కాబట్టి ఇప్పుడు పశ్చిమయూరప్ దేశాలకు మార్కెటు పోవును; ఆహార పదార్థాల పంటలు ఆ దేశాలలోనే అభివృద్ధిచేసి కొనవచ్చును, లేదా అ.సం.రా. నుండి దిగుమతిచేసికొనవచ్చును. తూర్పుయూరప్ రాజ్యాలకు కావలసిన సరకు సోవియట్ యూనియన్ సరఫరాచేయును. కాని వాని వ్యవసాయికపదార్థములు కొనగలదా ? లేదు, సోవియట్ యూనియన్ వ్యవసాయదేశమే. అదియుగాక, సోవియట్ యూనియన్‌తోసహా తూర్పుయూరప్ రాజ్యాల కన్నింటికిని కావలసిన యంత్ర సామగ్రి అ. సం. రా., బ్రిటనులనుండి రావలసినదే. కాబట్టి తూర్పుయూరప్ రాజ్యాల ఆర్థికపునర్నిర్మాణము సరిగా జరగదు; ఆ దేశాలకు డాలర్లు లభించవు. సోవియట్ యూనియనుకే డాలర్లు కావలెను. కాని అ. సం. రా. డాలర్లు పెట్టుబడిపెట్టుటకు నిరాకరించెను. పశ్చిమ

యూరప్ రాజ్యాలన్నియు డాలర్లు సంపాదించుకొని, సౌఖ్యముగా జీవించుచుండగా తూర్పుయూరప్ రాజ్యాలుకూడ సోవియట్ యూనియనను ధిక్కరించి, ఈ పథకము అంగీకరించునేమో! అందుకొరకై ఆ దేశములను సౌఖ్యవంతములు జేయుటకు సోవియట్ యూనియన్ ప్రత్యేక మాలటావ్ పథకము నిర్మించునేమో! బ్రిటన్, అ. సం. రా. ల ధనికవాదతత్వపు ఆర్థికవ్యవస్థలు త్వరలోనే కూలిపోయి, ఆయా దేశాల ప్రజలు కమ్యూనిజంవైపుకు మొగ్గుదురని సోవియట్ యూనియన్ ఆశించుచున్నది. ఏనాటికైనను, డాలర్ల కొరకు తూర్పుయూరప్ రాజ్యాలు చేరకపోవని బ్రిటన్, ఫ్రాన్సులు భావించుచున్నవి. ఎవరి ఉద్దేశాలు సక్రమమైనవో మనము నిర్ణయింప బూనుకొనుట అనవసరము.

తూర్పుయూరప్ రాజ్యాలు పాల్గొనకుండనే, ౧౬ రాజ్యాలసమావేశము పారిస్‌లో జులై ౧౨ వ తేదీన ప్రారంభమైనది. ఒక్కొక్క రాజ్యమునుండి ఒక్కొక్క ప్రతినిధిచొప్పున ౧౬ గురు ప్రతినిధులు గల కార్యవర్గము ఒకటి ఏర్పరుచబడినది. ఈ పథకము రాజకీయాలకు సంబంధించినదికాదనియు, ఆర్థిక పునరుద్ధరణకుమాత్రమే ఉద్దేశింపబడినదనియు బెవిన్ నొక్కివక్కాణించెను. చిన్నరాజ్యములుకూడ సక్రమముగానే ఆదరింపబడినవి. ఈ సమావేశనియమావళి అంగీకరింపబడెను. ఈ కార్యవర్గము ఐక్యరాజ్యసమితికి ఏవిధముగాను విరుద్ధముగా ఉండకూడదని స్వీడన్ ప్రతినిధి చేసిన సూచన ఆమోదింపబడినది. బ్రిటిష్‌సామ్రాజ్య దేశముల సాధనసంపత్తి అంతయు యూరప్ పునరుద్ధరణకు తోడ్పడునని బెవిన్ వాగ్దానము చేసినాడు. ఈ కార్యవర్గనిపుణులు సెప్టెంబరు ౧ వ తేదీలోగా సమగ్ర నివేదిక తయారుచేయవలెనని నిర్ణయింపబడినది. యూరప్‌రాజ్యాల అవసరములు తెలుసుకొనుటకు ప్రతి ప్రభుత్వమునకు ఒక పెద్ద ప్రశ్నావళి పంపబడెను. ఆ ప్రశ్నలకు వచ్చిన సమాధానముల నన్నింటిని సమీకరించి, మొత్తము ౧౬ రాజ్యాల అవసరములు నిర్ణయింతురు. ఈ కార్యక్రమ మంతయు అతిచురుకుగానే జరిగిపోయి, నిపుణుల నివేదిక తయారైనది. ఈ నిపుణుల అంచనాలప్రకారము ౧౬ రాజ్యాలకు ౪ ఏండ్లకు ౨౧౯౦ కోట్ల డాలర్లు సహాయము కావలసియుండును. ఈ నిపుణులు మొదట ఇంతకన్న ౮౦౦ కోట్లు ఎక్కువ అంచనా వేసినారుగాని, 3౦౦౦ కోట్ల మొత్తము అ. సం. రా. కాంగ్రెస్ ఆమోదించకపోవచ్చుననియు, ౨,౦౦౦ కోట్ల డాలర్ల మొత్తము అంగీకరించవచ్చుననియు అ. సం. రా. అధికారులు చూచాయగా తెలియజేసినపిమ్మట ౨౧౯౦ కోట్ల డాలర్లకు తమ అంచనాలు సరిచేసికొన్నారని తెలియుచున్నది. అప్పట్లో పారిస్‌లో ఉన్న అ. సం. రా. ఆర్థికశాఖ సహాయకార్యదర్శి విలియం క్లేటన్ ఈ నివేదిక చిత్తుప్రతిని పరిశీలించి, కొన్ని విమర్శలు చేసినాడు. ఈ నివేదిక అవసరమైన వస్తువుల జాబితావలె ఉన్నదిగాని ఆయా దేశముల అభివృద్ధి ప్రణాళికలు సూచింపబడలేదు. ౧౬ రాజ్యములు తమలో తాము ఏవిధముగా సహాయపడునో తెలియజేయబడలేదు. ఏయే రాజ్యమునకు ఎంతెంత మొత్తము కావలెనో విడిగా వివరములు తెలియజేయబడలేదు. ఈ విధముగా ఆయన అనేకవిమర్శనలు చేసి, ఈ నివేదికను చిత్తునివేదికగా భావించి, తను మార్పులుచేసి, శుద్ధప్రతిని తయారుచేయవలసినదని కోరినాడు. నిపుణులు తిరిగి సమావేశమై ఆయనసూచనల ప్రకారము మార్పులు చేసి, ఆయనకు అంగీకారయోగ్యముగా ఉండునట్లు నివేదికను మార్పుచేసినారు. ౧౬ రాజ్యాల అగ్రనాయకులు ఈమధ్యనే పారిస్‌లో సమావేశమై ఈ నివేదికను పరిశీలించి ఆమోదించినారు. ఈ సమావేశమునకు హాజరైన ఐర్లండు ప్రధాని ఎమన్ డివేలరా ఈ నివేదిక "ఒక నిష్కపటమైన పత్ర"మని శ్లాఘించినాడు. ఈ నివేదికను అ. సం. రా. ప్రభుత్వము ఆమోదించి, కాంగ్రెస్‌చే ఆమోదింపజేయు సూచనలు కనబడుచున్నవి.

౧౯౪౮-౫౨ వ సం.నకు ఈ రాజ్యాలలో జరుగవలసిన ఆర్థికాభివృద్ధి ఈ నివేదికలో నిర్ణయింపబడినది. ఈ నివేదిక ప్రకారము కార్యక్రమము కొనసాగితే, యూరప్‌రాజ్యాలు తిరిగి కోలుకొనగలవు.

మార్షల్ పథకప్రకారము యూరప్ రాజ్యాలకు సహాయముచేయుటకు అమెరికన్ పరిశ్రమల విధానా

లలో ఏమేమి మార్పులు జరుగవలెనో, కావలసినన్ని వస్తువులు తయారుచేయగల పరిస్థితిలో పరిశ్రమలు ఉన్నవో లేవో పరిశీలించుటకు ట్రూమన్ అధ్యక్షుడు ఒక ప్రత్యేక సంఘమును నియమించెను. మార్షల్ పథక ప్రకారము కావలసినన్ని వస్తువులను అ. సం. రా. పరిశ్రమలు తేలికగానే ఉత్పత్తిచేసి, సకాలమునకు అందివ్వగలవనియే ఈ సంఘము తన నివేదికలో తెలియ జేసినది. యుద్ధానంతరము అ. సం. రా. లో ధరలు నూటికి ౫౦ వంతులు పెరిగిపోయినవి. ఈ ధరల పెరుగు దల నరికట్టకపోయినచో అ. సం. రా. చేసెడి ధన సహాయమువలన కలుగవలసినంత ఫలము కలుగదు. ఆహారధాన్యముల ధరలు స్థిరీకరణ మొనర్చు విధానము నిర్ణయించుటకు అం. సం. రా. ప్రభుత్వము పూను కొన్నది. కాబట్టి, మార్షల్ పథకప్రకారము ౧౬ రాజ్యాల నిపుణులు తయారుచేసిన నివేదిక అ. సం. రా. ప్రభుత్వము త్వరలోనే అంగీకరించవచ్చును.

మార్షల్ పథకము ఆమోదింపబడినను, కాంగ్రెస్ సమావేశములో అది ఆమోదించబడువరకు యూరప్ దేశాలకు అప్పు ఇచ్చుటకు వీలు లేదు. కాంగ్రెస్ ఆమోదము బహుశః నవంబరు నెలలో లభిం చవచ్చును. కాని కొన్ని యూరప్ రాజ్యాల పరిస్థితి చాల ఘోరముగానున్నది. ఫ్రాన్సుదేశము బంగారము అమ్మి డాలర్లు సంపాదించుకొనుచున్నది; అంతర్జాతీయ ద్రవ్యనిధి, అంతర్జాతీయ బ్యాంకు, ఎగుమతి-దిగుమతి బ్యాంకులలో అప్పులు పుచ్చుకొన్నది. అయినను, వెంటనే ౧౦ కోట్ల డాలర్లు లభించకపోతే, కాటకము, ప్రభుత్వ పతనము తప్పదని అ. సం. రా. అధికారులు, ఫ్రెంచి అధికారులు గుర్తించినారు. ఇతర యూరప్ రాజ్యాలన్నిటి పరిస్థితి ఈవిధముగానే ఉన్నది. కాబట్టి ఈ స్వల్పకాలములో కావలసిన సహాయముకూడ వెంటనే చేయుటకు అ. సం. రా. పూనుకొన్నట్లు తెలియుచున్నది. ఈ విషయమై ఆర్థిక శాఖకార్యదర్శి జాన్ స్నైడర్ ఒక ప్రకటనకూడ చేసినాడు. కొన్నిరోజులలోనే ఈ విషయమై వివరాలు తెలియవచ్చును.

మార్షల్ పథకము సక్రమముగా కొనసాగునా? వివిధదేశాలు తమ సర్వస్వతంత్రతను ఎంతవరకు వదలి వేసికొనవలసివచ్చును? తూర్పు యూరప్ రాజ్యాలు ఈ పథకములో చేరునా? చేరకపోయినచో ఏమి జరుగును? మార్షల్ పథకము సౌభాగ్యకరముగా పరిణమించునా? ప్రపంచమును రెండువర్గాలుగా విడదీసి నాశనానికి దారితీయునా? ఈ ప్రశ్నలకు కాలమే సమాధానము చెప్పగలదు.

# బ్రహ్మాదులపై కొన్ని రిమార్కులు



— శ్రీ మద్దులపల్లి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి —

అలుపం బే గద! బ్రహ్మ నిక్కముగ శ్రేయస్కాముఁడే నైనచో
కలిలోఁ బంచసహస్రవర్షముల పైకాలంబులో నేఁడు కాం
తలకున్ ముచ్చిలిగుంటలో జడల రెంటన్ గల్గు నవ్వింతలన్
గలయన్ జూచుకొనంగ నందు నొక కన్ గల్పింపఁగాఁ జెల్లదే?

మది చెడినట్టు లున్నది అమాంతము బ్రహ్మకు; లేకయున్నచో
మొదటఁ బ్రపంచరక్షణకుఁ బూర్తి సమర్థు లటంచు దైత్యులన్
జదివినవాఁడు, నేఁడు ప్రభుశాలల నల్గురి కున్న యక్కఱల్
పదిలముగా నొనర్చు గుణవంతుల శాంతుల నుండఁ జేయఁడే?

కొడుకున్ గోడలు, కూఁతు రల్లుఁడును యోగ్యుల్ గాఁగ, సౌఖ్యంబు లే
ర్పడి జీవించెడువారు గాఁగ జనకుల్ వాంఛించుటల్ గల్గు; నే
జడిమంబో గద బ్రహ్మదేవునకుఁ! దా జాంపత్యమున్ గూర్చుచోఁ
గడు వైషమ్యము లుంచి యాలుమగలన్ గాఱించుటల్ దేనికో?

సకల మెఱింగినప్పుడు దొసంగు పొసంగఁగ రాదు; మొండిబం
డకు గడిముండకున్ జత యొనర్చుట న్యాయ్యమ!, కాని, శాంతమూ
ర్తికి గడుసైనదానికిఁ, బతివ్రతకున్ బలుగాకివాని కో
డక ముడివెట్టు బ్రహ్మకు దృఢంబుగ నౌచితిమాట యున్నదే?

కడు నాపత్తున నుండి కావు మని మ్రొక్కన్ నిల్వ దోపించుఁ, బే
ర్వడగాఁ గొండలపాలు సేయు, దరిఁ జేరన్ బోడి గొట్టించుచుం
డెడుఁగా తిర్పతి వేంకటేశ్వరుఁడు! కానీ, యింత గావించినన్
జెడువాఁ డందురె? లక్ష్మి యున్నయెడ దేనిన్ గాని లెక్కింతురే?

నీకున్ గల్గిన శక్తి నాకుఁ గలదేనిన్ నేను నీరీతిగా
ఆకున్ బోఁకయు నంటకుండునటు సేయంజూతునా? యింతకున్
లోకంబందున నంటుకొన్న చెడుగుల్ వోకార్చి యత్యుత్తమ
ప్రాకట్యంబుగ మంచి యొండె నెలకొల్పన్ జూడనా? యీశ్వరా!
నీ దేవత్వము నా మనుష్యతయు రెంటిన్ బోల్చినన్ భేద మే
మో దీపింపదు; నీవు చేఁతనయి, నేనో చేఁతఁగాకుంటి హా
రా! దుర్మార్గ మణంపలేక; భళి! సర్వజ్ఞత్వ సర్వేశ్వర
త్వాదుల్ నీ కొనఁగూడి యేమి ఫలమయ్యా? యింక సర్వేశ్వరా!

---



# లేపాక్షిలో చివికిపోతున్న చిత్రశాల

శ్రీ హెచ్. వి. రామగోపాల్

ప్రస్తుత యుగపరిస్థితుల్లో భారతీయ కళా సంప్రదాయాన్ని అర్థం చేసుకున్న వారు చాలా తక్కువమంది. నిన్న మొన్నటి వరకూ భారతీయకళకు భారతీయులే తగిన ప్రోత్సాహం ఇయ్యని శోచనీయస్థితి వ్యాప్తమై ఉండేది. పాశ్చాత్యుల కృషి ఫలితంగా అజంతా, బాగ్, సిగ్రియా మొదలైన గుహాల వర్ణచిత్రాల విశిష్టత్వం వెల్లడయింది. ఇలా లోకానికి వెల్లడికాకుండా మారుమూలల ఎన్నో చిత్రరచనలతో నిండిన గుహాలూ, ఆలయాలూ ఇంకా ఉన్నాయి. అట్టివాటిలో లేపాక్షి వీరభద్రేశ్వరాలయం ఒకటి.

లేపాక్షి ఒక ఊరి పేరు. ఇది అనంతపురం జిల్లాలోని హిందూపురం రైల్వేస్టేషనుకు ఎనిమిదిమైళ్ళ దూరంలో ఉన్న ఒక చిన్న గ్రామం. ఈ గ్రామానికి లేపాక్షి అనే పేరు రావడంగురించి ఆ గ్రామంవారు ఒక పౌరాణికగాథ చెపుతారు. శ్రీరామచంద్రుడు సీతాదేవిని అన్వేషిస్తూ యీ ప్రాంతానికి వచ్చాడు. ఇక్కడే రెక్కలు తెగి పడిఉన్న జటాయువును చూశాడు. ఆ పక్షివల్ల రావణుని దుశ్చేష్టితం విని, "లే! పక్షీ"అని దానిని సంబోధించాడట. ఈ సంఘటన స్మృతిచిహ్నంగా యీ ప్రదేశానికి లేపక్షి అనే నామం అంకితమై అదే కాలక్రమాన లేపాక్షిగా పరిణమించింది.

ఏది ఎలా ఉన్నా, ప్రస్తుతం లేపాక్షి గ్రామం అంతా పెద్దపెద్ద రాళ్ళతోనూ, గుట్టలతోనూ నిండిఉంది. ఈ గ్రామంలో 'కూర్మశైలం' అనే ఒక పెద్ద బండరాతి మీద ఒక దేవాలయం ఉంది. ఈ ఆలయం అంతా విగ్రహాలు చెక్కబడిన శిలలతో నిర్మితమైంది. పౌరాణికంగా దీనిని 'పాపనాశేశ్వరాలయం' అనీ, చారిత్రకంగా 'వీరభద్రేశ్వరాలయం' అనీ, ఆధునికంగా 'దుర్గాలయం'అనీ అంటారు. ఇన్ని పేర్లతో వ్యవహరింపబడే యీ దేవాలయాన్నే చిత్రకారులూ, చరిత్రకారులూ 'లేపాక్షి దేవాలయం' అని పిలుస్తారు.

లేపాక్షీ ఆలయం చాలా పురాతనమైనది. విజయనగర సామ్రాజ్యం పతనోన్ముఖం అవుతూన్నదినాల్లో ఆ సామ్రాజ్యపు సేనానాయకులు ఇద్దరు—విరుపణ్ణ, వీరణ్ణ అనే అన్నదమ్ములు: ముఖ్యంగా విరుపణ్ణ—తమ యిష్టదైవమైన వీరభద్రుని యీ ఆలయంలో ప్రతిష్ఠించారు. ఆలయాన్ని బహుముఖాలుగా విస్తృతంచెయ్యడానికి విరుపణ్ణ ఎందరో నిపుణులైన చిత్రకారులనూ, శిల్పులనూ నియమించాడు. వీరభద్రుని గురించిన అనేకగాథలను కుడ్యాలపై చెక్కించాడు. ఆలయాని కొక కల్యాణ మంటపం కట్టిస్తూ, అది పూర్తికాకుండానే మరణించాడు.

ఆలయం ఇప్పుడు జీర్ణస్థితిలో ఉంది. స్థానికప్రజలూ, ప్రభుత్వమూ ఇప్పుడిప్పుడు కొంత శ్రద్ధతీసుకుని శిథిలమైన పురాతన శిల్పాన్ని సంరక్షిస్తున్నారు. ఈఆలయమందలి శిల్పాలూ, వర్ణచిత్రాలూ చాలా భావగర్భితంగా ఉంటాయి. ఇవి అజంతా, బాగ్ మొదలైన గుహాలలో ఉండే బౌద్ధమత చిత్రాలవలెకాకుండా, హిందూమతపురాణ గాథలను తెలియజేస్తాయి. ఈ శిల్పాలు చోళరాజుల కాలంనాటి వని చరిత్రజ్ఞుల అభిమతం.

ఆలయంలో ప్రవేశించిన తరవాత, గర్భాలయానికి ముందు, చుట్టూ బారులు తీర్చి అనేకభంగిమలతో చెక్కబడిన రాతిస్తంభాలు కప్పును మోస్తున్నాయి. ఆ స్తంభాలమధ్య లోపలి పైకప్పుభాగం వర్ణచిత్రాలతో నిండి నిబిడీకృతమై ఉంటుంది. కిరాతార్జునీయం, మాధవవర్మకథా మొదలైనవి వరసగా చిత్రింపబడ్డాయి. ఈ స్తంభాలమధ్య, అయిదారు అడుగులదూరం ఉండి పొడుగైన చదునుస్థలాలు నాలుగైదు బారులు తీర్చి చుట్టూ పైభాగంలో ఉన్నాయి. గర్భగుడిలోపలకూడా ఇలాటి చిత్రాలు ఎన్నో ఉన్నాయి. గర్భగుడిలోపలికప్పుమీద ౨౦ × ౩౦ అడుగుల వైశాల్యం కలిగిన ఒక పెద్ద చిత్రం ఉంది. విరుపణ్ణ, వీరణ్ణలు తమ కుటుంబాలతోసహా వీరభద్రేశ్వరస్వామికి జోహారు చేస్తున్నట్టు యీ చిత్రంలో ఉంది. ఇందులో వీరభద్రేశ్వరుని తెలిపే పటం ౧౫ అడుగులకు పైగా ఉన్నది. విరుపణ్ణ వీరణ్ణలను తెలిపే రూపాలు ఒక్కొక్కటీ ౧౦ అడుగులకుపైగా కలవు. వీటి చిత్రశైలీ, రేఖలలో మార్దవం, భావవ్యంజకతా సిద్ధహస్తులైన ఆ చిత్రకారుల విశిష్ట నైపుణ్యాన్ని చాటుతున్నాయి. ఉపరిభాగమున ఇంత పెద్ద వర్ణచిత్రాన్ని ఎలా చిత్రింపగలిగారో ఊహించనైనా లేము. అందలి స్త్రీలకట్టూ, జుట్టుముడీ ఇత్యాదులు ఆంధ్ర సాంప్రదాయాన్ని చాటుతున్నాయి. దుస్తులలో ప్రతిఒక్కటీ ఒక్కొకరకమైన ప్రక్రమం (design) కలిగిఉన్నాయి. ఈ చిత్రాలలో ప్రతితలపక్కభాగం అవతల ఉండే కన్ను ముందుకు చొచ్చుకునిఉండడం చూపిస్తుంది. ఇది యీచిత్రములందలి ముఖ్య విశేషం. ఇది జైనసంప్రదాయాన్ని సూచిస్తుంది. ప్రతి చిన్నస్థలాన్నీ వెలితిగా వదలకుండా, శిల్పులూ, చిత్రకారులూ భావపూరితమైన చిత్రాలతో నింపారు.

ఆలయ ప్రాకారాంతర్భాగంలో అసంపూర్తిగా వదిలేసిన ఒక కల్యాణ

మంటపం ఉంది. ఆ మంటప స్తంభాలమీద రకరకాల నృత్యభంగిమలూ, కొన్ని జంతువుల నైసర్గికవిన్యాసాలూ చెక్కి ఉన్నాయి. అందులో ఒక శిల్పం నన్ను మరీ మంత్రముగ్ధుణ్ణి చేసింది : ఒక లేడి వంగి తన వెనక కాలితో ముట్టెను గోక్కొంటున్నట్లుగా మలచిన శిల్పం. ఆ కాలపు శిల్పుల గాఢమైన ప్రకృతి పరిశీలనను అది వ్యక్తం చేస్తుంది.

గర్భాలయానికి ముందు ప్రాకారంలో, ఒకమూల ఉండే స్తంభంమీద వాస్తుపురుషుడూ, పద్మినీజాతి స్త్రీ అయిన అతని భార్యా—వీరి విగ్రహాలు చెక్కబడి ఉన్నాయి. ఒక్కొక్క విగ్రహంఎత్తు అయిదారు అడుగులు ఉంటుంది. అవి సృష్టించిన శిల్పి రూప, భేదప్రమాణాదులను అద్భుతంగా పాటించి అపరూపమైన లావణ్యాన్ని శిల్పంలో పొదగగలిగాడు. కల్యాణమంటపానికి ఎదురుగా, ఒక శివలింగాన్ని ఆచ్ఛాదిస్తూ 'సప్తముఖ' అనే సర్పం ఒకటి ఒకేరాతిలో చెక్కబడి ఉంది.

ఆలయానికి అనతిదూరంలో, 'బసవన్న' అనే పేరుతో ఏకశిలలో దొలచబడిన నందివిగ్రహం ఉంది. దీని ఎత్తు ౨౦ అడుగులు; పొడుగు 3౦ అడుగులు. భారతదేశంలోని నందివిగ్రహాలన్నిటిలోకీ ఇది పెద్దదని చరిత్రకారు లంటారు. శిల్పి పేరుకూడా బసవన్నఅనీ, ఆ పేరుతోనే యీ నందివిగ్రహంకూడా వ్యవహరింపబడుతోందనీ స్థానికకథ.

ఆధునిక చిత్రకారులకూ, శిల్పులకూ, కళాభిమానులకూ లేపాక్షి నిజంగా ఒక కళాక్షేత్రం అనవచ్చును. ఆనాటి ఆంధ్రశిల్పులూ, చిత్రకారులూ ఎటువంటి అపరూపమైన కళను సృష్టించగలిగారో, కాలాన్నీ, దేశాన్నీ అధిగమించగలిగిన కళాసౌందర్యాన్ని ఎలా సాధించగలిగారో లేపాక్షిఆలయం మనకు విస్పష్టంగా చెప్పగలుగుతోంది. అమరమూర్తులైన ఆ కళావేత్తల ఆశయాలూ, ఆదర్శాలూ ఒరవడిగా చేసుకుని ఇంకా మునుముందుకు సాగేందుకు ప్రయత్నించడం నేడు మన అందరి కర్తవ్యమూ.



# చమత్కార 'నక్షత్ర' చాటువు

శ్రీ
గొబ్బూరు
వెంకటానంద రాఘవరావు

ఈ క్రింది కందపద్య చాటువును నే నీమధ్య నొక మిత్రునివలన వింటిని. అందలి చమత్కారము హృద్యముగా నుండి మిక్కిలి జాలిగొలిపినది.

"నక్షత్రము గల చిన్నది
నక్షత్రము చేతబట్టి నక్షత్రప్రభున్
నక్షత్రమునకు రమ్మని
నక్షత్రము పైనవేసి నాథుని బిలిచెన్"

ఇందు రెండవ పాదములో నక్షత్రప్రభువు చంద్రుడు. చంద్రాంశమందు పుట్టిన భారతమహావీరుడు అభిమన్యుడు.

మహాభారతయుద్ధము జరుగుచున్నది. భీష్ముడు పది దినములు కౌరవసేనాధిపతిగా యుద్ధము చేసి శరతల్పగతుడైనాడు. పిమ్మట దుర్యోధనుడు ద్రోణాచార్యుని కౌరవసేనాధిపత్యమునకు పట్టము గట్టినాడు. ఇట్లు సేనాధిపత్య మిచ్చి తనను గౌరవించినందుకు మిక్కిలి ప్రీతుడై, ధనురాచార్యుడు దుర్యోధనుని నేదేని యొక వరము కోరు మిచ్చెదనని పలికినాడు. దుర్యోధనుడు శకుని మామతోను, కర్ణ దుశ్శాసనులతోను రహస్యముగా నాలోచించి "యుద్ధములో ధర్మరాజును జీవముతో పట్టి తెచ్చి ఈయవలెను. ఇదే మిమ్ములను నేను కోరు వరము" అని కోరెను.

ద్రోణుడు "నేను ధర్మరాజును జీవముతో బట్టి తెచ్చిన నీవు కత్తితో నరికి చంపుదువా?" అని ప్రశ్నించెను. దుర్యోధనుడు "అయ్యో! అలాగు నిరాయుధుని చంపుట యెందుకు? అక్కరలేదు. జూదపు పాచికలు చూడగానే ధర్మరాజునకు ఒడలు తెలియదు. ఉప్పొంగి యుక్తాయుక్తవివేక శూన్యుడైయుండగా మరొకమారు జూదమాడించి అరణ్యవాసమున కంపుదము. అపుడీ యుద్ధపు గొడవ చల్లారును. మరికొన్ని సంవత్సరముల కాలము శత్రుభీతి యనునది లేక యథేచ్ఛగా రాజ్యమేలుదము" అని ప్రత్యుత్తరమిచ్చెను.

ద్రోణు డీకపటోపాయమును, దుర్నీతపు టాలోచనను విని మిక్కిలి ఏవగించుకొనెను. ఇంకను పాండవుల నడవులపాలు చేయుటేనా యని మనస్సులో చాల సంకటపడెను. కాని అదేమియు పైకి తోపనియ్యక "సరే కాని, అర్జునుడు దగ్గరగా ఉన్నంత సేపు నేను ఏమీ చేయజాలను. అతని నవతలకు దూరముగా తీసికొనిపోయేయెడల ధర్మరాజును పట్టవచ్చును" అని ద్రోణుడు షరతు పెట్టెను. సంశప్తకులనే వీరులు అర్జునుని ముఖ్యశత్రులున్నారు. వారి నాశ్రయించి దుర్యోధనుడు వారిచేత నర్జునుని ప్రత్యేకయుద్ధమునకు ఆహ్వానింపించెను.

ద్రోణుని రెండవయుద్ధము నాడు అర్జునుడు తన్నాహ్వానించిన సంశప్తక వీరుల నోడించి భగదత్తుని యేనుగు పాండవసేనలను చిందరవందర చేయు వేళకు తిరిగివచ్చి యేనుగుతో భగదత్తుని చంపి కౌరవసైన్యమును చెల్లాచెదరు చేసెను.

మరునాడు ద్రోణుని మూడవనాటి యుద్ధము. జలగలవలె పట్టువిడువక మిడతల దండువలె తరుగు విరుగు లేని సంశప్తక యోధులను దుర్యోధనుడు ప్రత్యేకయుద్ధమునకు అర్జునునిపైకి బంపెను. ద్రోణాచార్యుడు పద్మవ్యూహము పన్నసై యున్నాడు. శిరశ్శిఖామణి అభిమన్యుడు యుద్ధమునకు బయలుదేరబోవు ఘట్టము.

ఎన్నడును లేని భీతి ఆనాడు అభిమన్యుని భార్య ఉత్తరకు మనస్సులో తోచెను.

ఇంగ్లీషులో చక్కని సామ్యమున్నది. "Com-irg events cast their shadows" రాబోవు అనిష్టముల నీడలు ముందే కనబడును. నాడదేమో ఉత్తర మనస్సు మనస్సులాగున లేదు. ప్రేమరసమును చిలుకు నభిమన్యు నాథుని మందస్మితసుందరవదన మింక తనకు కనబడు నేమోనని యొక శంక పొడమి ఆమెను పీడింప దొడగెను.

మహాయోధులు యుద్ధమునకు వెడలునపుడు వారి వీరపత్నులు జయముగోరి సేసలిచ్చి, నుదుట బొట్టు పెట్టి యుద్ధమున కనుచుట ఆచారము. ఉత్తర అభిమన్యు నాప్రకారము చేసి యుద్ధమున కనిచెనని ఈ చాటుపద్యముయొక్క అభిప్రాయము.

రెండటి పాదమున నక్షత్రము కల చిన్నది యనగా ఆ నక్షత్రనామము గల చిన్నది. ఉత్తర యొక్క నక్షత్రము పేరు. అభిమన్యుభార్యయైన విరటపుత్రిక పేరు ఉత్తర. ఆనక్షత్రము పేరుగల యువతి, ఉత్తర, నక్షత్రము చేతబట్టిన దని రెండవపాదము. ఆమె చేతిలో నున్నది కుంకుమబరణి. బరణి సంస్కృత భరణి శబ్దతద్భవము. నక్షత్రార్థములో అశ్విని తరువాతి నక్షత్రము భరణి. చంద్రాంశసంభూతుడైన ప్రాణనాథుడు అభిమన్యుడు. అతనితో నామె రహస్యము మాటలాడ దలచి, నక్షత్రము పైన వేసినది—అనగా చెయ్యి పైన వేసినదని యర్థము. చేతికి సంస్కృతపదము హస్తము. నక్షత్రార్థములో ఉత్తరఫల్గునితరువాతి నక్షత్రము హస్త. హస్త 'పాణినాం పంచ'-ఐదు వ్రేళ్ళతో కూడి కొన్న చేతివలె నుండు నక్షత్రసమూహము హస్త. అటువంటి చేతిని ప్రియునిమీద వేసి పిలిచినది — నక్షత్రమునకు రమ్మని. ఇక్కడ నక్షత్రమనగా మూల. శ్రవణనక్షత్రమునకు ముందున్నది మూల. ప్రియుని చెవిలో ఏకాంతము చెప్పుటకు ముందు మూలకు పోవలెను. కనుక మూలకు రమ్మని అభిమన్యుని పిలిచినది ఉత్తరసతి.

ఆదర్శప్రాయమైన యీ యుత్తరాభిమన్యు యువకదంపతుల కడసారి సమావేశ సూచక మగుట నీ పద్యము మిక్కిలి జాలిగొలుపుచున్నది. తంద్రుల చాటుపిల్లలు; యథార్థప్రేమపాశబద్ధు లీ పుణ్యదంపతులు. వారి ప్రేమవాహిని సవ్యముగా సాగిపోలేదు. వీరశిఖామణి అభిమన్యుడు పద్మవ్యూహమున వంచితుడై దుర్మరణము పాలైనాడు. అభిమన్యుమరణము ప్రపంచచరిత్రలోనే మిక్కిలి విషాదపూరితమైన ఘట్టము. దీనికి ప్రారంభ మీ చాటుపద్యము.

ఇందు నక్షత్రపదము సందర్భానుసారముగా ననేకార్థములు వచ్చునట్లు చమత్కారముగా రచించుటచే హృద్యము.



తల్లీ బిడ్డలు

రంగు కాగితాలను కత్తరించి, ఆముక్కలతో రూపకల్పనచేసి సిద్ధపరచిన ఒక త్రివర్ణ చిత్రానికి ఇది నకలు. దీని శిల్పి శివజ్ఞానం అనే ఒక పంచాదశాబ్దంబుల కుఱ్ఱవాడు.

# భూప్రదక్షిణము

— శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య —

అగ్రరాజ్యములగు రష్యా అమెరికాలమధ్య పరస్పరద్వేషములు వృద్ధియగుటయు, వారుభయులును ఆలోచించుచుండు ప్రతివిషయమునుగురించి అభిప్రాయభేదము లేర్పడుటయు, దీనిమూలమున మరియొక ప్రపంచయుద్ధము సంభవించునను భయము ప్రముఖులనేకులలో కలుగుటయు, ఐక్యరాజ్యముల సమితి యుద్ధము రాకుండ చేయగలదా అన్న సంశయము ప్రపంచమందు వ్యాపించుటయు మనము గమనించ తగియున్నవి.

## అగ్రరాజ్యములమధ్య పరస్పర ద్వేషము

రష్యా అమెరికాలమధ్య రెండవ ప్రపంచ యుద్ధము ముగియునాటికే—అనగా రెండు సంవత్సరముల క్రిందటనే—ద్వేషము ప్రారంభమయ్యెను. శత్రువులు ఓడిపోవుటవలన కలుగనున్న లాభమును పంచుకొను విషయమున ఈ ద్వేషము పుట్టెను. అప్పటి నుండి ఇది క్రమక్రమముగ వృద్ధిగాంచెను. ప్రపంచమందంతట తమ ఆధిక్యమును స్థాపించవలెనని అమెరికావారును, తమ ఆధిక్యమునే స్థాపించుకొనవలెనని రష్యావారును ఉద్దేశించుటయే దీనికి కారణము. ఒకే లక్ష్యమునకై బలవంతు లిద్దరు పోటీచేయుటమూలమున కలుగు ఫలిత మిట్టిదేకదా? "పిల్లికి చెలగాటము, ఎలుకకు ప్రాణసంకటము" అన్న సామెత ప్రకారము అగ్రరాజ్యములు రెండింటిమధ్య దినదినాభివృద్ధి గాంచుచుండు విరోధమూలమున ప్రపంచమంతయు కష్టనష్టములపాలు కావలసి వచ్చుచున్నది. రష్యాలో ఏమి జరుగుచున్నదో మనకు తెలియదు. అక్కడినుండి వార్తలు వచ్చుటయే దుస్సాధ్యము. ఆ దేశమున పత్రికా స్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము కొంచెముకూడ లేవు. విదేశములవా రచ్చటికి వెళ్లి స్వేచ్ఛగ ప్రయాణముచేసి దేశ పరిస్థితులను తెలుసుకొని వివరించుట వీలుకాని పని. గనుక రష్యా ప్రభుత్వమువారు ఎట్టి యుద్ధ సన్నాహములు చేయుచున్నారో మనకు తెలియదు. కాని అమెరికావారుమాత్రము యుద్ధసన్నాహములందు నిమగ్నులైయున్నారు. అటంబాంబులు తయారు చేయుచున్నారు. దక్షిణ అమెరికాలోని ఇరువది దేశముల ప్రతినిధులను బ్రెజిల్ దేశపు ప్రధాన పట్టణమందు సమావేశపరచి అమెరికా ఖండము నంతను శత్రుప్రమాదమునుండి రక్షించుటకు కావలసిన ఏర్పాటుల నన్నిటిని అందరు కలసి చేసుకొనునట్లు ఒక తీర్మానమును గతమాసపు మొదటివారమున గావించిరి. ఆ సభలో ట్రూమన్ (అమెరికా అధ్యక్షుడు) ఉపన్యసించుచు, "ప్రపంచములో శాంతి నెలకొల్పుటకు సైనికబలమే ప్రధాన సాధనము. అట్టి సాధనమును సమకూర్చుకొనుటకు యునైటెడ్ స్టేట్సు ప్రభుత్వము సర్వవిధముల ప్రయత్నించుచున్నది" అని చెప్పెను. ఆర్కిటిక్ మహాసముద్రపు ఉత్తర ప్రాంతములలో రక్షణస్థానములను ఏర్పరచుకొనుటకు ఈ నెలలో కొన్ని క్రొత్తప్రయత్నములను అమెరికావారు గావించిరి. కనడా దేశముమీదుగ అలాస్కాకు క్రొత్త రహదారులను ఏర్పాటు చేయుట, డెన్మార్కు దేశమును బలవంతపరచి దాని ఆధీనములో నుండు గ్రీన్‌లాండు ద్వీపములో రక్షణస్థావరములను నెలకొల్పుట, ఐస్‌లాండు ద్వీపములో క్రొత్త సైన్యములను సమకూర్చుకొనుట మొదలగునవి ఈ నెలలోనే జరిగెను. ఇంతటి యుద్ధ సన్నాహమును అమెరికావారు చేయుటచేత రష్యా

వారికి వారియందుగల విరోధము మరింత వృద్ధియగుటలో ఆశ్చర్య మేమికలదు?

## వివాదాంశములు

రషియా అమెరికాలమధ్య వివాదములు ప్రబలము లగుచున్నవని అనేకాంశముల మూలమున మనకు తెలియుచున్నది. (౧) ఇంతులో జపానుతో సంధిచేసుకొను అంశము మొదటిది. జపాను ఓడిపోయి రెండు సంవత్సరములైనను దాని భవిష్యత్తునుగురించిన సంధి ఇంకను జరుగలేదు. ఈ సంధి అనాలస్యముగ జరుగవలెననియు, కాలయాపన జరుగుటమూలమున జపానువారిని పోషించుభారము తమపై (అమెరికనులపై) పడుచున్నదనియు, సంధిషరత్తులను నిర్ణయించు సభలో జపానును ఓడించుటయందు పాల్గొనిన దేశములన్నిటికి ప్రాతినిధ్య ముండవలెననియు అమెరికావారి వాదము. రషియావా రీవిషయమై ఎట్టి ఉత్సాహమును చూపుటలేదు. జపానును పోషించు భారమును అనేక సంవత్సరములపర్యంతము అమెరికావారు వహించి నష్టపడవలెనని వారికోరిక. ఇదిగాక సంధిసభలో రషియా, చైనా, ఇంగ్లండు, అమెరికాదేశముల ప్రతినిధులు మాత్రమే ఉండవలెననియు, ఏదైన సలహాలు అవసరమైనప్పుడే ఇతరులతో సంప్రతించుట యుక్తమనియు రషియావారి వాదము. అగస్టు ఆఖరువారములోను, సెప్టెంబరు ప్రారంభమందును ఆస్ట్రేలియాలో దీనిని గురించి ఒక సభ జరిగెను. అందు బ్రిటిష్‌సామ్రాజ్యములోని డొమినియన్ల (ఇండియా, పాకిస్థాన్, బర్మాలతో సహా) ప్రతినిధులుమాత్రమే సమావేశమై ఈ విషయమునుగూర్చి చర్చించి అమెరికావారి అభిప్రాయముతో ఏకీభవించిరి. (౨) రెండవ వివాదాంశము కొరియా దేశపు భవిష్యత్తు. రెండవ ప్రపంచయుద్ధమునకు పూర్వము కొరియా దేశము జపానువారి అధీనములో నుండెను. యుద్ధానంతరము ఉత్తరభాగమును రషియావారును, దక్షిణభాగమును అమెరికా వారును వశపరచుకొని, ఈ రెండుసంవత్సరములుగ ఆ యా భాగములను పరిపాలించుచున్నారు. కాని రెండుదేశములవారు కొరియాను స్వతంత్రరాజ్యముగ చేయుటకు వాగ్దానము గావించిరి. కాని ఈ వాగ్దానమును చెల్లించువిషయములో తీవ్రమైన అభిప్రాయభేదములు ఏర్పడెను. రషియాపాలనలోని భాగమందు కమ్యూనిస్టుపక్షమునకు ప్రాబల్యము కలిగెను. దక్షిణభాగమందు ఇతరపక్షములకు ప్రాబల్య మున్నది. కమ్యూనిస్టుల అధికారము దేశమందంతట వ్యాపించగల దను నమ్మకము కుదిరినగాని తమ అధికారమును వదలుకొనుటకు రషియావారికి ఇష్టములేదు. అట్టి వ్యాప్తి ప్రమాదకరమనియు, అది జరుగదను నమ్మకము కలిగినగాని తమ అధికారమును వదలుకొనకూడదనియు అమెరికావారి తీర్మానము. ఈ విషయమై రెండు ప్రభుత్వములవారికి సెప్టెంబరులో ఉత్తరప్రత్యుత్తరము లనేకములు జరిగెనుగాని సామరస్యము కుదురలేదు. దీనిని గురించి ఐక్యరాజ్యసమితి మహాసభలో చర్చ జరుగవలెనని అమెరికావారు పట్టింపుతో ఉన్నారు. అది జరగకూడదని రషియావారి పట్టింపు. (3) పర్షియాలో చమురుగనులనుగురించికూడ సెప్టెంబరులో క్రొత్త వివాద మొకటి బయలుదేరెను. ఆదేశపు దక్షిణ భాగమందుండు చమురుగనులన్నియు అనేకసంవత్సరములుగ బ్రిటిష్‌వారి అధీనమందున్నవి. దానిమూలమున పెట్రోలు విషయమై వారికి గల కొరత తీరుటయేగాక అధికముగ వారు ఎక్కువలాభమును సంపాదించుచున్నారు. ఉత్తర పర్షియాలోకూడ గొప్ప చమురుగను లున్నవి. వానిని వశముచేసుకొనుటకు రషియావారు కొన్ని సంవత్సరములుగ ప్రయత్నము చేసి, తుదకు ౧౯౪౬ లో పర్షియా ప్రధానిని ఒత్తిడి చేసి, అందునిమిత్తమై ఒక ఒడంబడికను చేసుకొనిరి. కాని ఈ ఒడంబడిక అమలులోకి వచ్చుటకుపూర్వము పర్షియాలోని శాసనసభ దానిని ఆమోదించవలసి యున్నది. ఆ సభ ఈ సెప్టెంబరులో సమావేశమయ్యెను. ఒడంబడిక ఆమోదము వెంటనే జరగవలెనని రషియావారు ఒత్తిడిచేయసాగిరి. అట్టిది జరుగుట అమెరికావారికి ఇష్టములేదు. ఉత్తర పర్షియాలోని చమురు రషియన్లు వశముచేసుకొనకూడదని వారి అభిప్రాయము. అందుకై అమెరికావారు పర్షియా ప్రధానితో సంప్రతింపులు చేయుచున్నారు. ఇదికూడ రషియా అమెరికాలమధ్య ద్వేషము ప్రబలమగుటకు కారణమగుచున్నది. (౪) గ్రీసుదేశమునకు ఆర్థిక సహాయము చేసి, దానియందు అమెరికావారు తమ ప్రాబల్యమును ఇటీవల స్థాపించుకొనిరి. ఇది రషియావారి కెంతమాత్రము ఇష్టములేదు. అందుచేత వారు ఆదేశములోని కమ్యూనిస్టుపక్షమువారిని బలపరచుటకు నిశ్చయించుకొని గ్రీసు చుట్టుపట్ల నున్నట్టియు, రషియా పలుకుబడిలో ఉన్నట్టియు బల్గేరియా, యూగోస్లేవియా, ఆల్బేనియా ప్రభుత్వములద్వారా తమ ఉద్దేశమును నెరవేర్చుకొనుచున్నారు. కొన్ని నెలలుగ గ్రీసులోని కమ్యూనిస్టులకును, ప్రభుత్వమునకును యుద్ధము జరుగుచున్నది. కమ్యూనిస్టులకు పైదేశములవారు సహా

యము చేయుచున్నారని ఐక్యరాజ్యసమితివారేర్ప రచిన కమిటీవారు విచారణ గావించి ఋజావుచేసిరి. అట్టిది జరుగకుండ చేయుటకు భద్రతాసంఘమువారు చర్య తీసుకొనవలెనని అమెరికావారి వాదము. ఇరుగు పొరుగు రాజ్యములవారు కమ్యూనిస్టులకు ఎట్టి సహాయము చేయుచుండుట లేదనియు, గ్రీసు ప్రభుత్వము ధనికవర్గప్రభుత్వ మగుటచేతనే అచ్చట అల్లరులు ఎక్కువగ నున్నవనియు, అమెరికావారు ఆ ప్రభుత్వమునకు సహాయము చేయుటచేత నిజమైన ప్రజాపరిపాలన అచ్చట స్థాపించుటకు వీలులేకపోయిన దనియు, అమెరికావారు వారి సైన్యములను, ఆర్థిక సహాయమును ఉపసంహరించుకొనినయెడల గ్రీసులో శాంతి ఏర్పడు ననియు రష్యావారి వాదము. తాము ఉపసంహరించుకొనినయెడల కమ్యూనిస్టుల ప్రాబల్యము గ్రీసులో నాటుకొనుటయు, రష్యావారి పలుకుబడిలోనికి గ్రీసుదేశమున్ను, తూర్పు మెడిటరేనియన్ సముద్రమున్ను రాగలవనియు, అందుమూలమున దక్షిణ యూరపులో ప్రస్తుతము తమకు గల ప్రాబల్యము క్షీణించుననియు అమెరికావారి భయము ఈ విషయమై సెప్టెంబరులో భద్రతాసంఘమందు అనేక చర్చలు జరిగినవి కాని రష్యావారు అమెరికావారితో ఏకీభవించరైరి. ఈ వివాదముకూడ ఐక్యరాజ్యసమితి మహాసభలో చర్చకు రాగలదు.

## మార్షల్ ప్రణాళిక

మార్షల్ ప్రణాళిక ననుసరించి యూరపుఖండములోని దేశములకు ఎంతటి సహాయము కావలసి యుండునో నిర్ణయించుటకు ఆ ఖండములోని పదహారు దేశముల ప్రతినిధులు ప్యారిస్ నగరములో సమావేశమై వారి నివేదికను తయారుచేసి అమెరికా ప్రభుత్వమునకు పంపిరి. ఈ సమావేశములో స్పష్టపరచబడిన ప్రధాన విషయములు కొన్ని గమనించతగియున్నవి: (౧) ప్రతి దేశమందును పదార్థముల ఉత్పత్తి—ముఖ్యముగా ధాన్యములు, పంచదార, బంగాళాదుంపలు, పాలు, బొగ్గు, విద్యుచ్ఛక్తి, ఉక్కు—ఎక్కువ కావలసి యున్నది. అన్నిటికి అమెరికాపై ఆధారపడుట మంచిది కాదు. తాము ఉత్పత్తిచేయగల పదార్థములను ఎంతవరకు వృద్ధిచేయవచ్చునో అంతవరకు తాము కష్టపడి పనిచేసి, తక్కిన అవసరములు తీరుటకై అమెరికా సహాయమును కోరుటయే మర్యాద. (౨) ౧౯౫౧ లోపల—అనగా రాబోవు నాలుగుసంవత్సరములలో—ఈ ౧౬ దేశములవారికి అమెరికావారు చేయవలసిన సహాయము ౯౫,౪౬౦,౦౦౦,౦౦౦ రూపాయలు. ౯౫౪౬ కోట్ల రూపాయల విలువ గల యంత్రములు, ఇతరపదార్థములు అమెరికానుండి యూరపుదేశములలోనికి రావలసియున్నది. ఇంతటి సహాయము చేయుటకు అమెరికావారు సిద్ధపడినగాని యూరపువారి కష్టములు నివారణకాజాలవు. (౩) ఈ మొత్తములో ౧౨౦౦ కోట్ల రూపాయలు అంతర్జాతీయ బ్యాంకువారు అప్పు ఇచ్చుటకు వీలగును.

## ఐక్యరాజ్యములసమితి మహాసభ

సెప్టెంబరులో ఐక్యరాజ్యముల సమితి మహాసభ (United Nations General Assembly) న్యూయార్కులో సమావేశమయ్యెను. మనదేశపు ప్రతినిధులు కూడ విజయలక్ష్మి పండిట్ నాయకత్వమున సభకు వెళ్ళియున్నారు. ఈ సమితిలో ప్రపంచమందలి రాజ్యములలో ౫౮ రాజ్యములు సభ్యత్వము వహించియున్నవనియు, యుద్ధములు రాకుండ చేయుటయే దీని ఉద్దేశమనియు అందరికి తెలిసిన విషయమే. కాని ఈ మహాసభ సంవత్సరమున కొకపర్యాయము సమావేశమగుచుండును. రాజ్యముల మధ్య సంభవించు వివాదములను వెంటవెంటనే పరిష్కరించు ఉద్దేశముతో ౧౧ సభ్యులు గల భద్రతాసంఘము దీని కొక అంగము. ఈ సంఘము సంవత్సరము పొడుగున దినదినము సమావేశమగుచుండును. అందుచేత మహాసభకంటె దీనికే ఎక్కువ ప్రాధాన్యము.

కాని ఈ సంఘము గత సంవత్సరములో ఏ వివాదమును పరిష్కరించలేకపోయెను. దీనికి ఒక ప్రబల కారణమున్నది. ఇందులోని ౧౧ సభ్యులలో అగ్రరాజ్యము లనబడు అయిదింటికి—రష్యా, అమెరికా, చైనా, ఇంగ్లండు, ఫ్రాన్సు — శాశ్వత సభ్యత్వము కలదు. ఈ అయిదు దేశములవారు ఏకగ్రీవముగ ఆమోదించినగాని ఏవిషయమును తీర్మానించుటకు వీలులేదు. వీరిలో ఎవరయినను ఒకరు కాదన్నమాత్రముచేత తక్కిన పదిమంది ఆవిషయమును ఆమోదించినను వారి ఆమోదమునకు విలువలేదు. ఈ "కాదు" అను చెప్పు అధికారమునకే వీటో అధికారమని పేరు. అయిదు అగ్రరాజ్యములవారు ఏకీభావముతో పని చేయుట వాంఛనీయమే. కాని అట్టి ఏకీభావము కుదురుట సాధ్యము కాలేదు రష్యాకును, అమెరికాకును మధ్య తీవ్రతర మనస్పర్ధలు ఏర్పడుటచేత అమెరికావారు ప్రతిపాదించిన తీర్మానము నొక్కొక్కదానిని ఆక్షేపించి ఎదుర్కొనుటయే రష్యావారికి మామూలయ్యెను. స్వల్ప విషయములలో కూడ వారు వీటో అధికారమును విని

యోగించుటచేత వాదోపవాదములు తీవ్రముగ జరుగుటయేగాని ఫలితముమాత్రము ఏమియు ఉంకటలేదు.

## పాలెస్టయిన్ సమస్య

ఈ మహాసభవారు పరిష్కరించవలసిన ప్రధాన సమస్యలలో పాలెస్టయిన్ సమస్య ఒకటి. ఈ సమస్య యొక్క స్వభావము అందరికిని తెలిసినదే. మొదటి ప్రపంచయుద్ధమునకుపూర్వము ఇది టర్కీ సామ్రాజ్యములో ఒక రాష్ట్రముగ నుండెను. ఆ యుద్ధములో టర్కీ ఓడుటవలన, అది బ్రిటిష్‌వారి ధర్మకర్తృత్వ పాలనలోనికి వచ్చెను. అప్పుడందులో నూటికి తొంభై మంది అరబ్బులు, తక్కిన పదిమంది యూదులు ఉండిరి. కాని ధర్మకర్తృత్వవిధానపు షరత్తులలో విశేషముగ నుండు యూదులు ఈ రాష్ట్రములోనికి కలసవచ్చి స్థిరనివాస మేర్పరచుకొనవచ్చు ననెడిది ఒకటి. దానిననుసరించి, యూరపుఖండమందలి కైస్తవరాజ్యములలోని ప్రభుత్వములు కొన్ని పెట్టుచుండిన బాధల నోర్వలేని యూదు లనేకులు పాలెస్టయినుకు (౩౦౦౦ సంవత్సరములకు పూర్వము ఇది యూదుల దేశము) రాసాగిరి. క్రమక్రమముగ వీరి సంఖ్య హెచ్చెను. తుదకు రెండవ ప్రపంచయుద్ధము నాటికి నూటికి ముప్పైమంది యూదు లేర్పడిరి. అరబ్బుల కిది ఇష్టములేదు. యూదులు మరి రాకూడదని వారు వాదించి తుదకు బ్రిటిష్‌వారిపై తిరగబడిరి. అప్పటినుండి కలసవచ్చు యూదుల సంఖ్యను బ్రిటిష్‌వారు తగ్గించిరి. కాని యూదు లిందు కంగీకరించక, చట్టవిరుద్ధముగను, రహస్యముగను దేశములోనికి రాసాగిరి. వారి సంఖ్య తమ సంఖ్యకంటె హెచ్చునవనియు, దాని ఫలితముగ అరబ్బుల రాష్ట్రమైన పాలెస్టయిన్ యూదుల రాష్ట్రముగ మారిపోవు ననియు అరబ్బులు భయపడిరి. ఈ రెండు జాతులమధ్య విరోధ మెక్కువయ్యెను. ఈ విరోధమును తీర్చుటకు బ్రిటిష్‌వారికి ఉపాయ మేమియు తోచక, ఉపాయమును సూచించవలసిన దని ఐక్యరాజ్యసమితిని కోరిరి. అప్పుడు సమితివా రిందుకై ఒక ప్రత్యేకసంఘమును ఏర్పాటుచేసిరి. మూడుమాసములక్రిందట ఈ సంఘమువారు పాలెస్టయినుకు వెళ్లి, విచారణచేసి ఒక నివేదికను సమర్పించిరి. కాని సంఘసభ్యు లందరు ఆ నివేదికను ఏకగ్రీవముగ ఆమోదించలేదు. పాలెస్టయిన్, దేశమును రెండు రాజ్యములుగ విభజించవలెననియు, ఒకరాజ్యము యూదుల అధీనమందును, మరియొకటి అరబ్బుల అధీనమందును ఉండవలె ననియు అధికసంఖ్యాకులు సిఫారసుచేసిరి. అల్పసంఖ్యాకులు వేరొక సిఫారసు చేసియున్నారు. ఈ సిఫారసులు ప్రస్తుతము న్యూయార్కులో సమావేశమైన సమితి మహాసభలో చర్చకు వచ్చియున్నవి.

పాలెస్టయినును పాలించుట తమ కిష్టములే దనియు, అందులో తా మిదివరకు ఉంచిన సైన్యములను ఉపసంహరించుకొనెద మనియు, అరబ్బీలు, యూదులు (ఉభయులు) సమ్మతించని విధానమును ఆచరణలో పెట్టుట తమ కిష్టములే దనియు బ్రిటిష్‌వారు స్పష్టపరచిరి. దేశవిభజనకు తా మెన్నటికి అంగీకరించ మని అరబ్బులు చెప్పుచున్నారు. దేశవిభజన కావలె నని యూదులు వాదించుచున్నారు. ఇంతకు, యూదులలో అధికసంఖ్యాకులు పరాయిదేశములందుండి వచ్చినవారనియు, పాలెస్టయినులో పౌరులుగ నుండుటకు వారికి హక్కులే దనియు, అనాదిగ అచ్చట నుండిన ౧౦, ౧౫ వేలమంది యూదులుమాత్రమే అట్టి హక్కు కలవా రనియు అరబ్బులవాదము. ఇప్పుడా దేశమందు సుమారు ౬౦౦,౦౦౦ యూదులు, ౧,౨౦౦,౦౦౦ అరబ్బులు ఉన్నారు. దేశము చిన్నదే. కాని చుట్టుపట్ల నున్న అరబ్బీరాజ్యము లన్నియు—అనగా ఈజిప్టు, ఇరాక్, సిరియా, లెబనన్ మొదలైనవి—పాలెస్టయిన్ అరబ్బులకు సహాయముగ నున్నవి. వారు గొప్ప సైన్యములను తయారుచేసి, తమ యుద్దేశమును నెరవేర్చుటకు యుద్ధముచేయు సిద్ధపడియున్నారు. సమితివారు అరబ్బుల ఉద్దేశమునకు వ్యతిరిక్తముగ తీర్మానము గావించినయెడల, యుద్ధము మూలమునగాని దానిని ఆచరణలో పెట్టుటకు వీలుండదు. గనుక ఇది చాల క్లిష్టమైన సమస్య. "ముందు వెళ్లితే నుయ్యి; వెనుకకు వెళ్లితే గొయ్యి" అనే మోస్తరుగా ఉన్నది. ఉభయులకు అంగీకారమైన విధానము గోచరించలేదు. అరబ్బులకు అంగీకారముకాని తీర్మానము చేసి, దానిని అమలుచేయనియెడల సమితిప్రతిష్ఠకు మరింత భంగము కలుగును.

ఈజిప్టునుంచి బ్రిటిష్ సైన్యములు ఉపసంహరింపబడవలె నను విషయమై ఈజిప్టుప్రభుత్వమువారు ఈ మధ్య భద్రతాసంఘముఎదుట బ్రిటిష్‌వారిపై ఫిర్యాదు చేసిరి. ఇది ఆ సంఘములో చర్చకు వచ్చెను. కాని దానివలన ఫలిత మేమియు లేకపోయెను. అరబ్బీరాజ్యములలో అగ్రగణ్యమైన దని చెప్పదగు ఈజిప్టు చేసిన ఫిర్యాదును భద్రతాసంఘమువారు న్యాయరీతిగ పరిష్కారము చేయక, మూకీభావము వహించినందుకు ఆ సంఘముమీదను, సమితిమీదను ఈజిప్టు ప్రభుత్వమువారు క్రోధము వహించియున్నారు. పాలెస్టయిన్ విషయ

ములో అరబ్బీరాజ్యము లన్నియు కలిసి పనిచేయ సిద్ధపడుట కిది యొక హేతువు.

## భారతఖండము

సెప్టెంబరులో భరతఖండ పరిస్థితులు విషాదకరములుగనే యుండెను. పాకిస్థాన్ వాదమును లేవదీసిన లీగువారి ద్వేషప్రచారమను విషబీజము మహావృక్షమై పంజాబునందును, వాయవ్య సరిహద్దురాష్ట్రమందును, క్వెట్టా, సింధురాష్ట్రములందును, దాని శాఖలను వ్యాపించుకొన్నది. పశ్చిమ పంజాబులోని హిందువులు, సిక్కులు అనుభవించినట్టియు, అనుభవించుచున్నట్టియు బాధలకు అంతము లేకున్నది. దీనికి జవాబుగా తూర్పుపంజాబు, ఢిల్లీలలోని మహమ్మదీయులు అనేకబాధలు పడవలసివచ్చినది. మొదటిలో కలకత్తా నగరమందు ఇట్టి విపరీతములు తలయెత్తినందున గాంధీగారు ఉపవాసవ్రతము పూనిరి. దానికి ఫలితముగ అచ్చట శాంతి నెలకొనెను. అటుపై వారు ఢిల్లీకి ప్రయాణమై అచ్చటి అల్పసంఖ్యాకులుగ నుండు మహమ్మదీయుల రక్షణకై పాటుబడసాగిరి. దానికి ఫలితముగ అచ్చటకూడ శాంతి నెలకొనెను. కాని పంజాబులో మాత్రము మంట లింకను చల్లారలేదు. వాయవ్యసరిహద్దురాష్ట్రములో హిందువులు, సిక్కులు ప్రాణములను పిడికిళ్ళలో పెట్టుకొనియున్నారు. సింధురాష్ట్రమందుండి వేనకువేల హిందువులు బొంబాయికి, ఇతర రాష్ట్రములకు పారిపోవలసివచ్చెను. పాకిస్థానములో అల్పసంఖ్యాకులుగ నుండు హిందువులు, సిక్కులు పడవలసివచ్చిన బాధలను వివరించుటకు కూడ సాధ్యముకాదు. ఆ వివరణము అవసరముకూడ లేదు. దానినిగురించి మనము గ్రహింపవలసిన విషయము లేవో తెలుసుకొనుట ఎక్కువ అవసరము.

(౧) ఈ దురంతము లన్నిటికి పాకిస్థాన్ వాదమే కారణము. లీగువారు మహమ్మదీయులు వేరనియు హిందువులు వేరనియు, ఈ రెండుజాతులమధ్య సోదరభావము కుదుర దనియు, కుదురకూడ దనియు ఏడెనిమిది సంవత్సరముల కాలము తీవ్రప్రచారము గావించి పాకిస్థానమను ప్రత్యేకరాజ్యమును స్థాపించుకొనిరి. పాకిస్థానములో మహమ్మదీయులు తప్ప తక్కినవారెవ్వరును ఉండకూడ దని వారి అభిమతము. అట్లు చేసినగాని హిందువులు, సిక్కులు తరతరములుగ అనుభవించుచుండు ధనధాన్యములు, భూములు, ఇతరములగు ఆస్తులు మహమ్మదీయుల స్వాధీనము కాజాలవు. లక్షలకొలది హిందువులను, సిక్కులను చంపి, ప్రాణములతో నున్న మిగతవారిని ఇండియాలోకి తరిమివేసి, స్త్రీలను అపహరించుటకుకూడ ఇదియే కారణము. పాకిస్థానములో హిందువులు, సిక్కులు ఉండుట ఎన్నటికిని క్షేమముకాదు.

(౨) ఇండియాలో మాత్రము మహమ్మదీయులు ఉండవలసిన దనియే లీగువారి ఉద్దేశము. వారు ఇండియాను వదలి, పాకిస్థానములోకి వచ్చి స్థిరనివాసములను ఏర్పరచుకొనుట పాకిస్థాన్ ప్రభుత్వమునకు ఇష్టములేదు. ఇండియా ప్రభుత్వపు కష్టములు హెచ్చుకావలె ననియు, ఇండియాలోని మహమ్మదీయులద్వారా అది సులభముగ జరుగగల దనియు, ఎప్పుడైన ఇండియా పాకిస్థానముల మధ్య యుద్ధము జరిగినయెడల ఇండియాలోని మహమ్మదీయులు పాకిస్థానమునకు సహాయముచేయగల రనియు వారి విశ్వాసము. కనుక అల్పసంఖ్యాకుల సమస్య ఉండరాదు. మనముమాత్రము శాశ్వతముగ దానిమూలమున బాధపడవలసినదే!

(౩) గాంధీగారి ప్రయత్నము లన్నియు హిందువులు అధికసంఖ్యాకులుగాను, మహమ్మదీయులు అల్పసంఖ్యాకులుగాను ఉండునట్టి కలకత్తా, బీహారు, ఢిల్లీలయందుమాత్రమే ఫలించెను. హిందువులమూలమున మహమ్మదీయులకు బాధ కలుగకుండ ఉండుటకై అవి ఉపకరించెనేగాని, మహమ్మదీయులు పెట్టు బాధనుండి హిందువులను రక్షించుటలో అవి ఇంకను ఉపకరించలేదు. పాకిస్థానములోని మహమ్మదీయుల హృదయములలో గాంధీగారిసందేశము మార్పుకలిగించజాల దను సంశయము కలుగుచున్నది. ఖిలాఫత్ ఉద్యమపురోజులలో హిందూమహమ్మదీయ ఐక్యముకలిగినదిగాని, అది యెంతకాల ముండగలిగెను ?

(౪) సెప్టెంబరులో పంజాబులో హిందువులు, సిక్కులు అనుభవించిన బాధలకు పాకిస్థాన్ ప్రభుత్వమువారు, పాకిస్థానములోని సివిల్ మిలిటరీ ఉద్యోగస్థులు, పోలీసులు, ముస్లిం జాతీయసేవాదళము కారణభూతులని స్పష్టమగుచున్నది. పోలీసులు, సైనికులు స్వహస్తములతో వేలకొలది హిందువులను, సిక్కులను చంపుట రూఢిఅయినది.

(౫) ఈ మారణహోమములో బ్రిటిష్ అధికారులు పక్షపాతులై, పాకిస్థానములోని మహమ్మదీయుల పక్షము వహించి, ఇచ్చటి హిందువులను, సిక్కులను చంపుటయందును, బాధించుటయందును పాల్గొనిరి.

సైన్యము లింకను విడదీయబడక పోవుట, సైన్యము లన్నిటియందును బ్రిటిషు ఉద్యోగస్థులే ఇంకను అధికారమం దుండుట బహుప్రమాదకర మని స్పష్ట మగుచున్నది. ఇది ఒక పంజాబులో మాత్రమే కాదు, మధ్య పరగణాలలోని జబ్బల్‌పూరు ఆయుధాగారములో ఉద్యోగమందున్న బ్రిటిష్ అధికారులు, మహమ్మదీయ అధికారులు లక్షలకొలది ఆయుధములను ఇటీవల రహస్యముగ పాకిస్థానమునకు, హైదరాబాదునకు పంపుటకు ప్రయత్నము చేసినమాట ఇప్పుడిప్పుడే బహిరంగ మగుచున్నది.

(౬) కాందిశీకుల సమస్యకంతకు పాకిస్థాన్ ప్రభుత్వము కారణ మని మన నాయకులకు తెలియక పోలేదు. ఈ విషయమై పాకిస్థానముతో యుద్ధము చేయుటకూడ అవసరమని వారు గ్రహించియున్నారు. కాని తూర్పుపంజాబునందును, ఢిల్లీయందును హిందువులు, సిక్కులు గావించిన అపచారముల కారణమున మన నాయకులు ఏమి చేయుటకును తోచకుండ ఉన్నారు. కొంతకాలము మన రాజ్యములో శాంతి ఏర్పడినయెడల పాకిస్థానముపై తగుచర్యను తీసుకొనుటకు వారు సిద్ధముగ నున్నారు. కనుక దేశమందు శాంతి స్థాపనము అత్యవసరము.

### ‘మొగుణ్ణి కొట్టి మొర బెట్టుకొను’ పాకిస్థాన్

దురంతము లన్నిటికి కారణభూతమైన పాకిస్థాన్ ప్రభుత్వమువారు మొగుణ్ణి కొట్టి మొరబెట్టుకొను గయ్యాళివలె ప్రవర్తించుటలో ఆశ్చర్యము లేదు. పాకిస్థాన్ తరఫున ఐక్యరాజ్యసమితికి ప్రతినిధిగ వెళ్ళిన జఫరుల్లాఖాన్ ఇండియాలోని మహమ్మదీయుల రక్షణకై ఇండియా ప్రభుత్వము వారు ఎట్టి ప్రయత్నములను చేయుటలే దనియు, అంతేగాక వారిని బాధించుచున్నారనియు లేనిపోని నిందను ప్రభుత్వముపై మోపుటకు సాహసించెను. ఇట్టి ఉద్దేశముతోనే పాకిస్థాన్ ప్రభుత్వమువారు అల్పసంఖ్యాకుల సమస్యాపరిష్కారములో బ్రిటన్, తక్కిన డొమినియనులు జోక్యము కలుగ జేసుకొని, తగిన సహాయము చేయవలె నని కోరి యున్నది. కుటుంబకలహములను నివారించుటకయి ఇతరుల సహాయము కోరటకంటె అగౌరవమగు మార్గము వేరులేదు. మొదటినుండియు బ్రిటిష్‌వారి సహాయముననే లీగువారు పాకిస్థానమును స్థాపించుకొనిరి. దానిని నిలబెట్టుకొనుటకు అట్టి సహాయమే అవసరము. వారి సహాయముతో ఇండియాయొక్క స్వాతంత్ర్యమునుకూడ నాశము చేయుటకు వారు వెనుదీయరు. బ్రిటిషువారుగాని, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా మొదలైన డొమినియనులుగాని ఇండియాకు సంబంధించిన అల్పసంఖ్యాకుల వ్యవహారములలో ఎట్టి జోక్యము కలిగించుకొనరా దని నెహ్రూ స్పష్టపరచినట్లు తెలియుచున్నది. ఇదియే గౌరవకరమైన మార్గము.

### సంస్థానములు

హైదరాబాదు, మైసూరు సంస్థానములలో సత్యాగ్రహోద్యమము జరుగుచున్నది. సత్యాగ్రహులను అణచుటకై ఈ ప్రభుత్వములవారు ఉపయోగించుచుండు దౌర్జన్యవిధానము రాక్షసరూపమును ధరించుచున్నది. ముఖ్యముగా మైసూరు పరిస్థితులు విచారకరములుగ నున్నవి. మహారాజుకు స్వేచ్ఛ అన్నది లేనట్లు కనబడుచున్నది. అంతఃపురములో అతడు బంధింపబడియున్నాడు. కీలుబొమ్మవలె అతనిని దివాను ఆడించుచున్నాడు. పోలీసు దళములలో మహమ్మదీయులను ఎక్కువగ చేర్చి, సత్యాగ్రహుల బాధలను వృద్ధిచేయుచున్నాడు. హిందూరాజ్యములో హిందూదివాను ఈ విధముగ ప్రవర్తించుట సిగ్గుచేటు! సత్యాగ్రహోద్యమమును స్తంభింపజేయుటకు కొన్నిరోజుల క్రిందట మహారాజు ఒక రాజ్యాంగ ప్రణాళికను ప్రకటించెను. కాని దానిలో సూచించిన సంస్కరణములు ఇప్పటి పరిస్థితులకు అనుగుణములు కావు. ప్రజాప్రభుత్వవిధానమునకివి ఎంతో దూరమందున్నవి. కనుక సత్యాగ్రహము ఇంకను జరుగవలసియే ఉన్నది. తిరువాన్కూరు మహారాజుయొక్క ఔదార్యము మైసూరు మహారాజుకు లేకపోవుట చింతించతగిన విషయము. దివాన్ రామస్వామి మొదలియారును ఉద్యోగమునుండి తొలగించవలెను. ప్రజామోదము గలవానిని దివానుగా నియమించుకొని, ప్రజాప్రతినిధులతో కూడిన రాజ్యాంగ పరిషత్తును సమావేశపరచవలసియున్నది. అది జరుగువరకు సత్యాగ్రహోద్యమము సాగుచునేయుండును.

హైదరాబాదు సంస్థానములోని పరిస్థితులు ఇంతకంటె క్లిష్టములైనవి. ప్రభువు మహమ్మదీయుడును, ప్రజలలో అధిక సంఖ్యాకులు హిందువులును అగుట ఈ క్లిష్టత్వమునకు కారణము. ఇచ్చటనుండు మహమ్మదీయులలో ఐకమత్య మెక్కువ. వారిలో అందరును లీగు అభిమానులు. వారెట్లు చెప్పిన అట్లే నైజాం ప్రవర్తించుచుండును. నైజాంవశమందు గొప్ప సైన్యమున్నది. అది మహమ్మదీయ సైన్యము. ఆయుధసేకరణ ఈమధ్య విస్తారముగ జరిగినది. మహమ్మదీయులతో

నిండిన పోలీసు సైనికదళములే గాక సామాన్య మహమ్మదీయులుకూడ ఆయుధోపేతులై ఉన్నారు. ప్రభుత్వమునకు సంబంధించిన లారీలు, ట్రక్కులు అల్లర్లు లేవదీయు మహమ్మదీయ గూండాల వశమందు ఉన్నట్లుకూడ తెలియుచున్నది. నిరాయుధులగు హిందువులు సత్యాగ్రహములో పాల్గొనుచున్నారు. ఆయుధోపేతు లయినట్టియు, నిరాయుధులను హత్య చేయుటయందును, బాధించుటయందును ముందువెనుక లాలోచించనట్టియు వారిని సత్యాగ్రహము ద్వారా ఎదుర్కొని ఉద్యమమును జయప్రదముగ సాగించుట సాధ్యమగు పనియా అను సంశయము కలుగుచున్నది. ఇండియా ప్రభుత్వము వారి సహాయము లేక ఉద్యమము కొనసాగజాలదు. కాని కాందిశీకుల సమస్య పరిష్కారమై ఉత్తర ఇండియాలోని పరిస్థితులు చక్కబడునరకు ఇండియా ప్రభుత్వము వారు హైదరాబాదు వ్యవహారములలో ఎక్కువ జోక్యము కలిగించుకొన జాలరు. ఇట్టి పరిస్థితులలో సత్యాగ్రహోద్యమము కొనసాగించుట అవసరమా అన్న విషయమును నాయకులు ఆలోచించవలసి ఉన్నది.

జూనగడ్ సంస్థానము పశ్చిమ ఇండియాలో కథియవారునందుండు ఒక చిన్న సంస్థానము. దీనిని మహమ్మదీయనవాబు పాలించుచున్నాడు. కాని ఇందులోని ప్రజలలో నూటికి ౯౫ మంది హిందువులు. కథియవారులోనుండు తక్కిన ౨౬౦ సంస్థానములు ఇండియాలో చేరినవి. కాని ఈ జూనగడ్ సంస్థానము పాకిస్థానములో చేరినది. భూగోళరీత్యా దీనికిని, పాకిస్థానమునకును ఎట్టి సంబంధము లేదు. పాకిస్థానము దీనికి ఎంతో దూరముందున్నది. ఇండియాను ఆనుకొని ఉండు సంస్థానములు ఇండియాలో చేరుటయు, పాకిస్థానును ఆనుకొని ఉండునవి పాకిస్థానములో చేరుటయు మంచి పద్ధతి యని బ్రిటిషువారు కూడ సూచించి యుండిరి. కాని దీనికి విరుద్ధముగ జూనగడ్ పాకిస్థానములో చేరినది. ఇది ప్రజల కెంతమాత్రము ఇష్టములేదు. తక్కిన సంస్థానములకు కూడ ఇష్టములేదు. దీనిమూలమున ఇండియాకు అనేకచిక్కులు సంభవించనున్నవి. జూనగడ్‌లో అల్లరులు జరుగవనియు, ప్రజలు నవాబుపై తిరుగబడుదురనియు, అట్టి తిరుగుబాటును అణచుటకు సైన్యములు అవసరము లనియు పాకిస్థాన్ వారు కొంత సైన్యమును జూనగడ్‌కు పంపియున్నారు. దీనిమూలమున ఇతర సంస్థానములకు ప్రమాదము కలుగునేమో యని మన ప్రభుత్వమువారుకూడ కథియవారుకు కొన్ని సైన్యములు పంపవలసివచ్చినది. జూనగడ్ ప్రజలు కొందరు నవాబుప్రభుత్వమును అంగీకరించక, ప్రత్యేక తాత్కాలిక ప్రభుత్వమును ఏర్పాటుచేసుకొని, నవాబుపై తిరుగుబాటుచేయ నిశ్చయించుకొని యున్నారు. ఈ తాత్కాలిక ప్రభుత్వసభ్యులు వారి ఏర్పాటుల నన్నిటిని కథియవారులోని ఇతర సంస్థానములనుండి చేసుకొనుచున్నారు. వీటి అన్నిటిమూలమున పాకిస్థాన్-ఇండియాలమధ్య వైషమ్య మధికమై యుద్ధరూపము ధరించునా అన్న సంశయము కలుగుచున్నది. పాకిస్థాన్ చేయుచుండు కుట్రలు విపరీతము లగుచున్నవి. వీటి నన్నిటిని ఎదుర్కొనుటకు కావలసినంత సైనికబలము ఇండియా సమకూర్చుకొనినగాని ఏపని చేయుటకును వీలుండదు. శత్రువును సాధించుటకు సైనికబలము, సామము మాత్రమే ఉపాయమని తలచుట పొరబాటు. రాజకీయ రంగమందు సామముతోపాటు దాన, భేద, దండోపాయములనుగూడ ప్రయోగించవలసి యున్నది.

## చెన్నరాష్ట్రము : ఆంధ్ర రాజకీయసభ

ఆంధ్రరాష్ట్ర రాజకీయసభ చెన్నపట్టణములో జయప్రదముగ జరిగెను. వివిధవిషయములగురించి తీర్మానము లనేకములు చేయబడెను. ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునుగురించికూడ సభవారొక తీర్మానము గావించిరి. కాని ఈ సందర్భములో ఒక విషయము ఆలోచించవలసియున్నది. రాజకీయరంగములో ఏపనిగాని తీర్మానముల మూలమున మాత్రమే సాధించుటకు వీలులేదు. ప్రజలలో దానినిగురించి ఎక్కువ ఆందోళన ఉండవలెను. అధికారమందుండువారు ఎవరైనను ఏదో ఒత్తిడి చేసినపుడు లొంగదరుగాని తీర్మానములకు లొంగరు. రాజ్యాంగపరిషత్తుతోగాని, క్రొత్త రాజ్యాంగ విధానముతోగాని జోక్యములేక, గవర్నరు జనరలుయొక్క ఆర్డర్-ఇన్-కౌన్సిల్ ద్వారా ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగవచ్చుననికూడ నాయకులు తెలియజేసిరి. కాని ఈ ఆర్డరుమాత్రము ఆందోళన, ఒత్తిడి లేక చేయబడునా? నాయకు లెవ్వరు ఈ పనికి పూనుకొనునట్లగుపడుటలేదు. ఈ పనికి పూనుకొనినవారు కొందరున్నారుకాని ఆంధ్రులు వారిని నాయకులుగా అంగీకరించుటలేదు. అందుచేత రాష్ట్రనిర్మాణము జరుగుటకు కొన్ని సంవత్సరములు పట్టునట్లగుపడుచున్నది.

## ఆ హా ర స మ స్య

ఈ నెలలో జరిగిన రాష్ట్రశాసనసభయందలి చర్చ లన్నిటిలో ఆహారసమస్యను గురించిన చర్చయే ప్రధానమైనది. ఇందులో తేలిన విషయము లేవి యనగా: (౧) ఆహారసమస్యను పరిష్కరించుటకు ఇప్పటి రాష్ట్రప్రభుత్వమునకు శక్తి చాలదు. ఏది సాధ్యమో దాని నంతయు వారిదివరకే చేసినారట. సమస్య పరిష్కారముకొరకు కేంద్రప్రభుత్వము బాధ్యత వహించవలసియున్నదట. (౨) ఉద్యోగస్థులలో లంచగొండితన మున్నట్లు, బ్లాక్ మార్కెట్టు వ్యాపారము బాహుళ్యముగా జరుగుచుండునట్లును, అందరును అంగీకరించిరి. కాని వీటిని నిర్మూలము చేయుటకుకూడ ప్రభుత్వమువారికి శక్తిలేకున్నది. (౩) ధాన్యపు ధరలు పెంచుట న్యాయమనియు, రైతులకు కావలసిన ఎరువులు, పనిముట్లు సకాలములో సక్రమముగ అందచేయుట అవసరమనియు మంత్రు లంగీకరించిరి. కాని ఇవి జరుగుటకు కావలసిన ఏర్పాటులు వారు చేయలేని స్థితిలో ఉన్నారట. (౪) పంటలను వృద్ధిచేయుటకు ప్రభుత్వమువారు ఎట్టిప్రయత్నములు చేయుచుండునదియు, వాటి ఫలిత మేమైనదియు వారు విశదీకరించలేకపోయిరి.

## జ మీ ం దా రీ బి ల్లు

జమీందారీ విధానమును రద్దుచేయుటకై ప్రభుత్వమువారొక బిల్లును ప్రకటించిరి. కాని కాంగ్రెసు పార్టీలోనే దీనినిగురించి తీవ్రమైన అభిప్రాయభేదము లున్నట్లు తెలియుచున్నది. అందుచేత ఈ బిల్లులో ఎట్టిమార్పులు జరుగునో, దాని నిజస్వరూప మెట్లుండునో వివరించుటకు వీలులేదు. బిల్లును ప్రకటించుటకు పూర్వమే పార్టీ చర్చలు జరిగిన బాగుండెడిది.

ఈ బిల్లులో ప్రస్తుతము మూడు వివాదాంశము లున్నవి: పరిహారమునకు సంబంధించినది; ఇనాములకు సంబంధించినది; రైతువారీపద్ధతికి సంబంధించినది.

జమీందారులు భూమిశిస్తు వసూలుచేయుటకై ఏర్పరచబడిన ఉద్యోగస్థు లనియు, భూములు, అడవులు, గనులు మొదలైనవాటిపై వారి కెట్టి ఆస్తి హక్కు లే దనియు, అందుచేత వారికి ఎట్టి నష్టపరిహారము ఇయ్యవలసినది లే దనియు ఒక వాదము. సుమారు నూరు సంవత్సరములనుండి ప్రభుత్వమువారు జమీందారులను భూస్వాములుగ పరిగణించుచుండిరనియు, అందుచేత వారికి నష్టపరిహారము ఇయ్యవలసియున్న దనియు ఇంకొక వాదము.

ఇనాములను జమీందారీలతో ముడిపెట్టుటయందు సబబేమియు లేదు. ఈ రెంటింటికి ఎంతో భేద మున్నది. ఇనాందారులలో అనేకులు రెండు మూడు ఎకరాల భూస్వాములు. జమీందారులవలె వారు లక్షాధికారులు, కోటీశ్వరులు కారు. ఈ రెండు మూడు ఎకరాలను పెట్టుకొని వారెట్లో జీవించుచున్నారు. అట్టివారిని కడుపుకొట్టి, ఆ భూములను వారినుండి తీసుకొని, ఏదో కొంత స్వల్పమొత్తమును నష్టపరిహారముక్రింద వారికిచ్చుట అన్యాయము. గనుక ఇనాములకు సంబంధించిన భాగములు బిల్లునుండి తొలగించుట ధర్మము.

జమీందారీలలోని రైతులు, ఇకమీదట, రైతువారీ భూములవారు ఎంతటిశిస్తును చెల్లించుచున్నారో అంతటి శిస్తునే చెల్లించవలసియుండునని ఈ బిల్లు చెప్పుచున్నది. కాని రైతువారీపద్ధతిలో ఎన్నో లోపము లున్నవి. అవన్నియు సంస్కరింపబడవలె నని అనేకులు చెప్పుచున్నారు. ఇట్టి సందర్భములో ఆ పద్ధతిని జమీందారీ భూములలో ప్రవేశపెట్టుట అనుచితము. భూమిశిస్తువిధానము నంతను సంస్కరించుటకు ప్రభుత్వము పూనుకొనవలెను.

సోషలిజం ప్రవేశపెట్టుటయే కాంగ్రెసుయొక్క ఉద్దేశమని నాయకులు చెప్పుచున్నారు. కష్టపడి పని చేయకున్నను ఎక్కువధనమును సంపాదించు పద్ధతిని తొలగించి, కష్టమునకు తగిన ఫలమును అందరికి అందజేయుటయే సోషలిజముయొక్క ఉద్దేశము. సోషలిజం సిద్ధాంతానుసారము ప్రణాళిక నొకదానిని తయారుచేసి, ఎవరికిని అన్యాయము జరుగకుండ, నిష్పక్షపాతముగ శాసనములచేయుటకు పూనుకొనిన ప్రభుత్వమే నిజమైన సోషలిస్టు ప్రభుత్వము. ఇప్పటి మద్రాసు ప్రభుత్వము అట్టిదా? (1-10-'47)



# నాదోపాసనము

## త్యాగరాజోపనిషత్సిద్ధాంతము



— శ్రీహరి నాగభూషణం —

శ్రీమత్త్యాగరాజస్వామి భగవదవతారమని 'దాశరథే నీ ఋణము దీర్ప నాతరమా' అనెడి తోడి కీర్తనమందు తామే వాకొనియున్నారు. ఎట్లన—

ప. దాశరథే! నీఋణము దీర్ప నాతరమా! రామ

అ. ఆశదీర దూర దేశముల బ్ర
కాశింపజేసిన రసికశిరోమణి!!

చ. భక్తిలేని కవిజాలవరేణ్యులు
భావమెఱుగలేదని కలిలోన జని
భుక్తిముక్తి గల్గునని కీర్తన
ముల బోధించిన త్యాగరాజనుత!!

—'ఓ రామచంద్రా! నీవు నాకు దిగంత విశ్రాంతమగు కీర్తిని బ్రసాదించియున్నావు. దానం జేసి నేను నీకు బహుగా ఋణపడియున్నాడను. అట్టి నా ఋణము నెటుల దీర్చుకొనగలను? తీర్చుకొనలేను గాని యొకవిధముగా దీర్చికొన్నాను. ఎటులన—ఈ కలియుగంబున 'కవిజాలవరేణ్యులు', అనగా బండితులనెడు ఖ్యాతి వహించిన మనీషులు గూడ నీభావము, అనగా నీసత్తారూపమగు యథార్థస్వరూపమును దెలిసికొనలేక మృషావాదములు సల్పుచున్నారు. అట్టిచో పామరుల విషయ మిక చెప్పనేల! దానంజేసి పండితపామరులు సర్వులు నీస్వరూపమును గుర్తించి తరించుటకై కీర్తనములు రచించి బోధించియున్నాడను; అనగా తద్ద్వారమున భగవత్తత్త్వమును, తద్జ్ఞాన సాధనోత్తమంబగు భక్తిని నిరూపించియున్నాను. ఇందుకొరకే నేను భూలోకమున జన్మించియుంటిని. ఈవిధముగా నీకీర్తిని నేనును లోకమున జాటియున్నాను. కాన నీఋణ మీరీతి నేను దీర్చికొన్నాడను' అని యీ కీర్తనముయొక్క సంగ్రహ తాత్పర్యము.

ఈ కీర్తనము 'యదా యదాహి ధర్మస్య' 'పరిత్రాణాయ సాధూనాం' ఇత్యాది భగవద్గీతోక్తుల ననుగమించునదై శ్రీవారు భగవదవతారమని స్వీయ వచనములచేతనే చాటుచున్నది. అట్టిచో శ్రీవారి భగవదవతార ప్రయోజనము భక్తిద్వారమున బరమపురుషార్థమగు భగవత్సాక్షాత్కార రూపంబగు మోక్షము, జీవన్ముక్తి విదేహముక్త్యాత్మకమని స్వీయ వచనము లనేకములచే నెఱుంగనయ్యెడిని. దానంజేసి మోక్షసాధనములుగ తైత్తిరీయాద్యుపనిషత్తులందును, మన్వాదిస్మృతులందును జేర్కొబడిన సామాన్యవిశేష ధర్మసమస్తము శ్రీవారి కీర్తనములందు బ్రతిపాదింపబడినది. అందు ముఖ్యముగా 'సత్యం పరం పరగ్ం సత్యం' అనెడి నారాయణీయోపనిషదంతానువాకమందు బ్రతిపాదింపబడిన సత్యాద్యేకాదశోత్కృష్ట సాధనములు —సత్యము, తపస్సు, దమము, శమము, దానము, ధర్మము, ప్రజననము, అగ్న్యాధానము, అగ్నిహోత్రము, యజ్ఞము, మానసము, అనగా ఉపాసనము అనునవి పూర్వాంగములును, న్యాసము లేక సన్యాసము అనెడి ఉత్తరాంగమును శ్రీవా రుపదేశించువారుగ నెఱుంగదగును. ఇచ్చో 'యోగ్యస్య పురుషస్య అపేక్షితేషు జ్ఞానసాధనేషు సన్యాసస్య నిరతిశయోత్కర్షం వక్తుం సత్యాదీ న్యేకాదశోత్కృష్టసాధనాని ప్రతియోగికత్వేన వక్తవ్యాని' అనెడి శ్రీవిద్యారణ్యభాష్యవతారవాక్య మనుసంధేయము. యోగ్యుడగు పురుషుడు జ్ఞానము, అనగా బ్రహ్మసాక్షాత్కారము పడయదగు

వనియు, అట్టి సాక్షాత్కారమునకు ఉత్కృష్టసాధనము సన్న్యాస మనియు, అట్టి సన్న్యాసము నాశ్రయింపవలెనన్న సత్యాద్యేకాదశసాధనము లనుష్ఠించి యధికారము బ్రాపింపవలెననియు నావాక్యముయొక్క సంగ్రహతాత్పర్యము. సత్యము మొదలు సన్న్యాసపర్యంతమగు నీధర్మసముస్తమునందు బూర్వాంగము ప్రవృత్తిధర్మమనియు, నుత్తరాంగము నివృత్తిధర్మమనియు నెఱుంగదగును. ఇట్టి ధర్మద్వయప్రతిష్ఠాపనమే భగవదవతారముయొక్క పరమోద్దేశమును, బరమప్రయోజనము నని గీతోక్తి చాటెడిని. అవతారములలో శ్రీరామకృష్ణాదులు సాక్షాత్ భగవత్సంపూర్ణావతారమూర్తులుగను, శ్రీశంకరత్యాగరాజాదులు భగవదంశావతారమూర్తులుగను అవగమ్యమానులగుచున్నారు. ఇట్టిచో శ్రీ శంకరాచార్యుడే తిరిగి శ్రీ త్యాగరాజస్వామిగా నవతరించి తాను పూర్వము ఉపనిషద్భాష్యాదులు సంస్కృతమున వ్రాసి ప్రతిపాదించి ఉద్ధరించిన ధర్మము కాలగతిచే వైషమ్యమును బ్రాపింప తిరిగి శ్రీ త్యాగరాజస్వామిగ నవతరించి నేటితెలుగు భాషయందు కీర్తనములు రచించి తన్మూలమువం బునః ప్రతిష్ఠింపగల్గెనని యెంచదగును. అయినే శంకరాచార్యులుగ నవతరించినప్పుడు 'న్యాసఏవాత్యరేచయత్' 'జ్ఞానాదేవ తు కైవల్యం' 'సన్న్యాసాదేవ మోక్షః!' ఇత్యాది శ్రుత్యుక్తరీతిని జ్ఞాననిష్ఠారూపమగు సన్న్యాసమే పరమానుష్ఠేయముగ బోధించెను; త్యాగరూపమునన్ 'మానసమితి విద్వాంసస్తస్మాద్విద్వాంస ఏవ మానసే రమంతే' 'భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః, తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరం' ఇత్యాది వచనములననుసరించి భక్తియోగనిష్ఠయే పరమప్రాప్యముగ నిరూపించెను. అట్టి జ్ఞాననిష్ఠయు, నిట్టి భక్తినిష్ఠయు బాహ్యతః ఇతరేతరవిలక్షణంబులుగ నెంచబడియు 'భక్తిస్తు నిరతిశయానందప్రియానన్యప్రయోజన సకలేతరవైతృష్ణ్యవద్ జ్ఞానవిశేష ఏవ' అనెడి శ్రీరామానుజోక్తి ననుసరించియు 'మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ, స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే; స్వాత్మతత్త్వానుసంధానం భక్తిరిత్యపరే జగుః' 'చతుర్విధా...జ్ఞానీచ భరతర్షభ' ఇత్యాది శ్రీశంకరాదుల ఉక్తిననుసరించియు చరమకాష్ఠయందు నేకరూపమయని గ్రహింపనగును.

ఇంతకును తేలిన దేమన, శ్రీత్యాగరాజస్వామి భగవదవతారవిశేష మనియు, తత్రాపి శ్రీ శంకరాచార్యప్రతిరూపమనియు తాత్పర్యము. ఇట్టిచో 'పట్టి విడువరాదు' అనెడి మంజరిరాగకీర్తనమున భక్తినిష్ఠకు నిత్యానిత్యవస్తువివేకము మున్నగు సాధనచతుష్టయము పరమాలంబనీయముగ శాసింపబడు చున్నదనియు, 'ఉండేది రాముడొకడు', 'మనసేలరా' ఇత్యాదికీర్తనముల భగవంతుడు 'ఏకమేవాద్వితీయం' 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇత్యాదిశ్రుతిప్రతిపాద్యరీతి నద్వైతబ్రహ్మస్వరూపుడనియు, భగవత్సాక్షాత్కార మనిన సర్వాత్మభావము, సమ్యగ్దర్శనము ఇత్యాది వ్యవహారమున రూపాందు ఆత్మనిష్ఠ యనియు నిర్వచింపబడుచున్నదనియు నవధరింపనగును. ఇటులనే శ్రీశంకరభాష్యోక్తులు శ్రీత్యాగరాజగేయములందు ప్రతిగీతము లయ్యెడినని భావింపనయ్యెడిని.

ఇట్టిరీతుల శ్రీవారికీర్తనములు భగవదవతారగీతము లగుటం జేసి శ్రీకృష్ణభగవదుపదేశములు గీతోపనిషత్ప్రస్థానముగ నెఱుంగబడు చందమున శ్రీవారి కీర్తనములుగూడ నుపనిషత్స్థానీయములుగ గ్రహింపదగును.

అటులగుచేని ఉపనిషత్ప్రస్థానము భగవద్గీతా వ్యాససూత్రోపబృంహితమయి విరాజిల్లెడి వనుట సర్వాంగీకారమగు విషయము. కాన నట్టి ప్రస్థానముయొక్క ప్రధానతమసిద్ధాంతములు శ్రీశంకరాచార్య భాష్యానువిగీతము లిచట గొన్ని చేకొని వానిని నిరూపింతు శ్రీత్యాగరాజగేయరాజోక్తులు సమీకరింపనగును. అవధరింపుడు.

(౧) బ్రహ్మవిచారమే మోక్షసంధాయకమనియు, అయ్యది నిత్యానిత్యవస్తువివేచనాది సాధనచతుష్టయము బ్రాపించి చేయనగుననియు జిజ్ఞాసాసూత్రమున వ్యక్తీకరింపబడియె. ఆ యర్థమునే రచనాంతరచమత్కృతితో శ్రీత్యాగరాజస్వామి 'పట్టివిడువరాదు' అనెడి కీర్తనమున బోధించుచున్నాడు. ఎటులన—

'ఓరామా! నాచేయి పట్టి విడువరాదు; పుట్టిననాడే నిజభక్తిని మెడగట్టి గుట్టుచెదరక ప్రోచి, నిత్యానిత్యములను బోధించి కృత్యాకృత్యములను దెలిపించి ప్రత్యేకముగ నీవని కనిపించి (అనగా సాక్షాత్కరించి) భృత్యుడయిన త్యాగరాజుచేయిపట్టి విడువరాదు.'

ఇందు మనుజుడు ముముక్షువై తరింపవలెనన్న భగవదనుగ్రహ పాత్రుడు గావలెననియు, అనగా భగవంతుడే యుద్ధరింపవలెననియు అట్టి ముముక్షుత్వము పూర్వపుణ్యవిశేషముచే జన్మముచేతనే గలుగదగుననియు, నట్టి ముముక్షువు నిత్యానిత్యజ్ఞానాదులు సంపాదించి తద్ద్వారమున నగు ధ్యానావృత్తిచే భగవంతుని ప్రత్యేకత్వము, అనగా ప్రత్యగాత్మైకత్వమును సాక్షాత్కరించెడి ననియు, నట్టి సాక్షాత్కారము భగవద్భృత్యత్వమున, ననగా భగవద్భక్తిచే, తత్రాపి సేవారూపభక్తినిష్ఠచే గలుగుననియు మున్నగు విశేషములు ప్రతిపాదింపబడుచున్నవి. 'మనుష్యాణాం సహస్రేషు' 'నాయమాత్మా ప్రవచనేన లభ్యః న మేధయా న బహునా శ్రుతేన-యమేవైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వృణుతే తనూం స్వాం' 'బహూనాం జన్మనా మంతే' 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' 'అవిభక్తంచ భూతేషు విభక్తమివచ స్థితం' 'ప్రతిబోధవిదితం మతమమృతత్వంహి విందతే' 'భక్త్యాత్వనన్యయాశక్యః అహమేవంవిధో ఽర్జున, జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప' ఇత్యాదిప్రమాణములు ఈ గేయరాజమునకు విషయవాక్యములుగ నెఱుగదగును.

(౨) అద్వైతనిష్ఠయే పరమప్రాప్యమని 'మాయామాత్రమిదం శ్రుతం అద్వైతం పరమార్థతః' 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' ఇత్యాది శ్రుతులు బోధించుచున్నట్టి యాద్వైతబ్రహ్మసాక్షాత్కారము భక్తిధ్యానప్రణిధానాదులచే గలుగవలెనని 'అపిసంరాధనే ప్రత్యక్షానుమానాభ్యాం' 'హృదా మనీషా మనసాభిక్లప్తో' ఇత్యాదివచనములు నిరూపించెడిని. ఈ సిద్ధాంతమే 'ఉండేది రాము డొకడు', 'విడజాలదురా నామనసు', 'మరుగేలరా ఓరాఘవా' ఇత్యాదికీర్తనములు బోధించెడిని. ఎటుల ననగా :

'ఉండేది రాము డొకడే' అనగా 'త్రికాలాబాధ్యంబగు సద్వస్తువుల రామశబ్దోపలక్షితుండగు పరమాత్మయే: అట్టిడు చండమార్తాండమధ్యమండలమున నిండియుండు హిరణ్యగర్భాఖ్యపురుషుడు; గాయత్రీమంత్రోపలక్షితుడు. ఆ పరమాత్మ తామసాదిగుణరహితుడు; అనగా నిర్గుణుడు; ధర్మాత్ముడు, అనగా శాస్త్రయోని జగజ్జన్మాదికారణుండు; సర్వసముడు, అనగా సర్వాంతర్యామియై సర్వజ్ఞరూపమున భాసించువాడు. త్యాగరాజచిత్తహితుడు, అనగా భక్తుల మనస్సులందు సర్వదా ప్రతిబింబించువాడు, జగమునంత నిండియుండేవా డొక్కడే!' అని 'ఉండేది రాము డొకడు' అనెడి కీర్తనముయొక్క సంగ్రహతాత్పర్యము.

'నామనసు నిను విడజాలదురా రామ! అది యాసలచే, అనగా విషయలౌల్యముచే నే నారిబడితి నిక నీ పదంబులను విడజాలను: అట్టిచో తను వేపనులకు జనినను, చక్షువులే యాశ్చర్యకరమగు వస్తువును జూచినను నినుగా భావించి సంతసించువాడను. త్రికరణము లేయే కార్యములు నిర్వర్తించుచున్నటులు అన్యులకు గోచరించినను నామనస్సు నిన్నే ధ్యానించుచు నీపరమవిభూతులను గుర్తించుచు నీయందే లగ్నమగుచున్నది.' అని 'విడజాలదురా నామనసు' అను కీర్తనము బోధించెడిని. ఈ కీర్తనము భక్తుని నిదిధ్యాసనైకరూప భక్తిజ్ఞాన నిష్ఠ నీవిధముగా బోధించుచున్నది.

ఇక 'మరుగేలరా' అను కీర్తనముకూడ నిట్టి యర్థమునే బోధించుచు భక్తునియొక్క ధ్యానయోగమెట్టిదో స్పష్టీకరించుచున్నది. 'ఓరామా! మరుగేలరా! నీవు చరాచరరూపుడవు; పరాత్పరుడవు; సూర్య సుధాకరలోచనుడవు; అనగా సగుణసవిశేషనిర్గుణ నిర్విశేషచిన్మాత్రస్వరూపుడవు. అట్టి నిన్ను అంతరంగమున వెదకివెదకి అన్నియు నీవే యని తెలిసికొంటిని. కాన నిన్నెగాని మదిని నెన్నజాల నొరులను. దానంజేసి నన్నిక బ్రోవుము.' ఈ చివరి మాట లుపచారవాక్యములు. ఇందు 'పరాంచి ఖాని వ్యతృణత్స్వయంభూః... కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన

మైక్షత్ అవృత్తచక్షు రమృతత్త్వమిచ్ఛన్' అనెడి శ్రుత్యర్థము ముఖ్యముగా వివేకించబడుచున్నది. భక్తుడు సర్వానుస్యూతమగు చిన్మాత్రైక బ్రహ్మ వస్తువును సగుణనిర్గుణబ్రహ్మధ్యానమున దర్శింపవలె ననియు, ముఖ్యముగా దహరవిద్యచే నంతఃకరణమున సాక్షాత్కరింపవలెననియు,నట్టి ధ్యానయోగియు,విద్యాభ్యాసియు సర్వాత్మభావమనెడి స్థితప్రజ్ఞత్వమును బొందుననియు, శ్రీత్యాగరాజస్వామి యిట్టి స్థితప్రజ్ఞుడనియు నివేదించుచున్నది.

(౧) ఆరగింపవే పాలు (౨) కొలువమరెగద (౩) ధ్యానమేవరమైన ఇత్యాద్యనేకకీర్తనములందు ముముక్షువు స్నానసంధ్యావందనాది స్వకర్మాభిరతుడై పరనిందలు, పరహింసలు వర్జించి అనగా సత్యాఽహింసనాది వ్రతనిష్ఠుడై భక్తిధ్యానప్రణిధానుడయి మెలగవలెనని శాసించుచున్నవి. కాని యిట్టిచో యాగాది ప్రవృత్తినిగూర్చి శ్రీవారి యాదేశ మేమో యెఱుగదగును — ఈ విషయ మనేకకీర్తనములలో స్పష్టింపబడినది. ముఖ్యముగా 'యజ్ఞాదులు సుఖమనువారికి' అనెడి కీర్తన యీ విషయమున విమర్శనీయమయ్యెడిని:

ప. యజ్ఞాదులు సుఖ మను వారికి సము
లజ్ఞానులు గలరా ? ఓ మనసా !

అ. సుజ్ఞానదరిద్ర పరంపరు లా
సురచిత్తులు జీవాత్మహింసగల.

చ. అహివిషసమవిషయావిష్టులై ......
బహిరానములై త్యాగరాజు
భజియించే శ్రీరాము దెలియ.

ఈ కీర్తనము బాహ్యతః యాగాద్యనుష్ఠానమును నిరసించునదిగా గోచరించెడి. యజ్ఞాద్యనుష్ఠానమే పరమపురుషార్థముగా నెంచి చరించువారు అజ్ఞానులనియు, సుజ్ఞానదరిద్రులనియు, ఆసురచిత్తులనియు అహివిషసమవిషయులోలురనియు, దానంజేసి బహిర్ముఖులయి, భ్రంశమొందువారనియు నిందించుచు భగవద్భక్తియే ముముక్షుశరణ్యముగా బోధించుచున్నది. 'యా మిమాం పుష్పితాం వాచం'ఇత్యాది గీతార్థమును దైవాసురసంపద్విభాగయోగోక్త గ్రంథమును ముఖ్యముగా 'నహి అగ్నిహోత్రాదీన్యేవ కర్మాణి, బ్రహ్మచర్యం, తపః, సత్యవదనం, శమో దమో హింసేత్యేవమాదీన్యపి కర్మాణి ఇతరాశ్రమప్రసిద్ధాని విద్యోత్పత్తౌ సాధకతమాని అసంకీర్ణత్వాత్ (అహింసాద్యమిశ్రితత్వాత్) విద్యంతే'అనెడి శ్రీ శాంకర తైత్తిరీయ శిక్షావల్లీ భాష్యాంతర్గతవాక్యమును ఈ కీర్తనార్థమునకు విషయవాక్యములుగా నెఱుగువారికి శ్రీవారి నిశ్చితార్థమేమో గోచరించి అయ్యది యుపనిషన్మత సిద్ధాంతముగ నెఱుగనయ్యెడిని.

ఇటుల శ్రీ స్వామివారు శ్రీ శంకరావతారులనియు, వారి గేయములు శ్రీ శాంకరభాష్యోక్తుల ననుగమించునవి యనియు, దానంజేసి వారి కీర్తనములు ఉపనిషత్సమములుగ నెంచదగుననియు దిరిగి నిశ్చయింపనయ్యెడిని. ఇట్టిచో నాదోపాసనమును గూర్చిన ఉపనిషత్సిద్ధాంతమేమో,తత్రాపి శ్రీ త్యాగరాజ సిద్ధాంతమేమో యీ వ్యాసమున దిఙ్మాత్రముగ వివరింపబడెడిని.

నాద మనగా నోంకారమనెడి ప్రణవనాదమని యభిధావృత్తిచే నెఱుగనయ్యెడిని. అట్టి ఓంకారము బ్రహ్మమని 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' 'ఓమిత్యేతదక్షర మిదగ్ం సర్వం' ఇత్యాదిశ్రుతులు,'మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్' ఇత్యాదిస్మృతి వాక్యములును నిర్దేశించెడిని. మఱియు 'పరాఽపర బ్రహ్మ దృష్ట్యాహి ఉపాస్యమాన ఓంకారః శబ్దమాత్రోఽపి పరాపరబ్రహ్మప్రాప్తిసాధనం భవతి-సహి ఆలంబనం బ్రహ్మణః పరస్యాఽపరస్యచ ప్రతిమేవ విష్ణోః' (శిక్షా-iX అనువాకభాష్యము. ఓంకారము పరాఽపరబ్రహ్మదృష్టిచే నుపాస్యమానమగుచో నయ్యది శబ్దమాత్రమయ్యును బరాపరబ్రహ్మప్రాప్తి సాధనం బయ్యెడిని. ప్రతిమ యేవిధముగ విష్ణువున కెటుల బరమాలంబనమో ఓంకారమపరాపరబ్రహ్మములకు బరమాలంబనమగుచున్నది.) ఇత్యాదిభాష్యోక్తులు ఉపనిషత్సిద్ధాంతము ననుసరించి ప్రణవోపాసనము బ్రహ్మసాక్షాత్కారప్రాపకమని నిశ్చయించెడిని. మాండూ

క్యోపనిషత్తు ముఖ్యముగా నీప్రణవోపాసనమునుగూర్చి ప్రతిపాదించెడిని.

బ్రహ్మసాక్షాత్కార ప్రాపకంబులగు బ్రహ్మవిద్యలు నారాయణోపనిషత్తునందు మానసశబ్దముచే బరామృష్టంబులగునవి ముప్పదిరెండని నిశ్చయింపబడినవి. అయ్యవి ప్రాణవిద్య, దహరవిద్య, సత్యవిద్య, సంవర్గవిద్య, వైశ్వానరవిద్య ఇత్యాదులు. వానిలోన 'న్యాస ఏవాత్యరేచయత్' ఇత్యాది శ్రుతివచనములబట్టి బ్రహ్మసాక్షాత్కారమునకు అత్యుత్తమసాధనముగ నిశ్చయింపబడిన సన్న్యాసమును జేయనగినదిగా విధింపబడిన ప్రణవవిద్య మాండూక్యోపనిషత్ తృతీయఖండమున విపులంబుగ నివేదింపబడియె. దాని సంగ్రహార్థము 'ఓమిత్యాత్మానం యుంజీత' అనెడి శ్రుత్యంతరము నివేదించుచున్నది. దీని యర్థము నీవిధముగా శ్రీ ఆనందగిరిస్వామి వ్యక్తీకరించువాడు: 'సమాధినిష్ఠో యదా ఓమిత్యుచ్చార్య ఆత్మాన మనుసంధత్తే, తదా స్థూలమకారముకారే సూక్ష్మ-తంచకారంగోమకారే-తమపి కార్యకారణాతీతే ప్రత్యగాత్మని ఉపసంహృత్య తన్నిష్ఠో భవతి.' సమాధినిష్ఠుడు 'ఓం' అని ఉచ్చరించుచు దన్నిష్ఠుడు గావలెననియు, నట్టిచో నిటుల ఉచ్చరించునపుడు స్థూలమగు అకారమును సూక్ష్మమగు నుకారమునను, తిరిగి ఆ ఉకారమును గారణమగు మకారమందును, దిరిగి ఆ మకారమును గార్యకారణాతీతమగు ప్రత్యగాత్మయందును ఉపసంహరించి తన్నిష్ఠుడు గాదగును అని యీ వాక్యము యొక్క భావార్థము. ఇదియు ప్రణవోపాసనము. ఉత్తమమయినది; నిర్గుణబ్రహ్మసాక్షాత్కారకము. దీని స్వరూపము కొలదిగనైని శబ్దతః వివరింపనగును. విమర్శనము, లేక వివరణము రెండు విధములు: శబ్దతోవివరణము, అర్థతోవివరణము నని. శబ్దతోవివరణ మనగా బదవాక్యాకాంక్షలచే వివరించుట; అర్థతోవివరణ మనగా అనుభవపురస్సరముగ నిరూపించుట. అర్థతోవివరణము గురూపదేశపూర్వకమగు శ్రవణమనన నిదిధ్యాసలచే సిద్ధించెడి ఆత్మానుసంధానమగు పరాకాష్ఠ. ఇందు మాటలు అప్రయోజకములు. ఆచార్యవృత్తి ననుసరించు చేతోవృత్తియే పరమప్రయోజకము. ఇక శబ్దతోవివరణమున అజ్ఞాతమగు నర్థము మాటలచే గరతలామలకమువలె నిరూపింపబడును. శబ్దతోవివరణమున జ్ఞానమును, అర్థతోవివరణమున విజ్ఞానమును ఫలించును. జ్ఞానమన శాస్త్రజన్యజ్ఞానమనియు, విజ్ఞానమన్న ననుభవమనియు నెఱుంగదగును. బంగారుదుంప నెఱుగని వాడు అయ్యది తానెఱిగిన చామదుంపవంటిదని రెంటి ననుభవముగలవానిచే బొందెడి శబ్దతోవివరణము జ్ఞానమనియు, అట్టి బంగారుదుంప గొనితెచ్చి వండించుకొని భుజించి యనుభవించుట అర్థతోవివరణరూపమగు విజ్ఞానమనియు దృష్టాంతరూపమున గ్రహింపనగును. ఇట్టిచో నాదోపాసనమును గూర్చిన పై యుపదేశ సారాంశము శబ్దతోవివరణ మూలమునమాత్రమే యిందు గ్రాహ్యముగాని అర్థతోవివరణయోగ్యము గాదని మున్ముం దవధరింపదగును. దానంజేసి నాదోపాసనమును గూర్చిన జ్ఞానము, లేక శాస్త్రజన్యజ్ఞానము సంపాదించిన మనీషి తద్విజ్ఞానప్రాప్తికై నాదోపాసనానిష్ఠుడగు నాచార్యునుపసత్తిచేసి లభింపవలెనని యెఱుంగదగును.

సమష్టియందు బ్రహ్మము విరాట్ హిరణ్యగర్భ ఈశ్వరు లనియెడి సగుణరూప త్రైవిధ్యమునంది తురీయస్థితియందు తదధిష్ఠానమగు నిర్గుణబ్రహ్మముగ భాసించు రీతిని వ్యష్టియందు ఆ బ్రహ్మము విశ్వతైజసప్రాజ్ఞులనెడి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థానభూతులగు త్రివిధాత్మలుగ భాసించుచు సమాధిరూపంబగు తురీయస్థితియందు నద్వైతంబగు, అనగా బ్రత్యంతఃకరణమున నేకరూపమగు ప్రత్యగాత్మగ ననుభూతమయ్యెడి నని మాండూక్యాద్యుపనిషత్తులు ప్రతిపాదించుచున్నవి. అట్టిచో గుణోపసంహారన్యాయము ననుసరించి ప్రణవోపాసనమున నద్వైతసమాధినిష్ఠుడు గాదగును అని పై వాక్యముయొక్క సంగ్రహార్థము. ఇట్టిచో 'ఓం' అనెడిప్రణవాక్షరము అ-ఉ-మ్ అనెడి త్ర్యక్షరసమామ్నాతమనియు, అందలి ఉ-కారము సమష్టియందలి విరాడాత్మస్థానీయమును, వ్యష్టియందలి విశ్వాత్మస్థానీయమును. అటువలెనే ఉమకారములు క్రమముగా సమష్టియందలి హిరణ్యగర్భేశ్వర స్థానీయములుగను, వ్యష్టియందలి తైజసప్రాజ్ఞస్థానీయములు

గను భావింపనగుననియు, 'ఓం'అనెడి అక్షరము నుచ్చరించుటతో గలుగు నాదాంతప్రతీతి సర్వాధిష్ఠానంబగు పరబ్రహ్మము, లేక ప్రత్యగాత్మ యనియు నాయా యుపనిషన్మంత్రములు నిరూపించెడిని. దానంజేసి ప్రణవోపాసనయందు తదుపాసన యొనర్చువేళ స్థూలాకారమును సూక్ష్మాకారమునను, సూక్ష్మాకారమును కారణాత్మకంబగు మకారమునను, అనంతరము తత్సమస్తమును కార్యకారణాతీతమగు నాదాంత బ్రహ్మప్రతీతియందును లీనమొనర్పదగును అనియు, మఱియు నట్టిచో అకారోచ్చారణమున సమష్టియందలి విరాడాత్మను వ్యష్టియందలి విశ్వాత్మను, ఉకారోచ్చారణమున సమష్టియందలి హిరణ్యగర్భాత్మను వ్యష్టియందలి తైజసాత్మను, మకారోచ్చారణంబున సమష్టియందలి ఈశ్వరాత్మను వ్యష్టియందలి ప్రాజ్ఞాత్మను, సమస్తాక్షరోచ్చారణంబున సమష్టియందలి తురీయ బ్రహ్మమును వ్యష్టియందలి తురీయప్రత్యగాత్మను గుణోపసంహారన్యాయమును ననుసరించి ఏకీభూతమొనర్చుచు ధ్యానావృత్తి సేయనగుననియు, నిట్టి ధ్యానావృత్తిచే బ్రత్యగభిన్న బ్రహ్మసాక్షాత్కార మనెడి సమాధినిష్ఠ సిద్ధించుననియు పై వాక్యముయొక్క వ్యాకృతార్థముగ తెలియగదగును. ఇదియ నాదోపాసనముయొక్క శబ్దతోవివరణము. ఇట్టిద నాదోపాసనము. ఉపనిషత్సిద్ధాంతపర్యవసితము.

ఇయ్యది ప్రమాణంబుగ గ్రహించి శ్రీత్యాగరాజస్వామి యేమి వాక్రుచ్చుచున్నాడో గ్రహింపదగును.

ప. నాదోపాసన జేసి శంకర -
నారాయణవిధులు వెలసిరి ఓమనసా !

అ. వేదోద్ధారులు వేదాతీతులు -
విశ్వమెల్ల నిండియుండువారలు.

చ. మంత్రాత్ములు యంత్ర-తంత్రాత్ములు మహితు
మంత్ర తెన్నో గలవారలు
తంత్రీలయస్వరరాగవినోదులు -
త్యాగరాజహృద్భావిత లార్యులు.

ఈకీర్తనము 'నాదోపాసనయా! దేవా బ్రహ్మవిష్ణుశివాత్మకాః, భవం త్యుపాసితా నూనం యస్మాదేతే తదాత్మకాః' అనెడి భరతాచార్యుల సిద్ధాంతము ననుసరించునదిగ గోచరించెడిని. బ్రహ్మవిష్ణుమహేశ్వరులను, తత్సదృశులగు భగవత్స్వరూపులితరులు ఋష్యాదులును అందఱును నాదోపాసన మునచే భగవత్త్వసిద్ధి నొందిరని యీ కీర్తనము దెలిచెడిని:

ప. నాదతను మనిశం శంకరం-
నమామి మే మనసా శిరసా !

అ. మోదకరం నిగమోత్తమ సారం -
వేదసారం వారం వారం.

చ. సద్యోజాతాది పంచవక్త్రజ -
సరిగమపదని ఇతి సప్తస్వర
విద్యాలోలం విగళితకాలం -
విమలహృదయ త్యాగరాజపాలం.

ఈ కీర్తనము శివపరమయినది. అట్టి శివుడు తురీయ బ్రహ్మముగా నిందు గీర్తింపబడుచున్నాడు. ముఖ్యముగా నాతడు ప్రణవ స్వరూపుడుగా ధ్యానింపబడుచున్నాడు. మఱియు వాని సద్యోజాతాది ముఖములనుండి షడ్జాది సప్త స్వరము లుద్భవించెనని యిందు వాక్రొనబడినది. సప్తస్వరాత్మకమగు సంగీతము సామవేద జనితమనియు, నట్టి సామవేదము ఇతర వేదములతో బాటు భగవదుద్భూత మనియు 'శాస్త్రయోనిత్వాత్' అనెడి వ్యాస సూత్రముచే తెలియ నగుచున్నది. అట్టి శాస్త్రయోని శంకరుడుగా భావింపబడునపుడు సంగీతము తదుద్భూతము గాకుండునా ? ఆతడు సప్తస్వరాత్మకనాదవిద్యాలోలుడు గాకుండునా ?

సంగీతము నాదవిద్యగా, అనగా నాదోపాసనముగా శ్రీవారనేక కీర్తనముల విశదీకరించినారు. 'నాదవిద్యా మర్మంబులను దెలిసి' అని 'యెందుకు పెద్దలవలె బుద్ధియ్యవు' అనెడి శంకరాభరణ కీర్తనమందు నిర్వచించియున్నారు. ఇట్టి నాదవిద్యయగు సంగీతము మోక్షఫలసంధాయకమని శ్రీ వారినిశ్చయము. 'సంగీతశాస్త్రజ్ఞానము-సారూప్య సౌఖ్యదమే మనసా' అని ముఖారి కీర్తనమున నిరూపించినారు. అనగా

నాదవిద్యారూపంబగు సంగీతముచే, ననగా గీతిప్రధానమగు తౌర్యత్రికముచే భగవత్స్వరూపరూప సగుణముక్తి గలుగునని శ్రీవారి సిద్ధాంతము. సంగీతజ్ఞానవిహీనులకు మోక్షమే సిద్ధింపనేరదని 'మోక్షముగలదా' అనెడి కీర్తనమున శ్రీవారు ఆక్షేపించుచున్నారు. అదెట్లన :

ప. మోక్షము గలదా భువిలో జీవ –
న్ముక్తులు గానివారలకు :
అ. సాక్షాత్కారిణీ సద్భక్తి –
సంగీత జ్ఞాన విహీనులకు :
చ. ప్రాణానల సంయోగముచే న –
ప్రణవనాదము సప్తస్వరములయి బరగ
వీణా వాదనలోలుడౌ శివమనో
విధమెఱుగరు త్యాగరాజ వినుత !

జీవన్ముక్తి బ్రాపించిన మహనీయులే, అనగా స్థితప్రజ్ఞత్వ మనెడి జ్ఞాననిష్ఠను బొందినవారే విదేహకైవల్య మనెడి మోక్షము నొందువారనియు, నట్టి జ్ఞాననిష్ఠ బ్రాపింపవలెనన్న భగవత్సాక్షాత్కార యోగ్యంబగు భక్తినిష్ఠ అత్యవసరమనియు, అట్టి భక్తినిష్ఠ నాదవిద్య యనబడు సంగీతముచే సులభసంపాద్యమనియు, దానంజేసి సంగీతమునగాక మోక్షమెందు సాధ్యము గాదనియునిందలి పల్లవ్యనుపల్లవులు చాటెడిని. ఇందుకు 'తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే' ఇత్యాదిప్రమాణోక్తులును, స్థితప్రజ్ఞ ప్రకరణాత్మకంబగు గీతా గ్రంథమును విషయవాక్య సమస్తంబుగ నెంచదగును. మఱియు

శ్లో. గీతిగానేన యోగస్స్యాత్.
యోగాదేవ శివైక్యతా
గీతజ్ఞో యది యోగేన
సయాతి పరమాంగతిం.

శ్లో. వీణావాదనతత్త్వజ్ఞః శ్రుతిజాతివిశారదః
తాళజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గం నిగచ్ఛతి.

ఇత్యాదిస్మృతివచనములును ఈ సిద్ధాంతమునకు మూలభూతములుగా నెఱుగదగును. ఇక చరణమున సంగీతము నాదవిద్య యెట్లగుచున్నదో నిరూపింపడినది. ప్రాణానలసంయోగముచే బ్రణవనాదమే సప్తస్వరములుగా బరిణమించెడిననియు, నట్టితో సప్తస్వరాత్మకమగు గీతము ముఖ్యముగా వీణావాదనమున నభివ్యక్తమగుననియు, దానంజేసి పరమేశ్వరుడు వీణాగానలోలుడనియు జరణము నిరూపించుచున్నది. ఈ యర్థమున పై నుదహరించిన శ్లోకంబులును,

శ్లో. నకారం ప్రాణనామానం
దకార మనలం విదుః
జాతః ప్రాణాగ్ని సంయోగా
త్తేన నాదోఽభిధీయతే.

అనెడి భరతాచార్య ప్రణీతశ్లోకార్థంబును నవధేయములు. ఇటులనే యీక్రిందికీర్తనముల భంగ్యంతరములచే నాదవిద్యాత్మకమగు సంగీతము మోక్షసంధాయకమని శ్రీవారు నిశ్చయించుచు నచ్చటలనో వివరించుచున్నారు. అవధరింపుడు.

ప. స్వరరాగసుధారస యుతభక్తి –
స్వర్గాపవర్గము రా ! ఓమనసా.

అ. పరమానందమనే కమలముపైని –
బకభేకము చెలగునే ఓమనసా !

చ. మూలాధారజనాద మెఱుగుటే –
ముదమగు మోక్షమురా
కోలాహలసప్తస్వరగృహముల
గుఱుతే మోక్షమురా ఓమనసా !

'స్వరరాగసుధారసయుతమగు భక్తియే స్వర్గము, అపవర్గము, అనగా మోక్షమును అయ్యెడిని' ఇక నట్టిదికాని సంగీతము అమృత గర్భితమగు పద్మముపైన గూర్చుండు బకభేకములు మచ్చెములనే యెరగొనుటకై ధ్యానముసల్పుచు పద్మములోని మకరందమును పానముసేయజాలని రీతి గలదగును. అనగా నాదవిద్యారసికులు రసికులుగాక గానముసేయు గాయకులు గాయకోత్తములుగ బరిగణింపబడువారయ్యును తద్విద్యాఫలమగు స్వర్గాపవర్గరూపఫలమగు స్వరూపానందమును బడయనేరక పద్మాసనస్థ బకభేకతుల్యులై, అనగా బకధ్యాననిష్ఠులయి మత్స్యములవంటి ధనధాన్య

మాహాత్మ్యములు బడయగల్గువారు. అటులకచో స్వర్గాపవర్గ భాజనము స్వరరాగసుధారసభక్తియన నెట్టిదన మూలాధారజనాద మెఱుగుటవంటి కోలాహలసప్తస్వర గృహముల గుఱుతే, అనగా ఆగృహములను గుర్తించుటే యననగును.

ఈ కీర్తనముయొక్క పరమసిద్ధాంతము దురవగాహముగ గోచరించెడిని. దాని గోప్యార్థమునకై భరతాచార్యుల యీ క్రిందిశ్లోకము లనుసంధేయములు:

శ్లో. బ్రహ్మగ్రంథిస్థితో నాదః
క్రమా దూర్ధ్వపరశ్చరన్
నాభిహృత్కంఠ మూర్ధాస్యే
ష్వావిర్భవతి తత్స్వనః.

నాదోఽతిసూక్ష్మ స్సూక్ష్మశ్చ
పుష్టోఽపుష్టశ్చ కృత్రిమః
ఇతి పంచాభిధా ధత్తే
పంచస్థాన స్థితి క్రమాత్ !

నకారం ప్రాణనామానం
దకార మనలం విదుః
జాతః ప్రాణాగ్ని సంయోగా
త్తేన నాదోఽభిధీయతే.

ఆహతోఽనాహతశ్చైవ
స నాదో ద్వివిధో మతః
ఉభయోరపి సంయోగా
దాహతః పరికీర్తితః.

ఆకాశసంభవో నాద
అనాహత ఉదాహృతః.

ఆరోహిణ్యాహతశ్చైవ
మవరోహిణ్యనాహతః.
తం నాదం సప్తధా కృత్వా
తథా షడ్జాదిభిస్స్వరైః
షడ్జో ఋషభగాంధారా
మధ్యపంచమ ధైవతాః
నిషాదశ్చేతి సప్తైతే
స్వరాః ప్రోక్తా మనీషిభిః.

ఈ శ్లోకార్థములనుబట్టి నాదము ఆహతము అనాహతము అని రెండువిధములుగ నుండుననియు, ఆహతనాదము ఆరోహిణీసంజ్ఞ గలదనియు అనాహత మవరోహిణీసంజ్ఞ గలదనియు, ఆకాశసంభవమగు నాద మనాహతమనియు, తన్నాదమే ప్రాణిశరీరముల నాశ్రయించి బ్రహ్మగ్రంథినుండి ఊర్ధ్వముగా ప్రసరించుచు, అనగా మూలాధారమునుండి నాభిహృత్కంఠ మూర్ధాస్యములకు నారోహించుటంజేసి ఆరోహిణీ సంజ్ఞ నొంది, అనగా క్రమముగా అనాహతాది షట్చక్రములకు నైక్రమమున, అనగా మూలాధారమునుండి నాభికి, నాభినుండి హృదయమునకు, హృదయము నుండి కంఠమునకు, కంఠమునుండి మూర్ధంబునకు, అనగా సహస్రారమునకు, సహస్రారమునుండి అవరోహక్రమమున నాస్యంబునకును నిర్గమించి మూలాధారమున నుండుగ లక్షింపనగు నాదము నాభియందు అతిసూక్ష్మంబుగను, హృదయంబున సూక్ష్మంబుగను, కంఠంబున పుష్టంబుగను, మూర్ధంబున నపుష్టంబుగను, ఆస్యంబున కృత్రిమంబుగను రూపొందుచు నాయానామముల వ్యవహృతమగుచుండుననియు, ప్రాణానలసంయోగముచే, అనగా ప్రాణవాయువునకును అనలంబునకును గలుగు సంయోగముచే ద్వివిధంబగు నాద ముత్పన్నమగుననియు, అనగా సమష్టియగు భూతాకాశమున 'ఆకాశా ద్వాయు ర్వాయో రగ్నిః' ఇత్యాది శ్రుత్యుక్తరీతిని వాయ్వగ్ని సమ్మేళనముచే నాదాత్మకంబగు ధ్వని పుట్టుననియు, అయ్యది ఆకాశస్థమగునపుడు, అనగా శబ్దగుణక మాకాశమ్మనెడి తార్కికసిద్ధాంతమునుబట్టి గాని, శబ్దాత్మక మాకాశమ్మనెడి వేదాంత సిద్ధాంతమునుబట్టి గాని పరికించినపుడు ఆహతముగ నిష్పన్నముగాకుంటచే అనాహత సంజ్ఞిత మగుననియు, నయ్యదియు వ్యష్టియందు, అనగా పురుషదేహమందు మూలాధార స్థితమై దేహమందలి ప్రాణానలసంయోగముచే బయిన వివరించిన చొప్పున క్రమక్రమముగా నూర్ధ్వనాడీసంచారక్రమమున ముఖమందు వినబడు ధ్వనిగ బరిణమించుచున్నదనియు, దానంజేసి అనాహతనాదము అకృత్రిమమును, ముఖధ్వని కృత్రిమంబును అనెడి సంకేతంబుల నొందుచున్నదనియు, ఇట్టి కృత్రిమనాదము షడ్జాదిస్వర

సాంకేతిక వ్యవహారము నంది సంగీతమున నభివ్యక్త మగుచున్నదనియు మున్నగు విషయములు గ్రహింపనగుచున్నవి. ఇట్టిచో మూలాధారజనాద మెఱుగుట యనిన యోగశాస్త్రసమ్మతమగు యోగాభ్యాసమున సమష్టివ్యష్టిగతమగు ననాహతనాదాభివ్యక్తికి లవారై సహస్రారపర్యంతంబగు నా నాదము ననుభవించుచు ధ్యానధారణసమాధినిష్ఠులగుట. యోగుల కట్టిస్థితి యోగాభ్యాసమూలమున లభించునది. ఇదియ యోగసమాధి నిష్ఠ: ఇదియ మోక్షస్థితి. ఇయ్యది శాస్త్రజ్ఞులగు అస్మాదృశులకు సాధ్యమగునది కానేరదు. ఇక నట్టి యనాహతనాదమునుండి పైన వివరించిన రీతి నుత్పన్నములయిన షడ్జాదిసప్తస్వర గృహముల గుఱుతు అనగా షడ్జాదిస్వరముల కాకరములగు ద్వావింశతి శ్రుతుల సూక్ష్మాతిసూక్ష్మని స్వరూపముల సమగ్రముగ గురుతించి అట్టి షడ్జాదిస్వరము లానందప్రాభవము గల పాట కోలాహలాత్మకంబులని యెఱింగి యోగివశ భక్తియుక్తుడై గానమొనర్చుట. ఇయ్యదియు యోగి సమాధివంటిదే యనుటం జేసి మోక్షస్థప్రాప్తియే అగుచున్నది. ఇదియ స్వరరాగసుధారసభక్తి. ఇద్దియ స్వర్గానుభూతి, అపవర్గానుభూతి. స్వర మనగా స్వతో రంజనాత్మకమగు ధ్వనివిశేషము. రాగమనగా రంజక స్వరసందర్భము. ఇట్టి స్వరరాగంబులు గానము సేయునపుడు గలిగెడి రక్తి సుధారసప్రాయమైనది అట్టి సుధారసముతో గూడిన భగవద్భక్తి స్వర్గాపవర్గానుభవకే. అనగా భగవంతునియందు బాహ్యననైకాంతికభక్తి గలవాడై సుధారసాత్మకంబగు స్వరరాగగానము ను, అనగా రాగరూపకాలప్తులలోన రాగాలప్తి క్రమము ననుసరించి గానమునొనర్చు గాయకవరేణ్యుడు స్వర్గానుభూతిసదృశంబగు సప్రజ్ఞాతసమాధి సుఖమునో, అపవర్గానుభూతిసమంబగు నసంప్రజ్ఞాతసమాధి సుఖమునో అనుభవింపగలడు. ఈ వాక్యార్థసమస్తమున దేలునదేమన ద్వావింశతిశ్రుతుల సూక్ష్మాతిసూక్ష్మని సమ్యగ్జ్ఞానము సంపాదించి భగవద్భక్తియుక్తుడయి రాగాలప్తిసంజ్ఞితంబును, స్వరరాగాత్మకంబును నగు, అనగా స్వరగానరాగగానరూపంబగు అకృత్రిమ గానంబుసేయు గాయకవరేణ్యుడు జీవన్ముక్తుడై తరించెడిని అనియు, అట్టిడు గానేరని శాస్త్రజ్ఞగాయకుడు కుచ్ఛమనదగు లౌకికసంపద నొందిన నొందుగాక యనియు తాత్పర్యము.

ఈ యర్థమందే యీ క్రిందికీర్తనముగూడ బఠింపనయ్యెడిని.

ప. రాగసుధారసపానము చేసి-రంజిలవే ఓమనసా!

అ. యోగయోగత్యాగ - భోగఫలము.

చ. సదాశివమయమగు నోంకారస్వర
విదులు జీవన్ముక్తులని త్యాగరాజు దెలియు.

రాగసుధారసపానము యోగయోగత్యాగభోగ ఫలమగునది. ఓంకారము సదాశివాత్మకము, అనగా భగవదాకృతికము. దానినుండి సప్తస్వరము లుద్భవించినవి; ఈ రహస్యమెఱిగి గానమొనర్చి రాగ సుధారసము గ్రోలు గాయకవరేణ్యులు జీవన్ముక్తులయి రంజిలువారని త్యాగరాజెఱింగి, గానమొనర్చి తరించినాడు. అటులనే యితరులును దరింపనగునని శ్రీవారు బోధించుచున్నారు.

ఈ పైకీర్తనములు రాగరూపకాలప్తులనియెడి ద్వివిధాలప్తులలోన రాగాలప్తి యొటులజేసిన జీవన్ముక్తి విదేహముక్తులు సిద్ధించునో వ్యక్తీకరించెడిని. ఇక కీర్తనాద్యాలాపనాత్మకంబగు రూపకాలప్తి యొటుల మోక్షసంధాయకమగునో యీ క్రిందికీర్తనమున శ్రీవారు నిర్వచించుచున్నారు.

ప. సొగసుగా మృదంగతాళము జతగూర్చి నిను-
సొక్కజేయు ధీరు డెవ్వడో, రామ !!

అ. నిగమశిరోర్థము గల్గిన
నిజవాక్కులతో స్వ శుద్ధముతో

చ. యతివిశ్రమ సద్భక్తివి
రతి ద్రాక్షారసనవరస
యుతకృతిచే భజియించే
యుక్తి త్యాగరాజుని తరమా !!

'సొగసుగా మృదంగతాళము జతగూర్చి నిను సొక్కజేయు ధీరు డెవ్వడో రామ' అనుటచే మృదంగాదివాద్యసహకారముతోడ భక్తిగానముసేయు గాయకవరేణ్యుడే ధీరుడు, అనగా జ్ఞాని యనియు,

కృతార్థుడనియు తెలియఁగదగును. అట్టి గాయకుడు నిగమశిరంబు లనబడు నుపనిషదర్థ సమగ్రంబులగు స్వకీయవాక్య రచనలతో గూడిన ధాతుమాతుసంశ్లిష్టంబగు గానము సేయదగుననియు, నట్టి గానము శ్రుతిలయపక్వముగా నుండదగుననియు అనుపల్లవి శాసించెడిని. అట్టి ధాతుమాతుసంకలితంబగు స్వకీయరచనము యతివిశ్రమాదినియమములతో గూడినదిగను, ద్రాక్షాపాకసమన్వితముగను, భక్తిభాజనముగను నుండనోపుననియు జరణము విధించుచున్నది. ఇట్టివిధానము త్యాగరాజుని తరమా అనుటచే స్వసదృశులగు భక్తిజ్ఞాననిష్ఠులకు దప్ప నితరులకు సాధ్యమగునది కాదని శ్రీవారు తెలుపుచున్నారు. ఇందువలన గవియై వేదాంతవేత్తయై పండితుడై గాయకోత్తముడై సద్భక్తుడై అనగా బాహ్యనైశ్యైకాంతభక్తిభాజనుడై ద్రాక్షాపాకసమన్వితములును, భక్తిజ్ఞానసమగ్రంబులును నగుధాతుమాతు సంకలితస్వకీయ రచనములచే శ్రుతిలయపక్వముగా భగవన్నామసంకీర్తనము సేయుదగుననియు నట్టి సంగీతమున భగవంతుడు సాక్షనియు గాతధీరుడై అనగా స్థితప్రజ్ఞుడై తరించుననియు నీ కీర్తనోపదేశముగా తెలియఁగదగును. అట్టిదు శ్రీవారును అట్టివారేమహామహులో 'మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే' అను న్యాయము ననుసరించి గోచరింపగలరు. ఇక నన్యులగతి యేమి యనిన బరరచితగేయము లయినను వాని యర్థము నెఱిగి తదర్థస్ఫోరకంబుగ సద్భక్తితోడ నుత్తమగానపద్ధతులు దీపింప నామసంకీర్తన మొనర్పదగునని యర్థాత్తు సిద్ధించెడిని. ఇట్టిద స్వపరతారకంబగు రూపకాలప్తిరూపంబగు నాదోపాసనము.

ఇట్టిదగు రాగరూపకాలప్త్యాత్మక నాదోపాసనమునకు 'ఓమిత్యేకాక్షరం యుంజీత' ఏత దాలంబనం' ఇత్యాది *ప్రమాణము ననుసరించి ఆలంబన* మొద్దిగ నుండనోపు ననిన సత్యాత్మకమగు ప్రణవమును ప్రణవార్థస్ఫూర్తిగల రామకృష్ణశంభుశంకరాది భగవన్నామము లనియు నై కీర్తనములచే స్ఫురించెడిని. శ్రీవారు ముఖ్యముగా రామనామము నాలంబనముగ గొని నాదోపాసన మొనర్చిరి. అట్టిచో నాలంబనార్థ మెఱిగి తదర్థానుభూతిచిత్తవృత్తిచే నాదవిద్యాతత్త్వంబగు గాన మొనర్పవలెనని 'తెలిసి రామచింతన' 'రమించు వారెవరురా' అనెడు కీర్తనములు శాసించెడిని. వీనిలోన 'రమించువారెవరురా' అనెడు కీర్తనము రామశబ్దార్థమేమో వివరించి, అయ్యది రం 'క్రీడాయాం' 'రమంతే అస్మిన్ యోగిన ఇతి రామః' 'రమయతీతి రామః' అనెడి వ్యుత్పత్తి ననుసరించి సచ్చిదానందపరబ్రహ్మమని నిరూపించెడిని. పెక్కేల నొక్క మాటలోన 'రసో వై సః—రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి—కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్-యదేష ఆకాశ ఆనందో న స్యాత్-ఏష హ్యేవానందయాతి' ఇత్యాద్యుపనిషదర్థమునుబట్టి ఏది ఆనందాత్మకమో, ఆనందప్రాపకమో అది రామశబ్దవాచ్యమగు పరబ్రహ్మవస్తువని శ్రీవా రిందు జాటుచున్నారు. ఇటువలెనే 'ఎవరని నిర్ణయించెదిరా, నిన్నెట్లారాధించెదిరా నరవర' అనెడి కీర్తనమున దశరథగర్భసంజాతుడగు నరవరుడు (ప్రభువు-పురుషోత్తముడు) పంచాక్షరీ అష్టాక్షరీమంత్ర బీజాక్షరాన్విత నాముడగు సగుణనిర్గుణాత్మకంబగు నద్వైతపరబ్రహ్మముగ శ్రీవారు కీర్తించుచున్నారు. ఈ యర్థ మెఱింగి రామకీర్తనాత్మక నాదోపాసన మొనర్పదగునని శ్రీవా రాదేశించెడిని. ఇటులనే యితర నామములతో వారి వారి రుచుల ననుసరించి భగవన్నామగాన మొనర్పదగునని సూచితమగుచున్నది.

రాగాలాపనము ప్రాయశః ప్రణవాత్మకముగా నొనర్చుట పూర్వాచారసంప్రదాయ సిద్ధమైనట్లు గోచరించెడిని. పూర్వగాయకులు సంప్రదాయజ్ఞులు 'తదరినతోం' అని గానముచేసెడివారు. ఈ యక్షరసముదాయము 'తదరే ఽనంతమోమ్' అనెడి వచనసంగ్రహముగ తెలియఁగదగును. కాన 'ఓం' అనిగాని, 'తదరే *అనంతం ఓం* 'అనిగాని యుచ్చరించుచు రాగాలాపన మొనర్పదగునని తేలెడిని. అటుగాదేని రామకృష్ణాది భగవన్నామ సంకలితముగానైన జేయదగును. ఇట్టిది గాత్రగానమందు సాధ్యముగాని వీణావాయులీనాది వాద్యగానమందు సాధ్యమా యందురేమో. అట్టియెడ గాత్రపోలె వాద్యకుడు ప్రణవస్మృతి సంతానముతో గాని, రామకృష్ణాది నామచింతనతో గాని వాద్యగాన

మొనర్పదగునని గ్రహింపవలెను. మఱియు నిట్టితో స్పష్టమధురచేహోలాది పంచదశ భేదవ్యాకృతంబులగు గీతోపయోగి శబ్దగుణములలోన చేహోలగుణయుక్తంబుగ గానమొనర్చుట నాదోపాసన కనురూపంబగునని పెద్దల యాచారముగ దోచెడిని. ఎటులన—

శ్లో. నాతిస్థూలో నాతికృశః
స్నిగ్ధ శ్చేహోలకో ఘనః
ఆకంఠకుంఠనం సస్యాత్
పుంసాం స్త్రీణాంతు సర్వదా (సం.రం.)

ఈ శ్లోకతాత్పర్యము శ్రీ కల్లినాథవ్యాఖ్య ననుసరించి యిటుల నుడువదగును.

'నాతిస్థూలంబును, నాతికృశంబును, స్నిగ్ధంబును, ఘనంబును నగు శబ్దము, అనగా స్వరాద్యుచ్చారణము చేహోలగుణకం బనబరగు; ఇట్టిది స్త్రీ కంఠమందు సహజభావితము; పురుషుల గాత్రమందో ప్రయత్నసాధ్యము. అట్టి ప్రయత్నము ఆకంఠకుంఠన రూపము. ఆకంఠకుంఠన మనిన మంద్రమధ్యమతార లనెడి మూడు స్థానములందును గంఠధ్వనిని మిగుల కుంఠన మొనర్చుట; అనగా అనతిబహిర్ముఖముగా గ్రహించుట, లేక ప్రసరింపజేయుట; ఇట్టిది వాయువు నటుల నిరోధించుటచే గలుగును; అప్పుడే ధ్వని నాతి స్థూలమును, నాతికృశము నై స్నిగ్ధమయ్యెడిని' అని తాత్పర్యము. ఇట్టి శబ్దధ్వనన ప్రయత్నపూర్వకమగు పురుషగానమును, అప్రయత్నముగ నగు స్త్రీ గానమును 'ఓమిత్యాత్మానం యుంజీత' అనెడి శ్రుత్యర్థ సన్నికృష్టమగుటచే నాదోపాసకులగు గాయనగాయనీ గణము ఈ యర్థమెఱిగి గానమొనర్పదగును.

రాగరూపకాలప్త్యాత్మకంబగు గానము రామాలంబనసమగ్రమగునెడల నెటుల నాదోపాసన మయ్యెడినో యీ క్రిందికీర్తనము స్పష్టీకరించెడిని—

ప. నాదసుధారసం బిలను-నరాకృతాయెరా ప్రణవ.
అ. వేదాగమశాస్త్రపురా-ణాదుల కాధారమైన.
చ. స్వరము లారునొకటి ఘంటలు
వరరాగము కోదండము, మే
దురనయదేశ్యము త్రిగుణము
నిరతగతిశరములు రా
సరససంగతి సందర్భము
లల గిరములు రా
ధర భజనే మోక్షమురా
వరత్యాగరాజవినుత !

ఈ కీర్తనమునందు శ్రీస్వామివారు శ్రీరామచంద్రుడు కేవలప్రణవస్వరూపుడుగా నధ్యవసాయలక్షణచే రూపకోత్ప్రేక్షాలంకార మట్టిపడునటులు వర్ణించుచున్నారు. 'నాదసుధారసం బిలను నరాకృతాయెరా ప్రణవ' అనగా 'ఆనందో బ్రహ్మ' 'రసో వై సః' ఇత్యాది శ్రుతిసూక్తులచే నానందస్వరూపముగా నిర్ణయింపబడిన పరబ్రహ్మము 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' లోనగు శ్రుతుల ననుసరించి ప్రణవాకారముగ ధ్యేయమగునదియే శ్రీరాముడుగా భూలోకమున నవతరించెనని భావము. అట్టి ప్రణవస్వరూపమగు బ్రహ్మమే వేదాగమాదుల కాధారమయినది, అనగా శాస్త్రయోని, అనగా శాస్త్రప్రమాణైకగమ్యమును శాస్త్రకర్తయు నగునదిగ వేదములు నిశ్చయించెడిని. అట్టి శాస్త్రయోని శ్రీరాముడే; ఒకమాటలోన రాముడనె అపరప్రణవముగా భావించి ధ్యానింపదగును; అట్టిచో పైన వివరించినరీతి ప్రణవవికారములగు షడ్జాదిస్వరములు శ్రీరాముని పరమచిహ్నమగు కోదండమున విరాజిల్లు సప్తఘంటికలు (చిరుగంటలేడు) రంజనాత్మకమగు రాగమే కోదండముగను, రాగమందలి ఘననయదేశ్యములనెడి త్రిపుటియే ముప్పేటల నగు నల్లెత్రాడుగను, ఆలప్తిక్రమమందలి నిరతగతి, అనగా దానియందు నిత్యనిరంతరముగా ననుస్యూతమగు లయతాళగతియే బాణప్రసారముగను, అట్టి యాలప్తి యందు 'సంగతులు' అనెడి సాంకేతికమున బ్రసరించు స్వరవిన్యాసములే రాముని రసవత్ప్రసంగములుగను, ధరయందు భజనమే మోక్షముగను, అనగా 'కలౌతు స్మరణాన్ముక్తిః' అను నార్షోక్తి ననుసరించిన శ్రీరామనామసంకీర్తనమే ప్రణవోపాసనమున నగు జీవన్ముక్తి ఫలముగను భావించి ధ్యానింపనగునని కీర్తనసమస్తము యొక్క సంగ్రహార్థము. ఇం దెంతేని యర్థ మిమిడి యున్నది. 'గాంధర్వవేదశాస్త్రం భగవతాభరతేన ప్రణీతం నృత్తగీతవాద్యభేదేన బహువిధోऽర్థః. దేవ

కారాధన నిర్వికల్పసమాధ్యాదిసిద్ధిశ్చ తస్య ప్రయోజనమ్మనెడి శ్రీ మధుసూదన సరస్వతుల 'ప్రస్థానభేద' గ్రంథోక్తి యచ్చో ననుసంధేయము. శ్రీరాముడే ప్రణవాశ్యకుడగు పరమాత్మస్వరూపుడనియు, బాహ్యాంతరంగభక్తిప్రపత్తుల నామకీర్తన శ్రవణాదులచే వాని నుపాసించుటచే ప్రణవోపాస్తిచే సన్యాసులకు గలుగు జీవన్ముక్తిరూపఫలము సర్వులకు సిద్ధించుననియు నీకీర్తనయొక్క అఖండతాత్పర్యముగ నవధరింపదగును. కావున భగవన్నామాలంబనంబగు సంగీతవిద్య ప్రణవాలంబనంబగు నాదవిద్యయని శ్రీవారిందు నిరూపించుచున్నారు.

ఇంతటి వాక్యార్థమున, దేలిన దేమన భక్తిజ్ఞాననిష్ఠంబు, అథవా జ్ఞానభక్తినిష్ఠంబగు సంగీతము రాగాలాపనాత్మకమగునపుడు ప్రణవోచ్చారణసమామ్నాతముగ గాని, తత్సన్నిహితంబగు రామాదిభగవన్నామోచ్చారణసమవేతంబుగగాని యుండదగుననియు, రూపకాలాపనాత్మకంబగునపుడు భగవన్నామరూపగుణానుభవసమగ్రంబగు గీతిచాతురీభాజనముగ భాసింపనగుననియు, నట్టిచో నగు ద్వివిధగానము సంగీతరూపనాదోపాసనమయ్యెకి నని సంగ్రహార్థముగ నిశ్చయింపబోలును. ఇట్టిద 'సంగీత శాస్త్రజ్ఞానము-సారూప్యసౌఖ్యదము' అగునది; లేక 'సంగీతజ్ఞానము భక్తివినా సన్మార్గము గలదే' యనదగినది. ఇచట జ్ఞానమనగా నుపాసనమని వేదాంత భాష్య సంప్రదాయము ననుసరించి చెప్పంగ దగియుంటచే నిట్టి సంగీతము నాదవిద్య, లేక నాదోపాసనమనియు, నిట్టిదిగాని గానము వట్టిసంగీతము, కళ యనదగినదనియు దెలిసికోదగును.

ఇట్టి నాదవిద్యయం దనుప్రవిష్టమగు భక్తి యనేమిగ శ్రీస్వామివారు నిరూపించిరని ప్రశ్నింపదగును. అయ్యది అనురాగాత్మకంబగు భగవన్నామరూపగుణస్మరణచింతనార్చన కీర్తనధ్యానాదివివిధరూప నిత్యానందకరమై భాసించును (౧) స్మరణే సుఖము రామ (౨) తెలిసి రామచింతనచే నామము సేయవే ఓ మనసా (౩) ఆరగింపవే పాలు (౪) రామా నీయెడ ప్రేమరహితులకు నీనామరుచి తెలుసునా (౫) భజనసేయరాదా (౬) ధ్యానమే వరమైన గంగాస్నానమే మనసా (౭) ఉయ్యాలలూగవయ్యా (౮) ఎంతముద్దు ఎంతసొగసు ఇత్యాద్యనేక కీర్తనములు నివేదించెడిని. ఇట్టి భక్తినిష్ఠంబగు గానముచే జ్ఞాననిష్ఠ సిద్ధించి జీవన్ముక్తుడయి మనుజుడు తరింపగలడని (౧) అనురాగములేని మనసున సుజ్ఞానము రాదు (౨) నినువినా సుఖముగాన (౩) నినువినా నామదెందు నిల్వదే శ్రీహరి శ్రీహరి (౪) విడజాలదురా నామనసు (౫) మరుగేలరా ఓరాఘవా ఇత్యాద్యనేకకీర్తనములు నిరూపించెడిని. ఇంతేల, శ్రవణకీర్తనాది నవవిధబాహ్యభక్తియు, భగవద్దివ్యవిభవవిభూతి స్మరణచింతనధ్యానాది లక్షణంబగు అనన్యైకాంతరూపాంతరంగభక్తియు నాదవిద్యాత్మకంబగు సంగీతమున ప్రధానాంగమని గ్రహింపనోపును. ఇటులగుటంజేసి సత్యాహింసవాది సామాన్యధర్మములు, స్నానసంధ్యాజపతప ఆది విశేషధర్మములు అనగా యమనియమసంజ్ఞిత ధర్మవిశేషములు అధికారప్రాపకంబులును అత్యాజ్యంబులనియు శ్రీవారి (౧) కొలువమరెగద (౨) ధ్యానమే వరమైన ఇత్యాది కీర్తనములు స్వకీయాచరణప్రముఖములయి బోధించెడిని.

ఇట్టిదగు నాదోపాసనము 'ఉపాసనంచ యథాశాస్త్రం తుల్యప్రత్యయ సంతతిరసంకీర్ణాద అన్యప్రత్యయై శ్శాస్త్రోక్తాలంబన విషయాచ' అనెడి శ్రీశాంకరభాష్యోక్తి ననుసరించునదిగ నుండనోపునుగాన నిత్య దట్టిదిగ నీవాక్యార్థమున రూఢమగుటంజేసి గురూపసత్తియు, సత్పురుషవ్యాసంగాదులను లేక యిది లభింపనేరదని శ్రీవారు (౧) గురువులేక (౨) బుద్ధిరాదు ఇత్యాదికీర్తనముల నుద్బోధించుచున్నారు.

ఇట్టిచో యోగులొనర్చు నాదోపాసనమునకును గాయకులొనర్చు నీ నాదోపాసనమునకును గల వైలక్షణ్యమిందు బరామృశ్యంబయ్యెడిని. 'తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్ ......మౌనంచ నిర్విద్య అథ బ్రాహ్మణః స బ్రాహ్మణః' 'బ్రాహ్మణో నిర్వేదమాయాత్' ఇత్యాద్యుపనిషద్వాదిభాష్య గ్రంథమందు బ్రాహ్మణునకే సన్యాసమం దధికారమని నిశ్చయించి సన్యాసియే సమాధియోగంబున కధికారి యని నిశ్చయించి 'ఏకాకీ యతచిత్తాత్మా' అనెడి గీతాభాష్య

ముందు శ్రీశంకరాచార్యులు కంఠోక్తిగ బల్కియున్నారు. దానంజేసి సన్యాసులకు సమాధియోగాంగంబుగ విధింపబడిన ప్రణవోపాసనము గృహస్థులు బ్రాహ్మణులయ్యును ఆచరింపరాదని స్పష్టమయ్యెడిని. ఇక నన్యుల విషయమును గూర్చి చెప్పనేల ! సంగీతరూపంబగు నాదోపాసనమున కీనియమము గానరాదు. దానంజేసి స్వకర్మనిరతులయి భగవద్భక్తిగల వారు సర్వులును సంగీతవిద్య కధికారులని గ్రహింపబోలును. 'దృష్టార్థాచ విద్యా ప్రతిషేధాభావమాత్రేణార్థినమధికరోతి శ్రవణాదిషు' అనెడి విధురాధికరణభాష్య వచనోక్తన్యాయము ననుసరించి సంగీతవిద్య సర్వులును అభ్యసింపగూడదు అనెడి నిషేధము లేకుంటచే మఱియు ప్రణవోపాసకుడు తానొక్కరుడే సమాధినిష్ఠుడై తరింపగలడు ; ఇక సంగీతరూప నాదోపాసకుడు తాను దరించుటయేగాక భక్తి తత్పరులగు శ్రోతలనుగూడ దరింపజేసెడినని 'మోక్షము గలదా' యనెడి కీర్తనముచే నర్థాదాపతితమగుచున్నది. మఱియు ప్రణవోపాసనమున ఉపాసకునకు ఉపాసనా సిద్ధియే ఫలము. నాదవిద్యారూపంబగు సంగీతముచే ఉపాసకునకు సిద్ధిరూపఫలంబును, శ్రోత భగవద్భక్తియుక్తుడుగాకుండినను దావత్కాలీనంబగు చిత్తనిర్వృతి ఫలంబును చేకూరును.

ఇంతవఱకు శ్రీవారి సిద్ధాంతముగ దేలిన దేమన, యోగులొనర్పదగు కేవలప్రణవోపాసనమే సర్వజన సామాన్యముగ సంగీతరూపమున ననుష్ఠేయమనియు, 'చతుర్విధా భజంతే మాం' ఇత్యాదివచనానుసారమగు భగవద్భక్తి గల ప్రతిమనుజుడును స్వధర్మనిరతుడై ప్రవర్తించుచు సంగీతరూపంబగు నాదవిద్య నభ్యసించి యిష్టార్థముల బడయుచు బరమపురుషార్థమగు మోక్షము బడయుదగుననియు, ఈ రహస్య మెఱిగి గానమొనర్పు గాయకుడు నాదోపాసకు డనియు, తదన్యుడు అనగా స్వధర్మనిరతుడు గాకయు, భగవద్భక్తి లేకయు విషయలోలుడయి గానమొనర్పునాతడు వట్టి గాయకుడుమాత్రమే యగుననియు అట్టివాని గానము (నృత్తాత్మకమగుగాక, గీతాత్మకమగుగాక, వాద్యాత్మకమగుగాక యెట్టిదయ్యును) నాదోపాసనము గానేరదనియు దాత్పర్యము. సంగీతము నాదవిద్యగ గ్రహించి గానమొనర్పు గాయకుడు సారూప్యాదిముక్తి భాజనుడు అగుననియు, తదన్యుడు ధనధాన్యాదిసంపదను బ్రాపింపగలడనియు నిచ్చో నెఱుంగవచ్చును.

శ్రీ త్యాగరాజస్వామి యిట్టి సిద్ధాంతమొనర్చి గృహస్థుగనే జీవయాత్ర గడిపి తానాచరించి యితరులచే నాచరింపజేసి అవసానకాల మాసన్నమగు తరి 'సన్యాసాదేవ మోక్షః' అనెడి శ్రుతి ననుసరించిన శ్రీ శంకరసిద్ధాంతము ననుసరించి లోకసంగ్రహార్థమై సన్యాసాశ్రమమును స్వీకరించి దేహత్యాగమొనర్చి విదేహకైవల్యము నందెను. శ్రీస్వామివా రవతార పురుషు లగుటంజేసి 'జనకాదయ.........కర్మ సన్యాసే ప్రాప్తేఽపి కర్మణాప హైవ సంసిద్ధిమాస్థితాః నకర్మసన్యాసం కృతవంత ఇత్యర్థః' అనెడి శ్రీ శాంకర భాష్యవచనము ననుసరించి సన్యాసనిష్ఠులయ్యు బాహ్యమగు లింగసన్యాసము స్వీకరింపకయే లోకసంగ్రహార్థమయి 'సక్తాః కర్మ ణ్యవిద్వాంసః' అనెడి గీతోక్తి ననుసరించి మెఱంగి అవసానకాలమున ఆశ్రమస్వీకృతి నంది విద్వత్సన్యాసులయి 'తస్య తావదేవ చిరం' ఇత్యాది సూత్రార్థమున కుచితముగ దేహత్యాగమొనర్చి బ్రహ్మనిర్వాణమొందిరని యెంచ నగును.



# కలగూరగంప

## ఆనంద కుమారస్వామి అస్తమయము

సుప్రసిద్ధ భారతీయచిత్ర, శిల్ప కళావిమర్శకుడు, అనితరసాధారణమైన తన పరిశోధక గ్రంథసముదాయముచే భారతీయ కళాఖ్యాతిని ఖండఖండాంతరములకు చాటిన సేవా జీవి అయిన డాక్టరు ఆనంద కెంటిష్ కుమారస్వామి చనిపోవుట (సెప్టెంబరు ౧౦-వ తేదీన, బాస్టనులో) మన దౌర్భాగ్యము.

ఈయన పుట్టినది సింహళములో; మెట్టినది సీమలో.

౧౮౭౭ ఆగస్టు ౨౨-వ తేదీనాడు ఈయన జననము. తదుపరి రెండేళ్ళకే తండ్రియైన సర్ ముత్తు కుమారస్వామి చనిపోగా, పసిపాపని వెంటబెట్టుకొని ఆంగ్లాంగనయైన అమ్మ ఆంగ్ల దేశమునకు తీసుకొనిపోయి అక్కడనే చదువుసంధ్యలు చెప్పించి పెద్దవానిని చేసినది. లండను విశ్వవిద్యాలయములో ఈయన డి. యస్ సి. పట్టభద్రుడైనాడు. అటుపిమ్మట జన్మభూమిమీద అభిమానము వదలలేక సింహళమునకువచ్చి, అక్కడ మూడునాలుగేండ్లు మినరలాజికల్ సర్వేకు దర్శకుడుగా పనిచేసినాడు. కాని, అట్టేకాలము ఆ పనిలో ఉండలేకపోయినాడు. అంతలో అంతరంగికమైన కళాభిమాన ముద్బుద్ధమైనది. పతనావస్థలో ఉన్న హైందవకళలను ఉద్ధరించవలెనని మనసు పుట్టినది. పుట్టినదే తడవుగా అందుకు సంబంధించిన ప్రాచ్యసారస్వతమంతయూ తరచినాడు. దేశదేశములు తిరిగి ప్రాచ్యకళావైభవమును కన్నులారా చూచి వచ్చినాడు. అందలి పరమార్థసౌందర్యములను ఆకళించుకొన్నాడు. తాను చవిచూచిన ఆ విశేషములనన్నిటిని వరుసపెట్టి గ్రంథస్థము చేసినాడు. ప్రాచ్య కళాపరిశోధకులలో ప్రామాణికపురుషుడైనాడు.



ఈ కళాతపస్సులోనే ఈయనకు బాస్టన్ లలితకళా ప్రదర్శనశాలలో దర్శకపదవి లభించినది. మనసుకు నచ్చిన ఉద్యోగమవుటవలన అందులోనే ప్రాణావసానమువరకు ఉండి, తన తపస్సును దివ్యముగా సాగించుకొని వచ్చినాడు.

ఇటువంటి కళామూర్తి అస్తమించినాడంటే, అది మన దౌర్భాగ్యముకాదూ?

---

## 'గారడీ' అద్దం

దొంగ ఎవరో, దొర ఎవరో తలుపులు తెరవకుండానే, లోపలినుంచి, క్షణమాత్రంలో కనిపెట్ట

వచ్చే ఈ 'గారడీ' అద్దాన్ని గురించిన వివరాలకు ఆగస్టు భారతి కలగూరగంప చూడునది. దీన్ని తలుపులకు బిగించుకొంటే గృహస్థులు దొంగలనుంచి జాగ్రత్తపడవచ్చు.



ఈ అద్దాన్ని ఒకవైపునుంచీ చూస్తే మీకు అవతలపక్క ఏముండేదీ కనపడదు, మీ ప్రతిబింబం మాత్రం మామూలు దర్పణంలో మోస్తరు ఈ అద్దంలో కనిపిస్తుంది. అదే అద్దాన్ని రెండోవైపునుంచి చూస్తే మామూలు గ్లాసుమోస్తరు దానిగుండా అవతలపక్క నుండే దంతా చూడవచ్చు. అంటే ఏమన్నమాట? ఆ అద్దము ఒకవైపునుంచి చూస్తే మామూలు చూపుదర్పణంమోస్తరుగాను, ఇంకోవైపునుంచి చూస్తే మామూలు Transparent గ్లాసుగాను ఉపకరిస్తుంది.

## అయస్కాంత పర్వతం

సుప్రసిద్ధ భౌతికశాస్త్రజ్ఞుడు న్యూటనుకు కలవరంపులు తెస్తూంది అమెరికా ఖండంలో వుండే ఒక చిన్న కొండ. 'నీ భూమ్యాకర్షణ సిద్ధాంతం అన్ని వస్తువులకూ వర్తిస్తుందిగాని, ఏదీ ఆ సూత్రాన్ని నామీద ప్రయోగించు చూద్దాం' అంటూ సవాలు చేస్తూంది ఈ నిర్జీవమైన కొండే.

అమెరికా సంయుక్తరాష్ట్రములు, కెనడా-ఈ రెండుదేశాల సరిహద్దుప్రాంతంలో లుట్జు (Lutz) అనే ఒకపర్వతశ్రేణి వుంది. ఈ వరుసలోనే ఈ విచిత్రపుకొండ వెలసివున్నది.

మీ మోటారుకారును తీసుకపోయి ఆ పర్వత పాదమువద్ద నిలపండి. అట్లా నిలిపేటప్పుడు ఆ కొండ దగ్గరకే వుండే వొక్క తెల్ల స్తంభమూ, మీ కారూ ఒకే తలంలో వుండేటట్లు చూడండి. ఆటుతరువాత మీరు కారులోని విద్యుత్ చాలనిని (Electric Motor) అపుదలచేసి, మోటారుబ్రేకు వదిలిపెట్టండి.

అంతే! మీరు బ్రేకు వదిలేస్తారో లేదో అదే క్షణం మీ మోటారుకారు దానంతట అదే కొండమీదికెక్కిపోతుంది. పోనుపోనూ దానివేగం కూడా జాస్తి అవుతుంది. పర్వతాగ్రంలో మోటారుకు మరీ ఎక్కువ వేగం (Maximum Speed) వుంటుంది.

చూచారా ఈ వింత? అన్నివస్తువులూ భూమివైపు పరిగెడుతూంటే ఈ కొండదగ్గర కారు భూమ్యాకర్షణశక్తిని నిరోధిస్తూ ప్రకృతికి విరుద్ధంగా భూమికి దూరంగా పైకి వెడుతూంది.

బహుశా ఈ కొండలో వుండే అయస్కాంతము మోటారును ఆకర్షిస్తూందేమో అని శాస్త్రజ్ఞుల ఊహ.

మరి అయస్కాంతముతో కూడిన అన్ని పర్వతములూ ఇలా ప్రవర్తించవే!

దీని భావమేమి తిరుమలేశ!

చెరుకుమూడి రాధాకృష్ణమూర్తి.



చికాగోలోని ఒక సర్కస్ కంపెనీకి చెందిన 'డెట్రాయిట్' అనే సింహం. మూడు చక్రాలసైకిల్ తొక్కడంలో శిక్షణ పొందుతున్న దృశ్యం. ఈఫోటో సింహానికి 8 అడుగుల దూరంనించి తీశారు.



# విమర్శనము



### చెన్నపట్నం - తెనుగుపట్నం

మొదటిభాగము. గ్రంథకర్త: రామచంద్రుని వెంకటప్పగారు, ౧౫ వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు. వెల రూపాయిన్నర.

పుట్టుకతో తెలుగుపట్నము; మొన్న మొన్నటి వరకు దీని సర్వతోముఖాభివృద్ధికి కారకులు తెలుగు వారు; దీని విషయమున నిన్నటివరకును ఎప్పుడును, ఎందునను ఆంధ్రులదే ప్రాబల్యము—అటువంటి చెన్నపట్నము మాదిగాక మాదే అని ఇప్పుడు అరవలు లేని పోని ఆర్భాటములు చేయుచున్నారు. ఈ విషయమై ఆంధ్రుల కింకను సరిగా కనువిప్పు కలుగక పోవుట చింతింప దగిన విషయము. ఇకనయిన మేల్కొని చెన్నపట్నము మీది తమ హక్కు భుక్తములను ఆంధ్రులు తమ ప్రథమకర్తవ్యముగా కాపాడుకొనవలసియున్నది. ఇది అక్షరాలా తెలుగుపట్నమనుటకు ఆధారములేవో, సాక్ష్యమేమో ఈ గ్రంథము విస్పష్టముగా, చారిత్రకముగా ఋజువు చేయుచున్నది. ఈ నగరముపై ఆంధ్రులకు గల హక్కును ఇది దృఢపరచుచున్నది. సమయానుకూలముగా ఇటువంటి చారిత్రక గ్రంథమును ప్రచురించి, ఆంధ్రులలో తగిన ఉద్బోధమును కలిగించుటకు పూనుకొన్న వెంకటప్పగారి పూనిక శ్లాఘనీయము, పాత్రమైయున్నది.

---

### చారుణి

రాజస్థాన కథావళియందలి పావురాల కథలోని ఒక అంశమును తీసుకొని, స్వీయములైన సంవిధాన పాత్రీకరణములతో చవులూరించు శైలిలో రచితమైన ఖండకావ్యము. కవి: పాటిబండ మాధవ శర్మగారు. ప్రాప్తిస్థానము: శ్రీ బాపూజీ గురుకులము, బాపూజీనగర్, బెజవాడ. వెల ౨ రూ.

### యాత్రికుడు

రచయిత: భాస్కరాచార్య రామచంద్ర స్వామిగారు. ప్రకాశకులు: సాహిత్యకుటీరము, జలదుర్గము, ప్యాపలి పోస్టు, కర్నూలుజిల్లా. వెల రూపాయిన్నర. రచయిత తన యనుభూతి కందిన, అనురక్తి రానందశక్తితో దా పాడుకొన్న కొన్ని గీతముల సంపుటి యిది.

---

### శాంతిమయి

అశోక చక్రవర్తి జీవితపరిణామమునుగూర్చిన చిన్న నాటిక. రచయిత: కొల్లిపాటి గంగాధరరావు గారు. ప్రకాశకులు: జాతీయకళామందిరము, బాపట్ల. వెల ౧౦ అ.

---

## గ్రంథ స్వీకారము

---

### శ్రీమదాంధ్ర మహాభారతము:
### 'బ్రాహ్మణసర్వ' పర్వము

ప్రథమాశ్వాసము: వేదవ్యాసమహర్షి ప్రణీతము. దుగ్గిరాల రాఘవచంద్రయ్య శాస్త్రిగారిచే సంపాదితము. ప్రకాశకులు: సద్బ్రాహ్మణాశ్రమము, బెజవాడ. వెల ౧౦ అణాలు.

### వేలిముద్ర

రచయిత: కె. యన్. రామమూర్తి గారు. ప్రకాశకులు: ఆంధ్ర పబ్లిషింగ్ హౌస్, ౨౬౭ చైనా బజారు, మద్రాసు. వెల ౧ రూ.

### అరుణాచల రమణుడు

రచయిత: జి. వి. యస్. భారద్వాజగారు. ప్రకాశకులు: శ్రీ రమణాశ్రమము, తిరువణ్ణామలై. వెల ౧౨ అ.

### శ్రీ వేంకటేశ్వర శతకము

కర్త: వావిలాల రామమూర్తిగారు, టీచర్, పి. వి. ఆర్. హిందూ మిడిల్ స్కూలు, ఒంగోలు.

### శ్రీ కృష్ణ భావనము

భక్త మీరాబాయి చరిత్రము. రచయిత: దంటు శ్రీనివాసశర్మగారు. ప్రకాశకులు: శ్రీ కవితామంజరి, బెజవాడ. వెల రూ. ౧-౪-౦.

### జాతీయ ప్రభుత్వము

రచయిత: ఆవుల గోపాలకృష్ణమూర్తిగారు. ప్రకాశకులు: ప్రజాసాహిత్య పరిషత్, తెనాలి. వెల ౮ అ.

### నాయకురాలు

చారిత్రక నాటకము. రచయిత: వావిలాల సోమయాజులుగారు. ప్రకాశకులు: సాహితీసమితి, గుంటూరు. వెల రూపాయిన్నర.

### ఎరుకల లచ్చిమి

గేయసంపుటి. రచయిత: కొప్పరపు సుబ్బారావుగారు. ప్రకాశకులు: మోడరన్ పబ్లిషర్స్, తెనాలి. వెల ౧ రూ.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No, 7, Thambu Chetty St., G T., Madras. Editor—S. Sambhu Prasad.